భాషాపాండిత్యము వలెనే ఆవశ్యకమని కార్మికులు కూడా అంగీకరిస్తారు గాని, అది అందరికీ ఆవశ్యకమని తలంచరు. అపరిచితభాషలు అభ్యసించడమునకు తీరిక, ఓపిక, ఆసక్తి గలవారు అవి నేర్చుకొని, వాటిలో రచితమైన గ్రంథము లందలి విషయములు దేశభాషలో సాధ్యమైనంత స్పష్టముగా ప్రకటీకరిస్తూ ఉంటారు. ఏభాషలోనున్నా, గ్రంథములో తెలుసుకోదగినది విషయముగాని, కేవల శబ్దముకాదు. మనదేశమందున్నట్లు ఆదేశమందు ప్రజలలో ప్రాచీనశబ్ద దేవతార్చనచేసే పామరులూలేరు, చేయిస్తూ జీవనముచేసే యాజకులూ లేరు. చేస్తే పుణ్యమనీ చేయకుంటే పాపమనీ చెప్పే పండితపరిషత్తులూ లేవు.

గడచిన యాభై అరవై సంవత్సరములలో ఇతర దేశములందు జరిగి నట్లే మన దేశమందున్ను పరిస్థితులు మారినవి. ప్రజలలో అనిర్వచనీయమైన నూతనోత్సాహము పుట్టినది. సంఘవ్యవస్థ, రాజ్యవ్యవస్థ ప్రజలందరి శ్రేయోభి వృద్ధికి అనుకూలమైనట్లు మార్చుటకు సాధనముగా విద్యావిధానము ఏర్పడినది. ఆపుణ్యకాలమందు ఇతరదేశములందు పరిణమించి ఉన్నట్లే, మనదేశమం దున్ను, విద్యాభ్యాసమునకు అనుకూలసాధనమై పరిణమించిఉన్న మనవ్యావహా రిక భాషే ఇతరదేశములలో చేసినట్టు, మనదేశమందు కూడా బడులలో విద్యా బోధకు సాధనముగా చేసిఉంటే, ఆ దేశములలో వ్యాపించినట్లే మనదేశమం దున్ను ప్రజలలో విద్య వ్యాపించి, మనదేశభాష మెరుగెక్కి ప్రకాశిస్తూ ఉండు నుగదా! సర్వజనసామాన్యమైన సారస్వతము విజృంభించి ఉండునుగదా! ఇంగ్లీషువారికైనట్టే సమస్తదేశముల విజ్ఞానమున్ను మన తెలుగువారందరికీ మన తెలుగులోనే సుగమము, సులభము అయి, వారివలెనే మనమున్ను విజ్ఞాన సంపన్నులముఅయి ఉందుముగదా! ఇతర జాతులవారితో మన తెలుగువా రున్ను సమముగా తులతూగుతూ ఉందురుగదా. ఇప్పుడు ఇంగ్లాండుదేశములో కుండలుచేసే కుమ్మరివాండ్లూ, గనులలో బొగ్గుత్రవ్వే ఉప్పరులూ, పొలములు దున్నే పాలికాపులూ, యంత్రాలుతోమే కూలివాండ్లూ, సామ్రాజ్యవ్యవహార నిర్వాహదక్షులగుటకు చాలినంతయోగ్యత వర్తమాన వ్యవహారాంగ్లభాషద్వారా సంపాదించినట్టే, మనదేశములోని కార్మికులుకూడా వర్తమాన వ్యావహారి కాంధ్రభాషద్వారా మనదేశవ్యవహార నిర్వాహదక్షులగుటకు తగినయోగ్యత సంపాదించి ఉందురుగదా! ఇంతకుపూర్వమే స్వరాజ్యము మనకు సిద్ధించి ఉండునుగదా! అయితే మనదురదృష్టమువల్ల చిన్నయసూరి గ్రాంథికభాషా దురభిమానము, విద్యాధికారుల అవివేకముచేత మారిమసగినట్టు చెలరేగి, వాస్తవమైన దేశభాషను నాశనముచేసి, మనకీదుర్దశ కలిగించినది. ఈమారీ బాధను తొలగించుటకే పదిపంద్రెండేండ్ల క్రిందట, పూర్వులతప్పు తెలిసికొని, ప్రభుత్వమువారు విశ్వాసములేని మనదేశ నాయకులు, ఈమారమ్మపూజారులను,

వారు ఆడించినట్లు ఆడి కేకలువేసే మారీభక్తులను వెనుకబెట్టుకొని, ప్రభుత్వము వారికి ప్రతిఘటించి, వారి ప్రయత్నము నిష్ఫలంచేసి ఆంధ్రసారస్వతనిర్మాణము తిరిగీ ఈ పూజారులకే గుత్తకిచ్చివేసినారు. ఇంగ్లాండులోని ఇప్పటికార్మిక మంత్రుల నోటినుండివెడలిన ప్రతి శబ్దమూ సభ్యమై సార్థకమై, టెలిఫోనుల ద్వారానూ, టెలిగ్రాపులద్వారానూ, కేబిల్గ్రాములద్వారానూ, వైర్‌లెస్సులద్వారానూ, మహాసముద్రములు దాటి, ప్రపంచమంతా వ్యాపించి మారుమోగుతూ పత్రికలలోను పుస్తకములలోను ప్రకటించుటకు యోగ్యమైఉంటే, మన పరిషత్తు పండితులు మాట్లాడేభాష అవాచ్యమా? నింద్యమా? నీచమా? "గ్రామ్య" భాషా? ఎంత అవివేకము! పండితులున్ను వారి నిరంతర బోధచేత మూఢులై వున్న వారి శిష్యులున్ను, మంచీచెడ్డా తెలుసుకోలేక ఎవరేమన్నా గంగిరెద్దు లాగున తల ఊపే పామరజనులున్ను సభ్యమని మెచ్చుకొనే "గ్రాంధికాంధ్రము" ఎవరినోటనూ వెల్వడదు; ఎవరిచెవినీ పడదు! ఇకనైనా పెద్దలు మేల్కొంటారా? మేల్కోరా? దేశీయ మహాసభ వారందరికీ వినబడేటట్లు "ఇకనైనా మేలుకోండి మనజన్మహక్కులను కోరండి!" అని ఆదిమాంధ్రకవి కుసుమ ధర్మన్నగారు తమ సంఘమువారిని వుద్బోధిస్తూ మేలుకొల్పు పాటపాడినారు. తమనోటిమాటే అవాచ్యమని అస్పృశ్యమని బహిష్కరించిన తమ పొరుగువారిని అవాచ్యులని అస్పృశ్యులని నిందించి మౌనవ్రతులై మడికట్టుకొని వేరేకూర్చున్న పండితులు ఇతరుల మొర్రవింటారా? ప్రజల వాడుకభాషయొక్క ప్రయోజనములు అంగీకరించని పండితులచేతిలోనున్న అంకుశము తీసివేస్తేనేకాని, ప్రజలహక్కులను నిరోధిస్తూ వున్నప్రభుత్వమువారి చేతిలోని అంకుశమును లాగివేసిన ప్రయోజనముండదు. నేడు ఆంధ్రరాష్ట్రము ఏర్పడవచ్చును; రేపు స్వరాజ్యము రావచ్చును; ప్రభుత్వము ప్రజాస్వామికము కానూవచ్చును. అయితే ఈ రోజులలో మన స్వాములు నిరక్షరకుక్షులయి వుంటే, దేశమునకు ఎంత వుపద్రవము కలుగునో మన దేశనాయకులు, దేశభక్తులు, దేశబంధులు లెస్సగా ఆలోచించవలసి వున్నది. మన తెలుగువారిలో నూటికి 90 మందికి ఇంకా ఓనమాలైనా రావుసుమండీ!

దేశ మన్నివిధములా అభివృద్ధిపొందడానికి అనుకూలమయేటట్టుగా, మునుపు వున్నట్టే, వర్తమానవ్యావహారికభాషే గ్రాంధికభాషగా అంగీకరించక తప్పదు అదే లోకైకశరణము. ప్రాచీనాంధ్రభాషారచన పోషించవలెనని ఆంధ్రసాహిత్యపరిషత్తువారికి వుద్దేశముంటే వారు అట్లు చేయవచ్చును. కానిఅందుకొరకై వ్యావహారికభాషను అణగద్రొక్కుటకు వారికి అధికారములేదు వారుచేసిన వ్యావహారిక భాషాబహిష్కారము గొప్పతప్పు. దేశాభివృద్ధికి ప్రతికూలమయినది. వారు చేసిన పని ప్రాచీన సత్ సంప్ర

దాయమునకు విరుద్ధమయినదని తెలిసినతరువాత నయినా తప్పు దిద్దుకొని బహిష్కారము రద్దుచేయుట వారికి విహితకృత్యము. చెన్నపట్టణమందు మొదట గ్రామ్యభాషా నిరసనసభ జరిగినప్పుడు అధ్యక్షుడుగా ఉండి పరిషత్తు వారి ఉద్యమమునకు ఆలంబన స్తంభమై నిలచిఉండిన కందుకూరి వీరేశలింగంపంతులుగారు దురభిమానము లేనివారు గనుక నావల్ల ప్రాచీన సంప్రదాయము తెలుసుకొన్న వెంటనే నాతో ఏకీభవించి వర్తమానవ్యావహారికాంధ్ర భాషాప్రవర్తక సమాజము (28-2-1919) తేదీన స్థాపించి వారే దానికి అధ్యక్షులయినారు.

౨

# రాజరాజు కాలమందున్న తెనుగుభాష

రాజరాజ నరేంద్రుని కాలమందు తెలుగుభాష ఎట్లుండెను? ఈ ప్రశ్న తక్కినవాటితోపాటు ఐతిహాసిక మండలివారి విచారణకు విషయము కాదగినదే. ఆరాజు రాజధాని "రాజమహేంద్రపురమే" నేటి మన రాజమహేంద్రవరమన్నట్లు ఆనాటి తెనుగుభాషే ఈనాటి తెలుగున్ను అని అంటే సూక్ష్మదృష్టిలేని లోకులు అంగీకరించనా ఐతిహాసికమండలివారు తృప్తిపొంది ఊరుకోరు. కొంచెము ఆలోచించి చూస్తే ఎవరికైనా తోచకపోదు. రాజరాజు గూఢచారులకైనా పోల్చుకొనుటకు శక్యముకాకుండా అతని రాజధాని మారిపోయి నేటి నగరమయి ఉన్నది. అతని కాలమందు నగరము సరిహద్దులు, వైశాల్యము, వీధులు, ఇండ్లు, కొలువుకూటము, రచ్చసావళ్ళు: సత్తరువులు. అంగళ్ళు, పానశాలలు, కార్యస్థానములు, జనులు, వారి ఆచార వ్యవహారములు వారి వృత్తులు, పురపరిపాలనము, విద్యలు, శాస్త్రములు, కళలు, పాటశాలలు— ఇటువంటి విషయములు వేనవేలు విమర్శించి నేటి స్థితికిన్ని నాటిస్థితికిన్ని గల సామ్యము వైషమ్యము తెలుసుకొంటేనేకాని వాస్తవముగా భూతార్థము నిశ్చయించలేము. రాజరాజునాటి నగరపటము నగర వర్ణనము, వ్యవహార ప్రదర్శని వార్తా పత్రికలు, నవలలు మొదలయిన సామగ్రి దొరికితే విషయ విచారణ సుకరమవునుగాని అట్టి సాధనములు లేవు. ఏది ఉంటే అది ఆధారము చేసికొని ఆకాలపుస్థితి తెలుసుకోవలెననే అభిలాష మనుష్యుల కందరికిన్ని సామాన్యమే, ఐతిహాసికులు సవిమర్శముగా విచారించి తెలిసికొనుటకు యత్నిస్తారు; సామాన్యులు వట్టి ఊహలతో తృప్తిపొందుతారు. ఎవరికైనా ఇప్పటివారి వ్యవహారమునకు ఆధారముగా పూర్వకాలపు నగరస్థితి ఉండవలెననే ఉద్దేశము ఎంతమాత్రమున్ను లేదు.

రాజరాజునాటి తెనుగుభాష రానురాను మారి నన్నయబట్టుకైనా బోధపడనట్టిదై నేటి వ్యవహారమందున్నది. ఆకాలపు లిపికూడా భాషవలెనే క్రమేణ మారిపోయినది. ఎవరికో మిక్కిలి శ్రమపడి నేర్చుకొన్న వారికితప్ప నేటి పండితులకైనా నాటిలిపి తెలియదు. వ్రాసిన అక్షరము వాత్మకలో కంటికి కనబడుతూ

---

ఈ వ్యాసము రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచికనుండి పునర్ముద్రితము.

ఉన్నట్టుఉండక ఏమాత్రము వ్యత్యస్తమైనా పోల్చుకొనుటకు సాధ్యముకాదు. అట్లే భాషలోని శబ్దములలో ఒక వర్ణము లోపించినా ఒక వర్ణము అధికమయినా ఒక వర్ణము (అచ్చుగాని హల్లుగాని) మారిపోయినా ఆశబ్దములు నిరర్థకములవుతవి. చూడగానే తెలిసేటట్టు వ్రాసిన అక్షరములున్ను, వినగానే తెలిసేటట్టు ఆడిన మాటలున్ను, మనుష్యులు తమ మనోభావములు ఒకరికొకరు తెలియబర్చుటకు సాధనముగా లోకములో వాడుకొంటారు. దేశభాష అనేది అట్టిసాధనమే. అనేక కారణములచేత ఈ సాధనము మారడము సాజమే. రాజరాజుకాలమందు వాడుకలో ఉండిన ఈ భాషారూపమైన సాధనము ఎటువంటిదో నిరూపించుటకు అప్పుడువ్రాసిన వ్రాతలు తప్ప వేరే ఆధారములేదు.

తెలుగుభాషనుగురించి ఆనుషంగికమైన విషయము ఒకటి విచారించవలసినది ఉన్నది. నేటి తెనుగుపండితులు లౌకిక వ్యవహారమందు లోకముతో పాటు వ్యావహారికభాష వ్రాసినా ప్రబంధములు మరిఒక విధమైనభాషలో రచిస్తారు. ఈ కావ్యభాషలో కొంతభాగము వ్యావహారికభాషలోనిదే. మిగిలినది విశిష్టమైన ప్రాచీనభాష అన్యభాషవలెనే నేర్చుకొంటేనేకాని తెనుగువారికి తెలియదు. రాజరాజనరేంద్రుని కాలమందుకూడా పండితులు తెలుగుభాష ద్వివిధముగా వ్రాసేవారా? ఏలాగున ఈ విషయము నిశ్చయించడము? కేవల లోకవ్యవహారముతో సంబంధముగల వ్రాత ఆకాలపుది దొరికితే అది ఈవిచారణకు తగిన ఆధారమవుతుంది.

రాజరాజు కాలమందున్న దెలుగుపండితుడు నన్నయభట్టు స్వయముగా రచించినవి ఈ రెండువిధములయిన వ్రాతలున్ను ఉన్నవి. భారతము కావ్యభాషను వ్రాసినది, నందంపూడి శాసనములోని గ్రామములోని సరిహద్దుల వివరణము వ్యావహారికభాషను వ్రాసినది అని ఊహించవలెను. రెండవదానిలో ఉన్న ఎనిమిదివాక్యములనుబట్టి ఆకాలమందుకూడా ఈకాలమందున్నట్టి భాషలో వైవిధ్యమున్నట్టు నిశ్చయించలేము: ఎందుచేతనంటే శాసనములోనిభాష భారతములోని తెలుగువలెనే ఉన్నది.

నన్నయభట్టు రచించిన భారతములోని భాష నన్నయవ్రాసినట్లుగా నేడు మనము చదువుకొనే పుస్తకములలో ఉన్నదా? నన్నయవ్రాసినదిగానీ ఆకాలమందు వ్రాసినదిగానీ ఒక ప్రతి అయినా నేడు మనకు దొరకదు. బుద్ధిపూర్వకముగా పండితులున్ను అబుద్ధిపూర్వకముగా ప్రమత్తులయిన లేఖకులున్ను భాష మార్చివేసినారని మనమందరమున్ను ఎరుగుదుము. అప్పకవి కాలమందే యిట్లు జరిగినది. వ్రాతప్రతులు చూచి పాఠమును "పరిష్కరించి" పండితులు అచ్చు వేయిస్తున్నారు. ఈఅచ్చుపుస్తకములలోని పాఠములు ఒక్కొక్కకూర్పులో ఒక్కొక్కవిధముగా మారుతున్నవి. ఆనంద ముద్రా

శరశాలలో 1907 వ సం నందు ముద్రితమైన గ్రంథము పీఠికలో పరిష్కర్తలు ఏమనివ్రాసినారో చూడండి "పండితులు దమకు సందిగ్ధములుగాను మూలమునకు విరుద్ధములుగాను లేక న్యూనములు గాను నున్నట్టి పట్టులందుఁ దమ కవనముతోఁ బాఠములను దోఁచినట్లు మార్చియుఁ గూర్చియున్నారు. కావున నీ తప్పులు ప్రథమ ముద్రణమునందలి కష్టబాహుళ్యమునుబట్టియు గ్రంథ వైపుల్యమునుబట్టియుఁ బెక్కులై యుండుటతోఁగూడఁ బండితుల సొంతకవనమునుం బట్టి సవరింపరానంత చిక్కులు నైనవి. దీనిని వ్రాఁతప్రతులనుగొని మఱల శుద్ధముగా సవరణ సేయఁజాలిన పండితులందులకుఁ బూనకుండుటచేతనో, పూనియు దానికి వలయునంత వ్యయప్రయాసముల కోపమిచేతనో, యోపియుఁ దగిన వ్రాఁతప్రతులు దొరకమిచేతనో, తరువాతి ముద్రణములన్నియు మొదటి ముద్రణము ననుసరించి గతానుగతికముగాఁ దప్పులకుప్పలైనవి. ఇటీవల రెండొక ముద్రణములు వ్రాఁతప్రతుల తోడ్పాటుతోఁ దప్పులు లేకుండునట్లు చేయబడినవనుటకాని చాలవఱకందును దప్పులు చూపట్టుచున్నవి. కనుక నీ గ్రంథమును మఱల వ్రాఁత ప్రతులతోఁబోల్చి సవరించుట యావశ్యకమయ్యెను."

ఇట్టివారు పరిష్కరించిన గ్రంథములలోకూడా అపరిమితముగా అపపాఠములున్నవి. ఈ అపపాఠములలోని శబ్దములు కోశములలో చేరినవి. అవి సప్రమాణముగాఁ గ్రహించి గ్రంథకర్తలు తమ గ్రంథములలో వాడుతున్నారు. ఆ విషయము అట్లుండనీయండి.

తాటాకు పుస్తకములలోని పాఠములయినా విశ్వాసార్హము కావని అప్పకవినాటినుండిన్ని లాక్షణికులు చెప్పుచున్నారు. బ్ర. శ్రీ. వఝ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిలవారు హరిశ్చంద్ర నలోపాఖ్యాన విమర్శనములో (చూ. పుటలు 85-87) "యథాస్థితిగా గ్రహింపఁదగిన నిర్దుష్టమగు మాతృక యొకటియైన గలదని యెవ్వరును జెప్పజాలరుగదా. ఇంతియకాక యాయా కాలములందుఁ బ్రసిద్ధములయి వాడుకలోనికి వచ్చియుండు వ్యాకరణముల యైక్యమునుబట్టియు, నాయా కాలముల వ్యావహారికాంధ్రముయొక్క యైక్యమునుబట్టియు సవరణములలో నట్టి సంవాదములు లభించినను లభించవచ్చును. అంతమాత్రమున నట్టి సంవాదము కవిప్రయుక్తతను దృఢముగా స్థాపింపఁజాలదుగదా. మఱియు మనకు దొరకు మాతృకలెల్ల సుమారు రెండుమూడువందల సంవత్సరముల లోపలివేగదా. తఱచుగా వానిలోని సవరణము లాంధ్రశబ్దచింతామణ్యప్పకవీయాదుల ననుసరించియే యుండును......ఇట్టి కారణములచేఁ గల్గు సంవాదములు ప్రమాణములని గ్రహించుట సరియా" అని వ్రాతప్రతుల దోషములు చూపించి, "ఛందోయతిప్రాసశ్లేషయమకాదులచే నిబద్ధములయి సామాన్య

ముగా మార్పరాని స్థలములే సందిగ్ధవిషయ నిర్ణాయకములగునని" లాక్షణికులు సిద్ధాంతము చేసినట్లు తెలియజేసినారు. కొందరు మహానుభావులు ఇట్టి స్థలమందున్న శబ్దములుకూడా తమకు అనిష్టమైతే దిద్ది గ్రంథములు పరిష్కరించినారు.

నన్నయ భారతములోని తెనుగు కొంత నేటి వ్యవహారములో నిల్చి ఉన్నా చాలా భాగము మారినందున, పండితులని పేరుగలవారు, ప్రబంధములు రచించిన కవులు, లాక్షణికులు, ప్రాచీన భాషాశబ్దములను గురించి తబ్బిబ్బులు పడుతున్నారు. రెండుమూడు విషయములు ఉదాహరిస్తాను. (1) "నమ్మనేరనయ్యెదను" మొదలయిన క్రియలు నన్నయభట్టేకాదు; తర్వాతి కవులు తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాధుడు వాడిఉన్నారు. ఆంధ్రశబ్ద చింతామణిలో గాని బాలవ్యాకరణములోగాని ఇట్టి శబ్దములకు అనుశాసనము ఏర్పడలేదు. కీర్తిశేషులయిన కొక్కొండ వేంకటరత్నము పంతులవారు ఇట్టి శబ్దము ప్రయోగిస్తే బ్ర. శ్రీ. వేదం వేంకటరాయశాస్త్రిలవారు వారిని పడతిట్టినారు. శ్రీనాధుని నైషధము ఈ శాస్త్రిలవారు పరిష్కరించి అచ్చువేయించినపుడు ఆ ప్రబంధములో ఇట్టి ప్రయోగములు రెండు కనబడితే తప్పులని దిద్దుటకు కూడా సాహసించినారు. ఇట్లే నన్నయాది ప్రాచీనకవులు వాడినవి, ఇచ్చిపుచ్చు మొదలయినవి, ఈ శాస్త్రిలవారే తప్పులనుకొన్నారు. (2) తెంచు అనుబంధముగా "ఏఁగుదెంచు, చనుదెంచు, తాఁకుదెంచు, అగుదెంచు" మొదలయిన క్రియలు అనేకముగా నన్నయ భారతములో నున్నవి. శబ్దరత్నాకరమందు "తెంచు" స్వార్థమందు వస్తుందని చెప్పిఉన్నదిగాని తప్పు. "ఏగెను" అంటే "పోయెను" "ఏగుదెంచెను" అంటే "వచ్చెను". ఇట్టి శబ్దములు సుపరిచితమయినవి కాకపోవుటచేత వ్యతిరేకార్థమందు ప్రార్థనార్థమందు తుమర్థమందు వీటికి ఎట్టి రూపములుండునో తెలియక తప్పులువ్రాస్తున్నారు. బ్ర. శ్రీ. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిలవారు తమ క్రొత్తతెనుగుభారతము (సభాపర్వము రెండవ ఆశ్వాసము 307 వ పద్యము)లో "తాఁకుదెంచఁగన్"అనిప్రయోగించినారు. మ. రా. కూచి నరసింహపంతులవారు తమ గౌరాంగచరిత్రమందు (చూ రెండవభాగము XI 1.44) "ఏతెంచుము" అని వ్రాసినారు. (3) బ్ర. శ్రీ. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిలవారు 'భాసనాటక కథల'లో "దశరధుని శరణుచొచ్చుము" అని శబ్దపరిచయము లేక, తెనుగురానివాడు "నీవు వచ్చుము" "నీవు వచ్చెవలెను", "వాడు వచ్చడు" అన్నట్లుగా ప్రాచీనాంధ్ర క్రియ వాడినారు. బాలవ్యాకరణములో వీటికి అనుశాసనమున్నా తెనుగుపండితులే ప్రమత్తులవుట సంభవిస్తున్నది. పండితులుకాని తెలుగువారు ఇట్టివ్రాతలు చదివేటప్పుడు, గ్రాంథికాంధ్రభాషలో తప్పొప్పులు తెలుసుకోలేక, "ఏతెం

చుము" "ఏతెంపుము," "ఏతెంపవలెను," "ఏతెంచఁడు" (అరసున్న తప్పకుండా ఉండవలెను.) "ఏతెంపఁడు" "వచ్చుము" "వచ్చవలెను" "వచ్చఁడు" చొచ్చుము, చొచ్చవలెను, చొచ్చఁడు, చొరి, చొరెను, చొటి, చొటెను; చొరిన మొదలయినవి ఎవరు ఏలాగున వ్రాసినా, వ్యావహారికభాషకు ఎంతవిరుద్ధముగా ఉన్నా, గ్రాంధికబాషలో అట్టి రూపములు సాధువులుకాబోలు, కాకుంటే గ్రంధకర్త ఎందుకు అలాగున వ్రాస్తాడు అని సమాధానము చేసుకొంటారు. పాపము! భ్రమపడ్డవారు మరేమి చేయగలరు? వేదం వేంకటరాయ శాస్త్రులవారే అలంకారసారసంగ్రహమునందు "అరయనద్భుత మిధ్యాశూరత్వోదార్య రచన చొఱునత్యుక్తిన్" అని "చొఱున్" ప్రయోగించి వ్రాసినారు. ఎవరు తప్పనగలరు? శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారు తమ భారతములో "చొరినన్" (ఆది X. 251) "చొరిన" (X. 244) "చొరితిని" (VII. 72) చొరి (IX. 272) అనే శబ్దములు ప్రయోగించినపుడు నన్నయాది ప్రాచీనకవులెవరైనా ఎక్కడైనా ఈ శబ్దములు వాడినారుగాబోలును. ఏవ్యాకరణములోనైనా వీటికి అనుశాసనమున్నది గాబోలును అని చదువరులు అనుకొంటారుగాని తప్పనుటకు సాహసిస్తారా? నావంటివాళ్ళుమాత్రము వీటిసాధుత్వము అంగీకరించుటకు పూర్వము ప్రమాణము చూపించవలెనని ప్రయోగించిన కవులను కోరుతారు. వ్యావహారికభాషలోని శబ్దములకు వ్యవహారమే ప్రమాణము, దానికి విరుద్ధమైన శబ్దములకు ప్రాచీనగ్రంధములలోని ప్రయోగములే ప్రమాణము. ఆ ప్రయోగములను అనుసరించిచేసిన అనుశాసనము చెల్లుతుంది. అపశబ్దములు (అనగా ఇప్పటి వ్యవహారములోగాని ప్రాచీనుల గ్రంధములలోగాని లేనివి) అనుశాసించుటకు ఏలాక్షణికునకిన్ని అధికారములేదు.

నన్నయభారతములో కనబడే భాషానియమములు తెలుసుకోకుండా పాఠములుమార్చి అపశబ్దములున్ను అర్వాచీనాంధ్రభాషాశబ్దములున్ను నన్నయభాషలో చేర్చి ఊరూపేరూతెలియని పరిష్కర్తలు ప్రాచీనాంధ్రభాష పాడుచేసినారు, తత్త్వాన్వేషణపరులు శ్రమపడి ప్రాచీనప్రతులు సంప్రతించి శుద్ధమయిన పాఠములతో భారతము తిరిగి అచ్చువేయిస్తేనేకాని, రాజరాజు కాలమందున్న గ్రాంధికాంధ్ర భాషాలక్షణము నిరూపించుటకు ఎవరున్ను పూనుకోలేరు. అంతవరకున్ను చేసేప్రయత్నములు సఫలముకావు.

అసత్యము సిద్ధాంతము చేసుకొని దుష్టలక్షణము ప్రమాణముగాగ్రహించి దురభిమానము, దురాగ్రహము గలిగి, భాషాతత్త్వమేకాదు, దేనితత్త్వమైనా తెలిసికొనుటకు ప్రయత్నించుట అనర్థకము. అట్టి ప్రయత్నము చేసేవారికి దురుద్దేశ మున్నదని వారిమీద ఆ నింద ఆరోపించకూడదు. సదుద్దేశముతోనే ఇట్టివారు (ఇతరవిషయములలో అత్యుత్తములు కావచ్చును.) చేసేపనివల్ల

తత్త్వము అడుగంటి లోకమునకు కీడు కలుగవచ్చును; కనుక వారి తప్పులు ప్రకటించడము తత్త్వప్రియులకు విహితధర్మము.

నన్నయ భారతభాష పరిష్కర్తల దోషముచేత నిరూపించుట కసాధ్యమయినా, నన్నయవాడిన వ్యావహారికభాష విమర్శించి వల్లనయినంతమట్టుకు దాని లక్షణము తెలుసుకోవచ్చును. భాషావిమర్శకులు శ్రీ సూర్యారాయాంధ్ర నిఘంటు నిర్మాతలు కవులు, ఆంధ్రపండితులు అని లోకమందు ప్రసిద్ధి పొందిన మ. జయంతి రామయ్యపంతులవారు స్వయముగా నందంపూడి శాసనము ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో (చూ. 1.1) ప్రతిబింబసహితముగా ప్రకటించినారు. నన్నయకాలపు లిపి పంతులవారివంటివారేకాని సామాన్యులు పోల్చుకోలేరు. నన్నయకాలపు వ్యావహారికభాషకూడా వారివంటి పండితులకే కాని ఇతరులకు బోధపడదు. ఇప్పటి అక్షరములతో శాసనము వ్రాసి ముద్రించి నారు. మనకు కావలసిన భాగము తెలుగువాక్యములు గలది ఎత్తి ఇక్కడ వ్రాసి చూపిస్తున్నాను. దానిలో నాకు తప్పులుగా తోచినవి తెలియజేసి పంతుల వారి "ఆంధ్రశబ్ద విమర్శనము"లోని గుణదోషములు విచారిస్తాను.

నందంపూడి శాసనములోని తెలుగుభాగము :

1. పూర్వ్వతః ఇయ్యూరియుంబిల్లెమ పెద్దపూణ్డియుం బొలగరుసున పల్లమున కొండి$_1$యగుంట నడుమసీమా।

2. ఆగ్నేయతః ఇయ్యూరియుం బిల్లెమపెద్దపూణ్డియు నెరపులయుం బొలగరుసున ముయ్యలి కుట్రు$_2$సీమా।.

3. దక్షిణతః ఇయ్యూరియు నెరపులయుం బొలగరుసున తాడ్లచేవ సీమా।

4. నైరృత్య$_3$ తః ఇయ్యూరియు నెరపులయు ముందరమునయుం బొలగరుసున ముయ్యలి కుట్రు$_2$సీమా।

5. పశ్చిమతః ఇయ్యూరియు ముందరమునయు మదకుటితియుం బొల గరుసున ముయ్యలికుట్రు$_2$సీమా।

6. వాయవ్యతః ఇయ్యూరియు మదకుటితియుం బిల్లెమ పెద్దపూణ్డియుం బొలగరుసునముయ్యలికుట్రున గొల్లచేవసీమా।

7. ఉత్తరతః ఇయ్యూరియుం బిల్లెమ పెద్దపూణ్డియుం బొలగరుసున (యే)*ఱువ గడ్డయసీమా।

8. ఐశాన్యతః ఇయ్యూరియు[4] బిల్లెమపెద్దపూణ్డియుం బొలగరుసున మట్టితోడితాటియోంద్ద చింతయసీమా।

---

1 కొణ్డి. కుట్ర. 3ర్య.

*సందిగ్ధములు. 4యుంబి.యొ—ఇట్లు శాసన ప్రతిబింబములోని వర్ణములు నాకంటికి కనబడుతున్నవి.

ఈ శాసనమునకు పంతులవారు వ్రాసిన అవతారికలోనే శాసనమందున్న ఆంధ్రశబ్దములు విమర్శించి కొన్ని విశేషము లుదాహరించినారు. (1) నన్నయకాలమందు వాడుకలోనుండే శబ్దములు కొన్ని (నందమపూణ్డి తాడ్ల, కుఱితి) మారి (నందంపూడి, తాళ్ళ కుఱ్ఱి) అని. నేటి వ్యవహారమందున్నవి; (2) గొల్లజేవ, ఏఱువగడ్డయవంటి కొన్ని శబ్దముల అర్థము విచార్యము; అనగా తెలియదన్నమాట. (3) "పొంగరుసుల్లోని" "పొళ్ళ" శబ్దము లేఖక దోషముల "పొలిమేర" లో ఉన్నట్టు "పొలిగరుసు" అని ఉండవలెనేమోనట! "నడుమ" ప్రథమైకవచనరూపమట! (5) "గడ్డయ చింతయ" శబ్దములు "గడ్డ" "చింత" శబ్దముల విశేషరూపములట! (6) "తాడ్లజేవ" అనగా "తాటిచెట్ల సమూహ"మట!

నన్నయ మాటలలో కొన్ని నేటి వ్యవహారములో లేకపోవడము కొన్ని మారడము, కొన్నిటికి అర్థము పండితులకైనా తెలియకపోవడము నావంటివారికి వింతకాదు! నన్నయనాటిభాష నేటివరకున్ను మారలేదన్న విశ్వాసము గలవారికి (పంతులవారు మొదలుగాగలవారికి) ఆశ్చర్యకరముగా ఉంటుంది. దానికేమిగాని అవిచారపూర్వమయిన తప్పు సిద్ధాంతములు, తప్పు లక్షణములు, తప్పు వ్యుత్పత్తులు పరమప్రమాణముగా మూఢవిశ్వాసముతో అంగీకరించేవారు ఎట్టి చిక్కులు పడుదురో పంతులవారు పడ్డ పాట్లనుబట్టి తెలుసుకోవచ్చును. "నడుమ" అకారాంత శబ్దమనుకొని ప్రథమైకవచన రూపమని నిశ్చయించుట "తాడ్లజేవ"లోని "జేవ" అకారాంత శబ్దమనుకొని దానికి ప్రయోగాంతరము స్ఫురింపకున్నదని జంకుచూ, సందర్భమునుబట్టి దానికి సమూహము అని యర్థము చెప్పుకొనవచ్చు"నని గప్పాకొట్టుట "గొల్లజేవ"కు "అర్థము విచార్య" మని మెలకువతో ఊరుకుండుట "గడ్డ"కు "గడ్డయ" అనిన్ని, "చింత"కు "చింతయ" అనిన్ని "విశేషరూపము" లని జంకకుండా అనుశాసించుట— ఈ తప్పులు అంతా ప్రాచీనాంధ్ర భాషాసంప్రదాయము పట్టుపడకపోవుట వల్లను ఈశబ్దముల చివరనున్న అకారము ఏవార్థకమని తెలుసుకోలేకపోయినందున సంభవించినది. నన్నయ వ్రాసిన ఎనిమిది వాక్యములలోను ఎనిమిది దిక్కుల సీమలున్ను వివరముగా ఉన్నవి. ప్రతివాక్యములోను చివరనున్న తెలుగుమాటకు ఏవార్థకమయిన అకారముచేర్చి "అదేసీమ" అనే అర్థము ఇచ్చునట్లుగా వ్రాసినారు. నన్నయకాలమందు ఏవార్థకముగా అకారము వాడుకలో ఉన్నదిగాని, మనకాలమందున్నట్టి ఏకారములేదు. ఏవార్థ కాకారసహితమైన ఇట్టి శబ్దములు 1 నడుమ (నడుము + అ) 2 ముయ్యలి కుఱ్ఱ (-కుఱ్ఱు + అ)

3 తాడ్లతేవ (-తేవు + అ) 4 ముయ్యాలికుట్ర 5 ముయ్యాలికుట్ర 6 గొల్లతేవ (తేవు + అ) 7 (ఏ) ఉవగడ్డయ (-గడ్డ + అ) 8 గింతయ (చింత + అ) వీటిలో "గడ్డయ" "చింతయ" శబ్దముల చివరనున్న "య" కారము ప్రమత్తులయిన చదువరులకు ఏవార్థకముగా తోచునేమో అని 'యకార మవధారణార్థక మనుట సమంజసముగాఁ గఁనబడదు." అని స్పష్టముగా పంతులవారు తమ నిశ్చితాభిప్రాయము తెలియజేసినారు :

పంతులవారి యభిప్రాయము తప్పుఅని చెప్పుటకు తగిన హేతువు లున్నవి. మొట్టమొదట భూదానశాసనములలో సరిహద్దులు వివరించి వ్రాసిన వాక్యములందు ఏవార్థము ప్రయోగించుట సంప్రదాయవిరుద్ధము కాదని చెప్పుటకు ప్రమాణముచూపిస్తాను. పిఠాపురమందున్న మల్లిదేవుని శాసనములో (చూ. ఎపి. ఇండి. IV. పుట 92) నందంపూడి శాసనములో నన్నయ వ్రాసినట్లే ఎనిమిదిదిక్కుల సరిహద్దులు చెప్పినవాక్యములలో కొనసు వరుసగా 1 ఎఱ్ఱగుంటయసీమా. 2 కాలియసీమా 3 గుణ్ణయసీమా. 4 గుంటయసీమా 5 గుంటలసీమా. 6 గట్టయసీమా. 7 గట్టయసీమా. 8 వంకలుసీమా అని ఏవార్థకాకారసహితముగానే శబ్దములున్నవి. అకారాంతేకారాంత శబ్దములకు పరమందు అకారమున్నచోట యడాగమమువచ్చినది అయిఎవ వాక్యములోని "గుంటల" అనేది బహువచనరూపమయిన "గుంటలు"కు పరముగా అకారమువచ్చినందున సంధిఅయి ఏర్పడ్డది. ఇట్లు పూర్వకాలమందు దానశాసన నిబంధనము లుండేవని తెలియకపోయినా ప్రాచీనాంధ్ర భాషాసంప్రదాయము లయినా తెలిసిఉంటే నన్నయశాసనములోనున్న ఏవార్థకాకారసహిత శబ్దములను గురించి పంతులవారికి కలిగిన చిక్కులు విడదీయుట కష్టముగా ఉండదు "నడుమ"లోని అంత్యవర్ణము ఏవార్థకమయిన అకారముకాదని తప్పుసిద్ధాంతము తలకెక్కి గట్టిగాపట్టుకోబట్టికదా నన్నయకాలము మొదలుకొని నేటివరకున్ను ఉకారాంతముగా లోకవ్యవహారమందే కాక గ్రంథములందున్ను వాడుకలో ఉన్న "నడుము" శబ్దము "నడుమ" అని అకారాంతముగా పంతులవారి వంటి పండితులుకూడా అనుశాసనము చేయుట సంభవించినది నందంపూడి శాసనములోనే 66 వ పంక్తిలో నన్నయ "రెండేఱులనడిమివిషయ" అని వ్రాసినాడు. గ్రాంథికభాషలో "నడుము" "నడిమికి" "నడుమన్" ప్రచురముగా నన్నయాదుల కావ్యములలో కనబడుచున్నవి. శబ్దరత్నాకరమం దుదాహృతమై ఉన్నవి. "నడుమ" అని పంతులవారు అనుశాసించినట్లు ఈశబ్దము అకారాంతముగా రూపాంతరమేమో అనుకొనుటకు ప్రమాణము లోకములోగానీ గ్రంథములోగానీ కానరాదు. "నడుమ" శబ్దముంటే "నడుమకు" "నడుమయందు" "నడుమలు" మొదలయిన రూపము లుండవలెనుగదా? అవి పంతు

లవారికి కనబడినవా ? లేకుంటే నడుమశబ్దము అపశబ్దము: వ్యావహారికము కాదు, గ్రాంథికముకాదు; అర్వాచీనముకాదు; ప్రాచీనముకాదు; పండితమ్మన్యులు కల్పిస్తూఉన్న కృతికగ్రాంథికాంధ్ర శబ్దములవంటిది గనుక కృతిక గ్రాంథికాంధ్రభాషా లక్షణశిరోమణిలో లక్ష్యముగా ఉదాహరించదగిన శబ్దము కావచ్చును ఇట్టివే "దేవ" "గడ్డయ" "చింతయ"లు; ఇవి భాషలో వాస్తవముగాఉంటే, "దేవలు" గడ్డయలు" "చింతయలు" "దేవకు" "దేవలకు" "గడ్డయకు" "గడ్డయలకు" "చింతయకు" "చింతయలకు" అనే రూపములు కూడా ఉండవలెను. పంతులవారు ఎక్కడనయినా ఇవి చూచినారేమోకాని నాకుకానరాలేదు; ప్రమాణము చూపించకుండా వీటికి అనుశాసనము చేస్తే చెల్లుతుందా ? వారి చిత్తం !

అవిమర్శపూర్వకమయిన సిద్ధాంతమును పరమ ప్రమాణముగా విశ్వసించేవారి మనోవృత్తులతోపాటు ఇంద్రియ వ్యాపారములుకూడా విపర్యస్తము కాక తప్పదంటారు. అందుకు తార్కాణముగా పంతులవారి విమర్శనములోని విషయము ఒకటి చూపిస్తాను. రెండవ నాలుగవ అయిదవ వాక్యముల చివరను "కుట్ర" అని మూలమందున్నది. శాసన ప్రతిబింబములోనున్న ప్రాచీనలిపి పోల్చి తెలుసుకోగలవారు "కుట్ర"లోనున్న రెండవ అక్షరము "ట్రు అని చదువరు. చాలాసంవత్సరముల క్రిందట ప్రసిద్ధపండితుడయిన కీల్‌హార్న్‌గారు ఈ శాసనము ఎపి. ఇండి. 4 వ వాల్యుములో ప్రకటించినప్పుడు ఆయన ఈ వర్ణము "ట్ర" అనే మూడుచోట్లను పఠించినారుగాని "ట్రు" అనుకోలేదు. "ట్ర "కున్ను "ట్రు" కున్ను నన్నయలిపిలో భేదము స్పష్టముగా కనబడుతున్నది. ఆరవ వాక్యములో "కుట్రున" అని పంతులవారు పఠించినట్లే కీల్‌హారన్‌గారు కూడా పఠించినారు. ప్రతిబింబములో ఈ భేదము ప్రాచీనలిపి తెలియనివారికయినా కనబడుతుంది. ఇంత స్పష్టమయిన అక్షరమును సరిగా పోల్చుకోకుండా కొమ్ములేనిచోట కొమ్ము కనబడేటట్లుగా దృష్టిదోషము కలుగజేసి పంతులవారివంటివారిచేత కూటకరణము చేయించినదేమిటి ? లోకమందు సుప్రసిద్ధముగా ఆబాలగోపాలము అందరికీ తెలిసిఉన్న "దేవు" శబ్దము దేవ శబ్దమని తోచునట్లు భ్రమపుట్టించి, దానికి "సమూహ"మని అపార్థము కల్పించేటట్లుచేసిన అవిమర్శపూర్వక సిద్ధాంతమే-అవధారణార్థకమయిన అకారము ఈ శబ్దములకు పరమందుండుట సమంజసము కాదనుకోవడమే.

పంతులవారి విమర్శనములో మరియొక చిత్రమైన విశేష మున్నది. అర్వాచీనుల భాషలోని శబ్దముయొక్క రూపమునుబట్టి వ్యుత్పత్తి కల్పించి, ఆ వ్యుత్పత్తి ప్రమాణముగా గ్రహించి, ప్రాచీనుల భాషలోని శబ్దముయొక్క

రూపము తద్భిన్నముగా నున్నదని తప్పుపట్టి దిద్దుటకు సాహసించినారు. భాషా తత్వజిజ్ఞాసకు దురభిమానముగాని పక్షపాతముగాని ప్రతికూలముగా ఉంటుంది. మనవ్యవహారములో ఇప్పుడు "పొలిమేర" అనే శబ్దమున్నది; కాని "పొలమేర" లేదు. శబ్దరత్నాకరమందు మొదటిదిమాత్రమే కనబడుతున్నది; అందు "గ్రామద్వయమధ్యసీమ" "ఎల్ల" అని అర్థములున్నవి: కాని ప్రయోగములు లేవు. కాశీఖండమందు (వావిళ్ళవారి అచ్చుపుస్తకము 111. 116) సీసగీతిలో ప్రయోగము "పోలిమేరసీమ" అనిఉన్నదని నేను జ్ఞాపకము పెట్టుకొనిఉన్నాను. అయితే, లాక్షణికులు అంగీకరించదగిన స్థలములో అనగా యతిస్థానమందు "లి" వర్ణములేదు. శ్రీనాధుడు "పొలమేర" అని వ్రాసినాడో "పొలిమేర" అని వ్రాసినాడో దీనినిబట్టి తేలదు. ప్రాచీనప్రతులలో "పొలిమేర" అనిఉన్నా అర్వాచీన లేఖకులు తమ వాడుకచొప్పున "ల" వర్ణము తప్పని దిద్దిఉంటారు. అచ్చు వేయించుటకు పరిష్కరించే పండితులయినా మార్చిఉంటారు. ఇట్టి మార్పులు అనేక శబ్దములలో కలిగినవి. నేటి లోకవ్యవహారమో, శబ్దరత్నాకరమో ప్రమాణముగా చేసికొని, నన్నయవాడిన "పొలగరుసు" శబ్దమందున్న "పొల" లోని "ల" వర్ణము లేఖకదోషమయి ఉండునేమో అనిఊహించి, పంతులవారు "పొలిగరుసు" అని దిద్దవలెనంటారు ; "పొలి" శబ్దము "బలి" శబ్దభవమట ; కనుక "లి" వర్ణము సాధువు, "ల" వర్ణము అసాధువు అని వారి అనుశాసనము. అయితే నన్నయ వ్రాసిన ఎనిమిది వాక్యాలలోనున్న (ఒకొక్కదానిలో ఒకొక్కమారు) ఎనిమిదిమార్లు ఈ శబ్దము ఏకరూపమున "పొలగరుసు" అని ప్రయుక్తమయి ఉన్నదే. ఎనిమిదిచోట్ల శాసనము చెక్కిన గండాచార్యుడు ప్రమత్తుడై "లి" వర్ణము "ల" వర్ణముగా మార్చి ఉండడము సంభావ్యమా ? "పొలమేర" అని మూలమందు కాశీఖండములో శ్రీనాధుడు వ్రాసినా అర్వాచీన లేఖకులు తమవాడుకలో "పొలిమేర" అని ఉండుటవల్ల ఉద్దేశపూర్వకముగా గానీ ప్రమాదముచేతగానీ లవర్ణము లివర్ణముగా మార్చినారనుట అసంభావ్యము కాదు. "పొలిగరుసు" అని నన్నయ వ్రాస్తే గండాచార్యులు "పొలగరుసు" అని ఎనిమిదిచోట్ల మార్చుటకు కారణము నాకు కానరాదు. "పొలగరసు" ఈ ఒక్క శాసనములోనే కాదు. కలుచుంబఱ్ఱు శాసనములోకూడా ఉన్నదని పంతులవారెరుగుదురు. "పొలమేర" అని లకారాకారయుక్తముగానే అనేక శాసనములలో ఉన్నది క్రీ. శ. 1358 సం. నందుపుట్టిన దోనెంపూడి శాసనమందు (చూ. ఎపి. ఇండి. IV. పు 359) "పొలమేరలు" కనబడుచున్నది. అల్లాడ వేమారెడ్డి శాసనమందు (చూ. ఎపి. ఇండి. XIII. 248-250) ఆరుచోట్ల "పొలమేర" అనే రూపమున్నది. కాటయవేమని తొత్తరమూడి శాసనమందు (పంతులవారు పరిష్కరించిన పాఠములోనే) నాలుగుచోట్ల "పొలమేర" అనే

ఉన్నది. (చూ. ఎపి. ఇండి. IV. 324) నేనెరిగినంత మట్టుకు ప్రాచీనుల వ్రాతలలో ఎక్కడా "పొలిమేర" కానరాదు. కన్నడ భాషనున్న ప్రాచీన శాసనములలోకూడా "పొలసీమె" లకారాకార యుక్తముగానే పొలశబ్దము కనబడుతున్నది. (చూ. ఎపి ఇండి. X. 66) కిటిల్ రచించిన కన్నడనిఘంటువులో పొలశబ్దమునకు, దిక్కు అనే అర్థముకూడా ఉన్నది. కన్నడ శబ్దము ప్రధాన ప్రమాణమని చెప్పలేదుసుండీ.

శాసనములు రాగిపట్టాలమీదను రాతిపలకలమీదను ఏలాగున మొదట చెక్కినారో అలాగుననే ఉన్నవి. తాటాకు పుస్తకములు అట్టివికావు. మొదట వ్రాసినవి నశించినవి. ఇప్పుడు మనకు దొరికేవాటిలో అనేకము మన తండ్రి తాతల తరమున వ్రాసినవి. ప్రతినిచూచి ప్రతివ్రాస్తూ లేఖకులు గ్రంథము నశించకుండా కాపాడేవారు. అయితే గ్రంథము నిలుచుటకు ఇది అనుకూలించినా గ్రంథములో అల్పముగానో అధికముగానో మార్పులు కలుగుటకు కారణమయినది. శాసనములలోని భాష యథాస్థితిగా ఉండుడబట్టి విచక్షణులయినవారు శబ్దములరూపములు అర్థములు ఏకాలమం దెట్లున్నవో తెలిసికొనుటకున్ను గ్రంథకర్తల భాషయొక్క సాధుత్వాసాధుత్వములు విమర్శించుటకున్ను లేఖకులభ్రమ ప్రమాదములవల్ల కలిగిన మార్పులు కనుగొనుటకున్ను తాటాకుపుస్తకములకన్న శాసనములు ఎక్కువఅనుకూలముగాఉంటవి తాటాకుపుస్తకములయినా, మెలకువతో పండితులు మాతృకలోఉన్నట్టు వ్రాసినవైతే ఇంచుమించుగా నిర్దుష్టమని నమ్మదగిఉంటవి. అట్టివి రెండుమూడు చూచినాను. అటువంటి ప్రతులు ప్రాచీన గ్రంథములకు దొరికితే, అమూల్యములని భావించవలసినవి. దొరకనప్పుడు ఎవరేమి చేయగలరు? శాసనములున్ను తాటాకు పుస్తకములున్ను సంప్రతించి వివేకముతో విమర్శనము చేసి, భాషాతత్వ జిజ్ఞాసువులు అవలంబించిన అన్వేషణ క్రమానుసారముగా కంటికి కనబడుతూఉన్న సిద్ధశబ్దములు లక్ష్యముగా గ్రహించి వాటికి బాధకముగా కాకుండా లక్షణము నిరూపించడమున్ను అవశ్యకమయితే లక్షణము మార్చడమున్ను పంతులవారివంటి పండితులకు విహితధర్మము; అవిమర్శపూర్వకమయిన సిద్ధాంతమునకు విరుద్ధముగా ఉన్న శబ్దములు ఆసిద్ధాంతానురోధముగా మార్చివేయుట నింద్యమయినపని. నన్నయ స్వయముగా వ్రాసినవ్రాత ఎదుటనుంచుకొని (నన్నయ సమక్షమందు?) రాగిరేకుమీద గండాచార్యుడు యథాస్థితిగా శాసనము చెక్కినట్టు శాసనమందే ఉన్నదిగదా. దీనిలోనిభాష నన్నయకాలమందున్న తెనుగనుటకు ఇంతకన్న విశ్వసనీయమయిన ప్రమాణము ఏది సంభావ్యమో నాకు తోచదు. శాసనమే కూటకరణమైతే నిరాకరించవచ్చును; కాదని నమ్మవలసినప్పుడు పరమప్రమాణమే. నన్నయకాలమందున్ను అతనితర్వాతను శ్రీనాథుని కాలము

వరకున్ను శాసనస్థమై "పొలగరుసు" "పొలమేర"శబ్దములున్నవిగనుక,ఆకాల మందు ఆశబ్దము అట్టిరూపమున ఉన్నదని ప్రాచీనాంధ్ర భాషాశబ్దానుశాసన మున్ను అర్వాచీనుల వ్యవహారమందు "పొలిమేర" అనే రూపమున్నందున దానికి అనురోధముగా అర్వాచీ నాంధ్రశబ్దానుశాసనమున్ను చేయుట పాణిన్యాది శబ్దానుశాసకుల సంప్రదాయము. వేదములలోనున్న భాషకున్ను వాటితర్వాత పుట్టిన ఇతిహాసములు, పురాణములు, ధర్మశాస్త్రములు మొదలయిన గ్రంథము లలోని భాషకున్ను సామాన్యమయినది కొంతఉన్నా అర్వాచీన గ్రంథము లలో కానరాక వేదములో మాత్రమేఉన్న శబ్దములు ప్రాచీనములవుటచేత వాటికి వేరే అనుశాసన మేర్పడినది. కోశమందున్ను వ్యాకరణమందున్ను వీటిలక్షణము యథాస్థితిగా నిరూపితమయిఉన్నది. ఇట్లే ఇంగ్లీషు భాషాశబ్దాను శాసనము ద్వివిధముగా ఉన్నది. ప్రాచీనమయిన ఇంగ్లీషు శబ్దముల లక్షణము కోశమందున్ను వ్యాకరణమందున్ను ఇంగ్లీషుపండితులు నిరూపించి ఉన్నారు. ఆప్రకారము తెలుగుభాషాపండితులు ప్రాచీనాంధ్రశబ్దలక్షణము నిరూపించడము నకు పూనుకోవలెను. ఆపనికిదాటాకు పుస్తకములున్ను శాసనములున్ను ఆవశ్యక మయిన సామగ్రి-పరమాధారము. అవిమార్చివేస్తే ఇంతంతని చెప్పరాని కీడుకలు గుతుంది. మార్చేవారికి దురుద్దేశములేకపోవచ్చును. మార్పువల్ల సత్యముమరుగు పడుట సంభవించవచ్చునుగనుక, ఉద్దేశముమంచిదే అయినాఆపని అనర్థకము.

"పూర్వలిపిని బాగుగఁ జదువలేకపోవుటచేతఁగాని శాసనములఁ గ్రమ ముగ సమన్వయించుకోలేకపోవుటచేతఁగాని కొందఱపార్థములు చేసికొని వానిని సిద్ధాంతములుగాఁ బ్రకటింతురనుటకిదియొక దృష్టాంతముగా గ్రహింపవచ్చును అని మన పంతులవారు తమకు పుల్లరిబోడు మీదనున్న శాసనమును జతపర్చిన చిలకా వేంకటకృష్ణయ్యగా రన్నమాటను పట్టి హితోపదేశముచేసినారు. వేంకట కృష్ణయ్యగారు ప్రాచీనలిపి తెలియక, "దల్లి సూరాంబచే" అనిశాసనములో ఉంటే "డిల్లి సూరాంబాధా" అని చదువుకొని శాసనములో డిల్లీ సూరాంబాధా కున్ను కొండవీటి రెడ్లకున్ను జరిగిన యుద్ధము వర్ణించబడినదని చెప్పినారట. (ఆం. సా. పత్రిక. 264) ఇట్లే "మల్లియరేచ" అనేశబ్దము బ్రౌన్ దొరగారి పండితులు సంప్రదాయ మెఱుంగక "మల్లయరేచ" అని దిద్దినారని పంతుల వారే ఆక్షేపించినారు (చూ. ఆం. సా. పత్రిక. V. 4) ఇట్లు ఇతరుల అవి వేకమును ఉద్ఘోషించి గ్రంథపరిష్కర్తల కుచితధర్మముపదేశించిన పంతులవారు స్వయంగా పరిష్కరించిన శాసనములలోని మూలగ్రంథమందు చేసిన మార్పులుచూస్తే, "శాసనాత్ కరణంశ్రేయః," అన్ననీతి జ్ఞప్తికివచ్చినది.

పంతులవారు ప్రకటించిన ప్రాచీనశాసనములలోని గ్రంథము మూల మునకు విరుద్ధముగా పరిష్కరించుట మిక్కిలి శోచనీయముగా ఉన్నది.

యుద్ధమల్లుని శాసనము, ఓపిలిసిద్ధిరాజు కొణిదెన శాసనము, శ్రీనాధుని కృతు లయిన కొండవీటి రెడ్లనాటి శాసనములు ప్రాచీనాంధ్ర భాషాస్వరూప నిరూపణమునకు ఆధారమయిన సామగ్రిగా ఎన్నదగినవి వీటినిపట్టి వాస్తవ మైన భాషానియమములు తెలుసుకొని, అచ్చుపడ్డ భారతాది ప్రాచీనగ్రంథము లందున్ను కోశములందున్ను వ్యాకరణములందున్ను గలదోషములు తొలగించ వలసిఉండగా, ఆదోషములు సాధువులుగా గ్రహించి, వాటికి అవరోధముగా శాసనములలోని భాషదిద్దడము పంతులవారికి అవశ్యకమని, ఉచితమని తోచ డము ఆంధ్రభాషా పాండిత్యముయొక్క దౌర్భాగ్యమని నాపరితాపము తెలియ జేస్తున్నాను. తాటాకులమీద వ్రాసిఉన్న చంద్రభాను చరిత్రము * మూలమునకు విరుద్ధముగా కొన్ని శబ్దములరూపము దుష్టలక్షణము ప్రకారము మార్చి పరిష్క రించి ఆంధ్రసాహిత్యపరిషత్తువారు అచ్చు వేయించినట్లే రాసుయ్యపంతులవారు పరిష్కరించిన పాఠములుగల గ్రంథమే శాసనముల గ్రంథముగా అచ్చు వేయించి ప్రకటించి ఉంటే, పరిష్కర్తలు చేసిన మార్పులేవో తెలియక కృతి కర్తలు వ్రాసినవే అని లోకము మోసపోవుటకు కారణమవును. అయితే మూల మునుపట్టి వీరు చేసిన తప్పులు దిద్దుకొనుట విమర్శకులకు కష్టమయినా అసా ధ్యముకాదు. ప్రాచీనాంధ్రభాషా విశేషములలో ఆదేశములు, ఆగమములు, అర సున్నలు మొదలయినవికొన్ని స్పష్టముగా నిరూపించలేక లాక్షణికులు తప్పులు చెసినారు. అటువంటివి సవరించుటకు ఈ శాసనములలో సాధకమయిన ప్రయో గములున్నవి. అవి పంతులవారి పరిష్కరణములో చెడిపోయినవి. రెండు మూడు అంశములు మాత్రమే ఉదాహరిస్తాను. "పరగు" శబ్దములో అంత్య వర్ణము బిందుపూర్వకముగా శబ్దరత్నాకరమందున్నది. అందుకు ప్రమాణముగా ఇచ్చిన మార్కండేయ పురాణములోని ప్రయోగము అచ్చుపడ్డ గ్రంథములో కానరాదు. చక్కగా వ్రాసిన తాటాకుపుస్తకములలో కూడా (భారతాది ప్రాచీన గ్రంథములందు) పరగు శబ్దములో అరసున్న కనబడదు. ప్రాచీన శాసనము లలో అరసున్నకు గురుతుగా నిండుసున్నే ఉంటుంది: కొన్నిటిలో అనునాసిక వర్ణమే ఉంటుంది. (మల్లుణ్ణిఅని) మీదచెప్పిన శాసనములలో "పరగు" శబ్ద మందు బిందువులేకున్నా, అవిమర్శపూర్వక నియమమును అనుసరించి అంధ పరంపరాగతమైన అరసున్న దూర్చి పరిష్కరించి తమపాఠము ప్రకటించినారు.

"పాకనాంటి" "కమ్మనాంటి" అని కొణిదెన శాసనములోని సబిందుశబ్ద ములు పరిష్కరణములో నిర్బిందువు లయినవి

---

* నేను స్వయముగా తైఫారువేసి చూచినాను. వ్రాతప్రతిలోనున్న శబ్దములు అచ్చులో కనబడవు.

అచ్చుభారతముతో "ఎందుఁబోయితివి" అని "ఎందు"కు పరమందు అరసున్న, దానికిపరమందు గజడదబాదేశములు కనబడుతున్నవి; కాని వ్రాత ప్రతులలో అందు, ఇందు, ఎందు కళలుగాను వాటికి పరమందున్న కచటతప లకు గసడదవా దేశములు రావలసినట్టుగాను పాఠములు కనబడుతున్నవి. ఈ శాసనములలోకూడా, తాటాకుపుస్తకములలో ఉన్నట్టే మూలమందు పాఠము లున్నా పరిష్కృతపాఠములు అచ్చుపుస్తకములలోని తప్పు పాఠములను అనుసరిస్తున్నవి. యుద్ధమల్లుని శాసనమందు "ఇందుప్రత్యక్షమై" అని మూలమందుండే "ఇందుఁబ్రత్యక్షమై" అని పంతులవారు దిద్దినారు. కొణిదెన శాసనమందు "తమ్ముండు ప్రతాపమున" అని మూలమందున్ను "తమ్ముఁడు ప్రతాపమున" అని పరిష్కృత పాఠమునందున్ను ఉన్నవి. అచ్చు భారతములోకూడా అక్కడక్కడ ప్రాచీన సంప్రదాయము కనుబడుతున్నది. (చూ. విరాట. 111 28. ఆనంద ముద్రణము — ఉర్వీజముల్ వ్రాఁకి) కొణిదిన శాసనమందు మూలములో ఆ దేశములు యథావిధిగా ఉన్నవి. "ముల్లోకవిభుండు సక్రి" అని కృతికర్త వ్రాసినది తప్పుగా నిరాకరించి ముల్లోక విభుండు చక్రి" అని పంతులవారు దిద్ది అట్లు దిద్దుటకు కారణము ఏమని చెప్పినారో చూడండి; "విభుండు చక్రి యను నవిరెండును సంస్కృత శబ్దములే యగుటచేఁ జవర్ణమునకు సవర్ణమురావచ్చునని వైయాకరణుల మతమయినను నిచ్చట సవర్ణము శ్రుతి కటువుగానున్నది. మరియుఁ జవర్ణము యలవ్యము. సవర్ణము దంత్యోచ్చారణము గలది." ఇట్లు తమ యిష్టానిష్టములే సాధుత్వా సాధుత్వములకు ప్రమాణముగా విధించి ప్రాచీనుల కృతులలోని భాష దిద్దుటకు సాహసించేవారు ప్రాచీనాంధ్ర భాషానుశాసకులుగా నుండుట ఆంధ్రభాషాపాండిత్యము నోచిననోముల ఫలముకాక మరేమిటి? తిక్కన విరాట పర్వమందు "ఎలుంగుసలింప" (చూ. 11. 139) అని వ్రాసినాడయ్యా అంటే పంతులవారు "మాచెవికి ఇంపుగాలేదు గనుక తప్పే; తుడిచిపారవేయవలెను" అని శాసిస్తారు; లోకము నోరుమూసుకొన వలసినదేనా? శ్రీనాథమహాకవి క్రీ. శ. 1416వ సం జనవరి తే 14 దీని స్వయముగరచించి వ్రాసి సంతకము చేసి రాతిమీద చెక్కించిన శాసనములోని భాష "శిలాక్షరము"లుగా నేటికిన్ని ఉన్నది. దానిలో "అరిరాయ బసువశంకరుండు" అని రాజుయొక్క బిరుదు పేర్కొన్నాడు. అందులో ఉన్న "బసువ" శబ్దము తప్పని "బసవ అని చదువుఁడు" అని పరిష్కర్తలు అనుశాసించినారు, అని తల్లికలువచేరు శాసనములోకూడా (చూ, 98 వ పంక్తి)"బసువశంకరః" అని ఉన్నది, అది తప్పని ఈ పరిష్కర్తలు చెప్పక ఊరకున్నారు. అప్పుడు అది ఒప్పుగా కనబడ్డది గాబోలు. వారి చిత్తం, ఆంధ్రభాషభాగ్యం! శ్రీనాథుడు నైషధమునందు

(చూ VI. 145) "అరివీరబసువశంకర" అని వ్రాసినట్లు అనేక వ్రాతప్రతులలో కనబడుతున్నది. కాని, వేదము వేంకటరాయశాస్త్రిలవారు పరిష్కరించి అచ్చువేయించిన పుస్తకములో "బసవ" అని ఉన్నది. శబ్దరత్నాకరమందు "బసవడు" "బసవన" ఉన్నవి; గాని "బసవ" లేదు. పంతులవారలు శాస్త్రిలవారలు ఏప్రమాణమును బట్టి "బసువ" తప్పన్నారో చెప్పరు.

పైనివివరించి చెప్పినదానిని పట్టి ప్రాచీనాంధ్రభాషా స్వరూపము నిష్కృష్టముగా నిశ్చయించి నిరూపించుటకు తగిన సాధనసామగ్రి సంపన్నము కాలేదని చదువరులు తెలుసుకోవచ్చును. అందుకు ఆధారముగా ఉన్న ముఖ్యగ్రంథములు అన్నీ అవివేక పరిష్కరణమువల్ల అప్రమాణమైనవి. అపశబ్దములు అర్వాచీనశబ్దములు ప్రాచీనుల భాషలో చేరినవి. వాటినిపట్టి వాస్తవమైన భాషా నియమములు ఏర్పరచుట అసాధ్యము. భాషా విమర్శకులకు విహితమైన ధర్మములు తెలుసుకోదగినవారుకూడ వాటికి విరుద్ధముగా ప్రవర్తిస్తున్నారు. ఐతిహాసిక మండలివారికి వాస్తవమయిన ఆంధ్రభాషా చరిత్రము నిర్మించవలెనని అభిలాష గాఢముగా ఉన్నదని అనుకొంటాను. వారి అభిలాష నెరవేరవలెనంటే, ప్రాచీనాంధ్ర గ్రంథముల వ్రాతప్రతులు ఆధారముగా చేసుకొని, పక్షపాతము లేకుండా, తత్వ జిజ్ఞాసతో, సవిమర్శముగా సంప్రతించి పాఠమును పరిష్కరించవలెను. ఇది మొట్టమొదట చేయవలసిన పని. అన్ని గ్రంథములకన్నా భారతము గొప్పది: అందులో నన్నయ రచించిన భాగము ఆదిమాంధ్ర కవిత గనుక పరమాధారమయినది. దానిలోని పాఠములు సాధ్యమయినంత మట్టుకు వాస్తవమని విశ్వసించదగినట్టుండవలెను. విశ్వసనీయముకాని గ్రంథము ఆధారముగా నిరూపించే లక్షణము అవిశ్వసనీయము కాక తప్పదు. దానికై పడ్డపాటు వ్యర్థము. అందుచేతనే మ. చిలుకూరి నారాయణరావుపంతులు గారు మొదలయినవారు ఈ విషయమై కృషిచేసినవారైనా నిరుత్సాహులయి ఊరకున్నారు. ఇప్పుడున్న లక్షణగ్రంథములు-కోశములు గానీ, వ్యాకరణములు గానీ ప్రమాణముగా అంగీకరించదగినవికావు. అప పాఠములుగల గ్రంథములనుండి ఎత్తికొన్న శబ్దములు సాధువులుగా అంగీకరించినవారు నిర్మించినవిగానీ నిర్మించబోయేవిగాని, లక్షణములు ఎందుకు ప్రమాణమవుతవి? శబ్దరత్నాకరమందున్న శబ్దములు ముద్రితగ్రంథములలోని పాఠములకు విరుద్ధముగాఉంటవి. ముద్రిత గ్రంథములందున్న పాఠములలో వైవిధ్యమున్నది.

రాజరాజనరేంద్రుని కీర్తికి పరమాధారముగా నన్నయ రచించిన భారతమున్నది. ఇది రాజమహేంద్రవరమందు వెలసినదవుటచేత దీనియందు అక్కడి వారికి అత్యంతగౌరవ ముండుట ఉచితమే వారితోపాటు తెలుగువారందరున్ను దానిని ఆదరిస్తున్నారు. అయితే తెలుగు పాండిత్యముయొక్క దురదృష్టముచేత

నన్నయభారతము పుట్టి తొమ్మిది శతాబ్దములయినా, నిర్దుష్టమై విశ్వసనీయమైన పాఠములుగల గ్రంథము దొరకదుగదా ఇంతవరకున్ను తగిన ఉద్యమముచేసి ఈ పవిత్రగ్రంథము యథాస్థితిలోనికి ఉద్ధరించక ఉపేక్షించి భాషాభిమానులు దోషులయినారు. ఇకనైనా ఆ పనికి పూనుకోకపోతే తెలుగువారి భాషాభిమానము మిథ్య అని తెలుగువారికి అపకీర్తి కలుగుతుంది. మహానుభావులు, కార్య దక్షులు పట్టుదలతో పనిచేస్తే శీఘ్రముగానే ఉద్దేశము నెరవేరుతుంది. ఇప్పుడు విజృంభించిన దేశాభిమానమున్ను భాషాభిమానమున్ను వాస్తవమయితే ఈ కార్యము చేయబూనుకొన్నవారికి కావలసిన సాయము దొరకకపోదని నమ్ము తున్నాను.

3

# ప్రాఁ దెనుఁగుఁ గమ్మ *

సిరిఁదాల్చు పేఁడొగిఁ జిన్నిచూడ్కులఁజూచు తెనుఁగుఁ జదువుల రచ్చ తీర్పరులార !

గ్రిందను గైవ్రాలు సేసిననేనయా ! యణఁకువ మెఱయుచు, నాయొప్పు కొలఁదిఁ, దెనుఁగుఁ జదువులగుఱిచి, జానుమివులంగఁ, దొలితెనుఁగు నుడులన, తేటతెల్లగను, విన్నపమొక్కండు వినుపింతు మిమ్ము. మోడ్చియునిరు చేయి, మ్రోఁకరిలఁబడియు, నెఱఁగియుఁ గైవార మొనరంగఁజేసి, తద్దయు వేఁడుదు. నాలింపుడయ్య. మీరపోలెను నేనుఁ బ్రాఁబొత్తములు సాలఁజదువు లేన; యొకింత సదివితినేని, మీరపోలెను నేనుఁ బ్రాఁబల్కులను వ్రాయ నేరనయితిన సామకోర్చి యెన్నడును. మీకుఁ బోలెన నాకు వ్రాయంగఁగాదేని, మీఱట్టులకు మాఱువల్కంగఁగాద, యని మీరు గడిఁదిగాఁ గట్టడి సేసితిరవె; యది నే వినియిదియల్లినాడఁ; గాకేను మీతోడ నెనసి తూఁగుదునె ? మీరేడ ? నేనేడ ? జగజెట్టులరవె ! నాయెఱిఁగినవి గొన్ని ప్రాఁబల్కులేర్చి, యింబుగా నిండిడితిఁ బాడిదప్పకయ. యట్లయ్యు, నేదేని, దప్పు మొగపడిన మన్నింపుడని మిమ్ము దురపిల్లివేడ; వేఁడంగ నేటికి ? నేలంటివేని, నావ్రేళ్ళ నులివెట్టి. నానాల్క నదికట్టి, మ్రోఁచేత వ్రాయు, ముక్కునఁబల్కుమన్నఁ, దిన్నంగనా చొప్పుసేయనోపుదునె? నిచ్చలు మిముఁబోలెమాటలాడెదను; మాటలాడినపగిది వ్రాలువ్రాయంగనేర్తు నించుక నేనుఁ బెక్కండ్రమాడ్కి, నట్లు వ్రాయఁగఁ బంపవ్రాయనునాను. బాపురె ! మీవలెమరగాళ లెక్కి చిందులుద్రొక్కంగనతఁ గులకౌనె ? పడుచులేచుచుఁ బాఁపమెలికలఁ దారినడుచుచు నవి నుఁడీ లెస్సయని

---

* ఇక్కమ్మనుడులను నాయిచ్ఛపై నేనుగూర్చితి, నానాల్కకనువగు నట్టు; చదువరి వీనుల కించెడునట్టు పద్దెంబు లివియని పేర్కొన్నివ్వనేను; బద్దెంబు లనిపల్కప్రాఁబడిఁ బరికించి కీడని దూరఁగఁదగదేరికేని. గద్దెకూర్పు నకునై కట్టడిలేద గద్దెయ కాదీని గడియింప నురదె? చుక్కలు గుఱుతులు నానేర్చినట్ల చదువంగ నొనగూరు పొంకెనునిచితిని; దప్పేనిఁ బెద్దలవి యుఱ కయ చదువుండ.

ఈ వ్యాసము ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికనుండి పునర్ముద్రితము.

చూసి, యొజ్జలు మిమ్మెద్ది గఱపిరి దానిన మఱగిమెత్తురు మీరలోల్ల రొండెద్ది. యాటపాటల నారితేఱినవారు దొమ్మర్లు నవధానులెందఱేఁ గలరు. బుఱ్ఱతో నేలపై వారు వాఱుదురు; వీరు వింత వింతగ జదివి బెకబెకమంచు నార్తురు, మాటలు దలక్రిందుసేసి; బళెబళెయని యెల్లరార్తురును మెచ్చి. యేరికిఁ దెలియ దయా చదువుతీరు. దారయెఱుంగర తమమాట తెన్ను. విద్దెయట్టిది యొకటి గొండొకనేర్చి, కొలువులోఁ గొనియాడ నియ్యసేయుదురె? యలవడమినిఁజేసి తడఁబడుదు మోక్కా, తడబడ నల్వురును నగరెయని వెఱచి మిన్నకుందురు గాక, తెగుదురె యేరు? విద్దెయనునది నెఱిగ నలవడవలయు; నేర్పు చక్కఁగ మెఱయ నోపఁగ వలయుఁ. గానినాడోడరె వెఱివుచ్చి పఱప? దువ్వాల నేపులలోనేనుఁగులను మావుల నెలుఁగులఁ గ్రోఁతులఁ బెంచి వానిని దగ్గఱి యొడయంద్రు ద్రిక్కనేరాడఁగాఁజేయు వారలయ్య? వేఁగి నాటికి నేని, పగికాటికినేని వేఁటరా వేఁటవో నేరికగునయ్య? రాయలకగుఁ గ్కాక, ఱేండ్లకగుఁగాక. మీమెచ్చు తెనుఁగదిగడు గరిడిబిద్దె మొదలేనిఁ దుని యేని మొగపడదరయఁ; ద్రోవ దెన్నులు నేరు నేర్పర్పలేరు; నిచ్చలు సాదనసేసిననకాక, యొనఁగూడదేరికినిఁ దరిదాఁక వలను; బ్రదికెడు ప్రొద్దెల్లఁ జాలదది నేర్వ నొజ్జల తఱచుగాఁ బొరపడుచుంద్రు; ననుఁబోనివారల మాటేటికయ్య? మీరచ్చ గండలయాన, నలవడని సాము సలిపెద; దాన దొసఁ గొదవెనేనిఁ దొసపు నాయదికాద; ననురేఁచువార దెప్పనఁ దమపాలుదగుఁ దార కుడువ. సిగ్గరినేనిము సిగ్గఱి, నేను దెగియించితిని; దాని దోసముగ రోయఁదగునేని నది నాదు తప్పనఁగఁజెల్లుఁ,

దెనుఁగు నాటను గలరు దొల్లింటి పెద్దలు నేలదయ్యాలు నానాపాఱువారు, పాఱుల ప్రానుడులు దయ్యాలనుడుల. నాడునాఁటికి నవినాటను మొలఁగె; మొలఁగినన్ బెద్దలు వొత్తమ్మలోనఁ దొల్లిఁటినుడులనగిచ్చి చదివెదరు. దెన్నాటి కాఁపులఁ గలియఁ బాఱులకు నలవడిన దానాఁటి తెనుఁగుల పలుకు, దయ్యాల మినుకులు, వడనాట్లనుడులు దెన్నాట్ల నుడిగమి నల్లనఁజేరఁ, దొలితెనుఁగు బాఁపల బాసయ్యెఁ గావలయుఁ. బెద్దలదగుట నాపాఱుల బాసకలయంపి మిహిఁ గొని, కాఁపులు దనియ, దొడ్డదై నాటను మెప్పొందెఁ దాను. తొంటి పెద్దలు దారెవరైరివో, తమనాట తెల్లమౌ తెనుఁగు మాటలను బాఁపల ప్రాఁబలుకు లవి కొన్నిగూర్చి, పద్దెములుగానల్లి కమ్మపై గివ్వఁ, దెనుగుఁ, బొత్తముఁ జదువు వడచూపు నయ్యెఁ. బాఱులు దక్కంగ దెయ్యాల బస నొద్దులు చదువంగ దొస వొందుఁగానఁ గాఁపుల బాసతో నొగి దీనిఁబొదివి కలుపుడు. (గాపువి దొలుట కతనఁ, బ్రామిన్కు లయ్యును మయిలంది, యవియు, గాఁపు మాటల మయిపడి నొప్పెనాఁగ) నిడుమలు మఱి పొఱయ వనెడు నమ్మిగను బాఁపలు దమప్రాఁత కబ్బములలోని ప్రాదయ్యముల కతలు నేర్పుమైఁ దిగిచి,

తెనుఁగుఁ గాఁపులకును బున్నెమ్ము పొంటెఁ దెనుఁగునఁ బద్దెంబు లల్లి విను పించి, తెలియని నుడులను దెలియంగఁ జెప్పి, యెఱిగించి రిట్లుగాఁ బెద్దయు మేలు దెనుఁగుఁ గాఁపులకు నాగురువులిడిరి. గాఁపులకునయన నేల ? బాసపను వారు దీపారు కైసేఁతదీర్చిరిగాదె ? నన్నయఁ దిక్కనిం గీతన దొట్టితొలి కయిత కారెల్లరానాఁట గోలెఁదారు, దమవార లొండొరులతోడనిచ్చ లెయ్యు యినుడులు లొనివెడువార లానుడులఁ గయితంబు గూర్చుచు, నదియుఁ గమ్మగాఁ దనరెఁ గావలయుఁ జూరె. వారి కూర్పులు సూడఁ దోఁచును గాదె చాలఁగాఁ గాఁపుఁటయ మాటచొప్పు? వారి పిదపటివార లంతకంతకును గయి తమ్మ గారడిబిద్దెగాదిద్ది కయితంబు బాసను గకవికలు సేసి, సింగారమునకునై సిగ్గు డిగఁద్రావి, రోతయించుక లేక పాడిగడి మివిలి, బూతులు, అంకులు వొందించి చొన్పి, లంజెలమైజిగి మెఱమెచ్చియాడి, రాజుల రెడ్లను బెల్లించ పుచ్చి, కూర్మియు నెయ్యమ్ముగ్గలరట్లు తోతేర వేనవేల్ బొంకులు బొల్లి పాడి యును నిచ్చకమ్ములు సెప్పి తమ కరువుఁగూడు గొనుటకు నొండెను గాసుకు నొండెఁ దమకయిత కన్నెలవారికిఁ దార్చి, బాసవెలందిని వెలయాలిఁజేసి. వెల యాలి మటుమాయ యాకెకు మరపి, మిఱుమిట్లు గొల్పఁగా గద్దెనెక్కించి, నేలకు సానిగా దాని నెలకొల్ప; అంకులాడియ మేటినాఁడెపగు మిన్నయని యుచ్చమల్లిని నందొఱు గొల్వఁ, దొంటివాస వెలంది గటకటా క్రుళ్ళి తెవులు గదిరిన చివుకులంజెయయి త్రెళ్ళెఁ.* ద్రెళ్ళనన్, సోఁకుడు దవిలినవాండ్రు పీనుఁగు నెక్కొల్పి మెఱుగులు వూసి, దానిఁ గౌఁగిటఁచేర్చి ముద్దాడుచుండ్రు. చవిగ్రోల నడియాసఁ బంటను నొక్కెడ రెండినవాతెఱ; దొండపండంటె । రిమ్మెత్తినట్టులు నాకుడుఁ గుడుచుచు రిత్తచవులకు మెచ్చియార్చుచుండురెల్ల వెంటకు గొఱంతించుకేనియులేక, యెల్లెడ నెప్పుడుఁ గూర్చునమ్మ దియఁ గ్రేడింతురరయ్య గ్రేఁగంటనేనిఁ. జూడుడి తెనుఁగుల నెటిచేనినడత! తన యాలు మొఱటని వెంగళిజేడొకఁడు లంజెనుఁ జేపట్టి తనసానిసేసి; పాటలు, సదువులు, నాఁడెమ్ము, సొబగు, గఱపింి, యెన్నియేన్ మెఱుంగులు దిద్ది, తానింద్రుఁ డది రంబయని పాటపాడించి, తనకోర్కిదీడేరెనని త్రుళ్ళుచుండ నాయెద్దెమయిపడి లిబ్బికాండ్రందు బెక్కండ్రు రేమటి. తెల్విదక్కి, తమ యాండ్రురును మొరటు లని తారు పగచి, కల్లమిసుముల వాడలంజెలనుఁ జేరి మొఱటుఁదనమునుదలఁగి నాఁడెమ్ము గ్రోలఁగడఁగుదురయ్యారే యాయబ్బ కాండ్రు । పెద్ద లీచొప్పున లంజెను నాఁడెంపు రాణిగానెన్నుచు, పగనాలిదెగడి యెబ్బెరా సిది యని యేవగింప. నట్టి పెద్దల నడయ మేల్పాడిగాఁ దలచి ప్రజ లదియ కొనియాడ నయ్యెఁగావలయు.

---

* మ. రా. శ్రీ, జయంతి రామయ్య పంతులుగారి

అట్లుండెనది; నిజము దలపోయుఁడయ్యా. మగవాఱు మొఱటయిన మగ నాలుగదె కాన్చుకొలము పెంపొనఁ గూర్చు కొడుకుఁ కూఁతు ? నాఁడెమ్ము గలదయిన నంటుకత్తియ సంతు గోర రయ్యెదరుగా. బాఁపలేని. మగనాలు మొఱటట్టె! యాకలో నేటిమొఱటొక్కొ? మగనాలి తన మదియ మొఱబె? మాలతొత్తేనియు మగనాలకావలచు; మెచ్చదు లంజెలమైబొల్లి మెఱుఁగు, తొడి కట్టి. పూసినన్ లంజెఁ బెండ్లముగఁ జేపట్టనోడును జెంచువాఁడేని. నాఁడెమది యేటిది? లంజెలన కాని మొలకెత్తి యదిగెరల నోపదొక్కొ ? మగనాలి తన మున నాఁడెమ్ములేదె ? మగనాలి పోఁడిమి, మగనాలిసిగ్గు, మగనాలిసొరణ, మిసిమియు, సొరు, మగనాలిపేరిమి, మగనాలిపొత్తు, మగనాలిసొజంపు మరి యాదసొంపు, మగనాలి నిక్కింపుఁ బరువును, బెట్టు, నివియెల్లఁ గొఱగాని పని యాగడారి, మనువు తీరెల్లను బ్రతుకు తెన్నెల్లఁ గువలంగఁ ద్రోయరెకల్ల గొని యాడి ? మన లెస్సబాసయ కాదె మగనాఱు ? మెఱపేని మిన్నయేన్ మనుదల దానన. మొఱపేనిఁ దప్పు మనయదియ కాదె? మొఱటు మొఱటనిబానిఁ దెగడు టయ కాని పేరు దిద్దిరి మెఱుగులు దానికయ్యె? మరియాద దానికి గఱపంగఁ గాకేమి ? వాడవదినియ పాటి నేం దయ్యెడిదె ? లంజెకున మరియాద నెక్కొ న్నదొక్క ! మగనాలి యచ్చమై దిరుగునొక్కొ ! మగనాలి నడతకు లంజియ నడతకుఁ గల వాసిగనలేని యెఱుకవాండ్ర సన్నపు తలపులన యిప్పాటులెల్ల బాటిల్లె మననాటఁ గను విచ్చిచుండు. నేటుసేయంగను నోపుడురేని, ముంగల వెనుకల నరసి కనుఁడు. యిచ్చమైఁ దిరిగిని, నిలువాడు మగనాలు సొజంపు మేరలు మీర దెన్నడును. బొల్లిమరియాదల నెడ్డెళ్ళ నేమట్చి లంజియ గదె దాటు మేర లెల్ల! లంజెల నాడెమ్ము సక్కటిగా పఱలు నాటను మనుదల యీచఁబోదె ? యెయ్యేని నాటను మగవాండ్ర సొజపుంజొప్పు సక్కటిగాఁగ దిద్దిమెత్తు రానాట నాఁడెమై పజలమనుదలయుఁ బెంపునుఁ బేరొంది కడుఁద నరుఁగాదె ?

అలుగకుఁడు నాతోడఁ గలరూపు నేను విన్నవింతును వినుఁడు చెవి యొడ్డిమీరు. తొంటిపెద్దలబాస సొజంపుబాస. సొంపుమై నింపుమైఁ జదువ నొసఁగూడు. వారలబడిఁ దవిలి, చక్కఁగాఁబోక, వెట్టివెంగళి వెడఁగు బట్టుల వెరవు నలవట్చికొని, పెద్దకయితగాండ్రంచు, బెద్దలు వెక్కండ్రు వెక్కెఁడ్లు పూని పెక్కుబాసలు సదివి, పెక్కుఁబొత్తములఁ జివికిన మాటలినొగిఁ బ్రోవు సేసి, పదనుగాఁ దడిపియుఁ బిసికియు రుబ్బి, సంధులాదేశాలు నాగమమ్ము లును, ఱాలును, నెఱనున్న లరసున్నలునిచి యన్నియు నేర్పుమైఁ గలియంగ దంచి, డంగినయాముద్ద సన్నెపై నూఱి, యుక్కుగుండులపోలె నుంటలు సేసి, వానినిఁ దడియాఱ నెండనుఁబెట్టి, యేరుపిడకలు దెచ్చి యెఱ్రగా నేర్చి

పదిలముగఁబెట్టియును గుడికలనుదాఁచి తారునుఁ, దమతోడఁ జదివెడువారు వండుల తీపారఁ బలుపలుఁ గొఱికి, చవిలేనివయ్యును, నములుచుండుదురు. ప్రాఁతగిల్లిన కొలఁదిఁ గప్పు గల్లుల కవిగట్టి వయ్యెను; వాని నేఁ దేరికేని నములంగ నలవి గా దెంత గొఱికినను. ఇట్టివియ మీరలయు మిమువంటి వారలయుఁ గడుమెచ్చి కొనియాడు నెక్కొన్న నుడలు. నెలకొన్నవియయేని, నుక్కలయేనిఁ జేవకట్టెలయేని నెల్ల ప్రొద్దున్నె? యుక్కెనిఁ దినునట్టె త్రుప్పుడు నూరె! సేగేనిఁ దినునట్టె ప్రువ్వునూరె! మిముఁబోనివారి కవి యితమయిననెయ్యె; మిముఁబోని వారలు వెక్కండ్రురుండ్రై? ననువంటి వారల యెల్లయందులను, మీకుఁ బోలెను మాకు మెసవఁగాదు; గదిరెడు నేవంబు: గడుపులో నఱుగక, తెగులు వాటిల్లును; గాద యితకారి.

అట్లుండెనది; వినుఁడు నా విన్నపది యింక. మూడుకాళుల తనరుఁ దాఁబట్టినట్టి కుందేటుకనుమాడ్కిఁ బంతము విడిచి, కీడు మేలరయుఁడు గినుక దక్కి. బాసన్నదే ప్రొద్దు, నాలుకమీఁద నాడుచుఁ బాడుచు నలరును గాదె? ప్రాఁతకమ్మలఁ గ్రుయ్యుబాసయ బాసె? యేనాటినేనియును నున్నె యీసుద్ది? మననాట నీమాట సెల్లెఁగాక పజలనాలుక దొఱఁగి, ప్రాఁబొత్తములయంద యునికి గలిగిన యట్టి నుడులవెల్ల నుసురు దొఱఁగిన యెండు దొక్కలుగావె? పొత్తములన్నియుఁ బ్రొవెత్తి యేర్చినన్, గ్రొందెనుఁగు సావద. పసగల్గి పచ్చగా మిసిమిసలాడుచు నివురించి విరియునుఁ, గాచును, బండు; విత్తులు వెదచల్లి కొలము పెంపొనఁ గూర్చుఁ దాన మాఱి. యుసురును, బసయును గల యట్టి వెల్లను మాఱకుండఁగఁ బోవకుండఁగాద, "దేశభాష" యు "మాతృభాష" యటంచుఁ బొగడెదరూరక బూతులువోలె. మీమెచ్చు ప్రాఁదెనుఁగె "దేశభాష"? మీమెచ్చు ప్రాఁదెనుఁగె "మాతృభాష"? యేదేశమున వారు మీమెచ్చు తెనుఁగును నోటను బల్కువా రరసిచెప్పుఁడ. ఎయ్యేని "దేశము" నఁ బజలు నుడువనిది "దేశభాష" యటంచు బేర్కొనఁబడునె? ప్రాఁతకిమ్మల నుడులు వాపనికి నుగ్గుతోనే "మాత" యునుఁ బోయుఁ గని యెఱుగమయ్య మాటన్నఁ, బలుకన్న, నుడియన్న, నేమి? సమువన్నఁ, బాటన్న బాసన్న, నేమి? నాకు మీ తలఁపులు దెలిపెడు నులివు; మీవాత వెలలి నా వీనుల కెక్కుఁ. జేతులగవ్వంగఁ గన్నులన పడునది బాసయె? యది బాస జాడగాక. యెయ్యేని నాటను నెయ్యేనిఁ బెద్ద లేయ్యేని చొప్పున మాటలాడెదరు, నలుగురికి నానాట నదియ చొప్పడును, బిడ్డ లింటింటను దలిదండ్రులాడు మాటల నేర్తురు గూరిమియుండుటను. దల్లియుఁ దండ్రియు మొఱటులయిరేని, బిడ్డలమాటలును మొఱటులయగును. పెద్దల బిడ్డలతో గూడి యాడు పిన్నల బిడ్డలును మేల్నుడియనేర్తురు. పెద్దలతోఁ గలిసి

పనులు సేయుదురు, చిన్నలు నేర్తురు వారలయ నుడుల నొండొరుల తలఁపులు నొండొరులు నెఱుఁగంగ నిదియ యెల్లెడ మేటిపాటెగాదె! పలుఁగొలములను బుట్టు బిడ్డలు బడులలోఁ బెద్దల నుడి నేర్చి యలవర్చికొనరె? బడులలో నొజ్జలు పెద్దలతోఁగూడి మెలఁగుచు, వారల యాడుబాస గఱతురు; నేర్తురును గఱపంగ నొజ్జకు, బాపలు గానిండు, వెఱలుగానిండు; చదువు మెఱుఁగులు గల్గు పెద్దలబాస వీరు వారును నాక యెల్లరికిఁ దెలియుఁ, గాఁపులకేనియు మాలల కేనిఁ. బెద్దల నుడులగుట మెత్తురెల్లరును; పలుతురు నేర్వంగ నెల్లరువానిఁ; జుల్కఁగా నేర్వంగ నోపుదు రెల్ల సాజంపు వరుసను, వీనులవినియు, నోటను బలుమఱుఁ బల్కిపల్కి. యదియ కదె యెల్లెడలఁ బాడి బాసలకు? నిట్లుగాఁ జిన్నలు సన్న లెల్లరును బొందుగాఁ బెద్దల నుడుల నుడువంగఁ బొందుగా బెఁదలనుడుల వ్రాయంగ; నోటి మాటలు, సేతి వ్రాలును, గమ్మ చదువులు. నొక్కమెయి సమకూడియుండ; మఱియేమి గల దయ్య మనకుఁ జెప్ప? విద్దె యెల్లెడ నలమి కొని యెసక మెసఁగు. నిదియ సుఁడి పెఱనాట్లఁ బాడి సదువులకు. వినరా కోయిమాట మీరలెన్నడును? బడియొజ్జ నాలుక వలికిన పలుకులు సెవిమెచ్చి సరియనఁ, గండ్లు దప్పసఁగఁ గన్నులు బాసకుఁ బెడనెల లొక్కొ? యీతెనుఁగు నాటను ననువంటి వార యేడఁజూచిన నుందు రొజ్జలనుపేరఁ. (బొట్టకూటి కనుండు, తప్పేమి దాన?) వీర కదె వేనవేల్ పిల్లలచేత బడులలోఁ జదువులు సదివించుచుంట? మీ మెచ్చు వ్రాఁదెనుఁగు నేర్వంగనగునె యీయయ్యవాం డ్రకు నేరికి నేని? (నొకరిద్దరుం డ్రుపో నేర్చినవారు; గడనయె వార లీ మొత్త మ్ములోన?) మన తెనుఁగువారట్టె యిన్నూఱు "లచ్చ" లయ్యును, నూర్వుర జెన మండ్రయేనిఁ దమపేరు వ్రాయంగ నేర రయ్యెదరు అక్కరాల్ నేర్చిన వారిలో నేని. వేయింటఁగాదువో, పదివేలలోనఁ బ్రాఁదెనుఁగుఁ జదువఁగలఁ డొకఁడేని యున్నె? ప్రాఁదెను గేడనేన్ బలుక వినరాదు ప్రాఁదునుఁగు నేర్పువార రిది నాటఁ; బ్రాఁదెనుఁగు బొత్తములు సదువంగ నేనియు నలవిగా దెల్లరకు నక్కరాల్ రామి. నట్లయ్యుఁ, బ్రాఁదెనుఁగ! ప్రాఁదెనుఁగ! ప్రాఁదెనుఁగ! వలయుఁగా కొండెద్ది వలవదం డ్రీరు. మీమాట లేటివో యించుకేనియు నాకుఁ దెలియంగ రాదయ్య పరికించి చూడ. నిక్కమ్ము సెప్పెదనువినుఁడోపిమీరు; నన్ను నలుగక, నాకుఁ దప్పుసైచుండు నేలవేల్పులు నాఁగఁటఱఁగు బాఁపలలోన చూడంగ సాఁబాలు సమవులేర, యోనమాలేనియుఁ గఱవంగ నోప కవధాని నంచును దయ్యాలపాట వ్రాఁతది గడముట్టఁడి బాడంగ నేర్చునట్టిఁడు సిగ్గఱి కాఁపుకడ కేగి వేఁడును గమ్మెండు గివ్వమని వాని. గిచ్చినదానిపైఁ గై వ్రాలు సేయనేనియు నేరండ మనపాఱుఁ బెద్ద! సీనారె పెఱవార లిది వినెడువారు? ఏలబాఁపలు పెద్దలని పాడుకొంట? ఏల తెనుఁగులు మిన్నలని పొగడుకొంట?

ఏల బొంకులు వల్కి నిక్కి నీల్గుటలు ? ఏల రిత్తలు సెప్పి విఱ్ఱవీగుటలు? బలె బలె ! మన తెనుఁగు వారార్యులోటు ! బలె బలె! మన తెనుఁగువారాంధ్రు లోటు ! బలె బలె ! యాంధ్రుఁ నార్యులోటు ! అయ్యారె ! తెనుఁగది యార్యుల బాస ! అయ్యారె ! తెనుఁగది యాంధ్రుల బాస ! పెఱవార లెల్లరు హూణులు మ్లేచ్ఛులు, యవనులు, తురకలు, మాలవారట్టె ! చూడుఁడి తెనుఁగులు ! చూడుండి బాఁపలు ! గనువిచ్చి కలయంగ నరసికొనుఁడు. నుడులనుబట్టి యార్ మానిసి కొలముల నేర్పరించితిరేని మన తెనుఁగు వారిఁ గోయలతోడను నెఱు కులతోడఁ దగఁగూర్చి మఱి చెప్పవలయుఁ జుండి. యాంధ్రుల మ్లేచ్ఛులని యార్యుల పేర్కొనఁ దెనుఁగు లాంధ్రులయేని, మ్లేచ్ఛులకారె? హూణులు నాఁగమీసెగ్గించువారు, మ్లేచ్ఛులు నాఁగ మీయగడారువారు, యవనులు నాఁగ మీపదరెఱువారు మన నేల సానికి మగల కారె? వీఁకేల యిఁక మనకుఁ, ద్రుళ్ళంగనేల ? బలిమిమైఁ గలిమిమై మఱునాఁడునాఁటికిఁ బెంపొంది పలునాళ్ళ గండఁడ్రు గారె ; హూణుల కానిండు; మ్లేచ్ఛుల కానిండు, నేలమ్మ మగలను నేఁ బుట్టువులు దముఁ గన్నతండ్రిగాఁ దలపంగవలయు; వెన్నుని వలె వారిఁ గొల్చుటయ పాడి, యట్లు గావుటఁ జేసి తెగడంగఁ గాదు. వీరేడ వారేడ దోమయేనికల ! యేయూరికే తెరవేటియుద్ది ? మనచొప్పు దాతల పేరుల చెప్పి, మనపూన్కిఁ దాతల చెయ్యుల చెప్పి పేదబింకమ్ముతో మిటిమిట్టిపడరు. దముచేయు పనులచేఁ దాతలపేరు బెళకొంది బెలయంగఁ జేయువారు. దఱియును దెన్నును దమ్మును నొరులను జొప్పు దప్పక యరసి మెలగువారు. దమయునుఁ బెఱవారి బ్రదుకు మేలగు పొంటె నదనున కను వగు మయివడి నరసి; క్రొత్తబైసులఁ బెంపు సమకూర్చుకొండ్రు, గలకాల మొకపాడి, యెంత మేటిదియైన, నన్నిటఁ గూర్చునె పజకు నొకచొప్ప ? పలుజాడలను బట్టి మాఱెడుఁ బజనడ, నడయ మాఱఁగ నెఱియు మాఱ కున్నె ? నడవోలె నుడియును మాఱుటఁ జేసి, క్రొన్నుడియ మేలుగా మెచ్చి నుడివెదరు; క్రొన్నుడియ మేలుగా వ్రాసి చదివెదరు. వారి వంగడములోఁ జదువనివానిఁ గంటిలో నలుసట్టిఁ డని యెవగింతు. నాలిముచ్చుగఁ జూచి దరియ నీ రేరుఁ; బనిగొన నట్టిని జీవర వేరును గొడగవాఁడేనియుఁ, గటిక వాఁడేని, వ్రాలు వ్రాయఁగ నేర్చుఁ; జదువంగ నేర్చు బానిస మేనియు, బానసమేనిఁ, జేయంగఁ గాదువో మేఱుంటనేఁ జదువనువ్రాయను నేరని కుంక. వారు వీరననేల, యించుమించుగను జదువని మగువయుఁ జదువని మగఁడు గానంగ వచ్చుట గడునరిది సూరె మనయట్ల వారలు సదువులురాని కూళుల కాల్గడిగి నీరు ద్రావుదురె ? మనయట్ల వారలు సదువులు రాని వెడగుల నెత్తిపై నెక్కించు కొండ్రె ? మనయట్ల వారలు సదివిన మగవాండ్ర నగి,

యాడిపోసికొని కేరడింత్రె? యేరుదెనుఁగుల కుద్ది బీరములలోను, డంబుడా
బులలోను, డాటోట్లలోను; డక్కుల, డెక్కుల, నిక్కులలోను? జాల్చాలు
నిఁకనేని మిన్నకుండుదము: కొరమాలి కోఁడడము పాలు గానేల? తెనుఁగు
వారలలోన నిద్దఱు కొకఁడేనిఁ జదువకుండినఁ బోదు మొఱటుపేరు. మన తెన్గు
వారిలోఁ బాల్లెఁదరయ్య? నూర్వురకు ముప్వుర! వారిలో నేనిఁ జదువగల
రరిది. వ్రాఁబల్కు నుండి కడుఁగడిఁది; గఱవంగఁ బట్టదందఱకు.

మనలోన మిన్నలు నోటనుఁ బల్కిన పల్కులు మొఱటనుట మన పిచ్చి
గాదె? వారాడు మాటల మన మాడెదము కాదె? వారాడు మాటలు మనకు
వ్రాయంగఁ గాదు గాకేమవియుఁ గాఱు లొక్కొ? తొలుదొల్తఁ దెన్నాటి
కాఁపుల పలుకులఁ గయితమ్మ గూర్పంగఁ దొడఁగిన యపుడు మొఱటులోకాక
యవి సొక్కంపు నుడులో! యది మీకుఁ దోపఁదె? తలపోయుఁడేల యీఱ
తాఱ తలంపుల బీఱువాఱ? బాఁపలు మున్నుగా మాటలు పుట్టించి కమ్మపై
గిప్వఁగాఁ దెనుగయ్యెనయ్య? బాఁపల కంటెను ముందరఁ గాఁపులు వల్కరె
వ్రాఁతలు తెనుఁగునుడులు? దొంటిపెద్దల కట్టి యరమర లున్నె? తొంటి
కాఁపుల పలుక కొనియాడ రైరె? యేనాఁటిపెద్దలనుడుల నానాఁడు మేలుగ
నెన్నుటయ పాడి యెల్లెడల? నీనాఁటి తెనుగులలోనందుఁ బెద్దలు గడువింత
గదురంగఁ దమనుడులఁ దార మొఱటని పూనిక పట్టి రక్టె! తమ బాసలెస్పయ
యనుడుఁ, గడుఁగిన్క నదియేమొ కీడుగా నుడిఁ జిత్తగించి కయ్యమ్మనకుఁ
గాలుద్రవ్వుచున్నారు! నగుదునో, వగతునో, యోయమ్మచెల్ల! పేరోలగమ్మున
రాజులు ప్రెగడలు మాటాడు మాటలును మొఱటులగునె? రచ్చతిన్ని
యలలో నంగళ్ళలోను దీర్పరుల మాటలును మొఱటులయగునె? "బారత"కత
నదివి విప్పి వినుపించు నాయయ్య మాటలును మొఱటు లనఁ జన్నె? ప్రోలి
పెద్దలమాట లవి మొఱటు లొక్కొ? బడి యొజ్జమాటలును మొఱటు లయ్యె?
మీరు నుడివెడు నుడుల మొఱటులయ్యె. తెనుఁగు జదువుల రచ్చఁ దీర్పరులరె;
యన్నిట మిన్నలు, నుడిన యటె మొఱటు! వాయోడు; నాఁగాదు; నాన గదురు!
సరె, పెద్ద లెల్లర మాటలు మొఱటేని, రచ్చగండల ముతకనుడి యాడు నంత
నానగండల యేని, మఱి వంత యేల? పొట్టగోసిన నొక్కయక్కరము లేని
మొఱటుఁ దెనుఁగులు, (గాఁపులు, వాఱులెల్ల) వాని నేర్వంగఁ దప్పేమి సెప్ప
రయ్య? వలవదందురు సేటు వాటిల్లి నట్లు? యేటి దీ పిచ్చి? మీనుడివెడునవి
దక్కయేనాఁడొ చచ్చినవారి నుడుల మేలంచుఁ దలఁతురు! సచ్చినవారివ
మేల్నుడు లేని, బ్రామిన్కులన గివ్వరయ్యెద రే లవిగావె గడు మేలు?
ప్రాఁదెనుఁగుఁ బొత్తములు దద్దయు నగ్గింత్రు; ప్రాఁదెనుఁగు బొత్తములఁ
జదు వెల్లనున్నె? ప్రాఁదెనుఁగు నుడి పెద్దమెత్తురు; దలఁపులెల్లను దానఁదెలుప

వలనె? క్రొత్తకోడలు వోలె నరగలిగొనరె లెస్సగ నలవడని బాస నుడువంగ,
నడుగడుగునకు మాట దడఁబడఁ బలుకుట గలు గల సనిగల నేమక వ్రేఁచి?
వ్రేఁపుళ్ళ నమలంగఁదొడయుట గాదె? ప్రాబాసవ్రాయు టదియేటి కెదురీత.
ప్రాబాస వెలలింపఁ బ్రానుడు లేదు: నీరు వెలలిన మొసడి నేపియ వట్టు చెట్టుఁ
దొలఁగినఁ బూలు గంపులేవవు: వానఁదేనె యివుర నీఁగ సొరదు సూరె;
నుడులాడ నోరూరకుండిన నాఁడు నీళలింకిన మడువుమీలట్లనుడులు. నిచ్చమైఁ
బొత్తూర రేలు గ్రుమ్మఱఁగఁ బ్రాతూర నను వగు నట్టులగునె? చిన్ననాఁటను
గోలె మెలఁగెడు నింటిలోఁ గనుమూసికొని యేని వడిఁ దిరుగవచ్చు; నడిరేయి
నేనియు, నడఁగూడు నలుగడల; నలవోకయును బోలె, నరవాయిగొనక,
పనులెల్లఁ జక్కఁగాఁ బచరింప వచ్చుఁ. బనివోలె నుడియును నలవడక యగ
పడద; యగపడక కడగండ్లు మెండుగాఁ గూరుఁ. గడగండ్లమారులు గడగండ్లు
వలసిన నెల్లరు వలతురే వానిఁ జెపుఁడ? వలచరయేనియుఁ గడవంగ లావె?
యోపువారల యేని నీర లిసుమునన జిడ్డుఁ, గండ్లుల నొలిచి తడియుఁ దివ్వ,
నానుఁ డావో బమ్మి యేపారుఁడయ్య' ప్రాఁదెనుఁగు వలతురేన్ నేర్వ,
డ ద్దిది? మీకింబుగా జదివి కొంద్రుగాక; యెల్లర నరికట్టి యదియ చదివింత్రె?
నేలను దొర్లుచుఁ గాసి ప్రయగలకుఁ బోవంగ నియ్యయేన్ బొండు; గద్దేది?
వెఱల నంకిలిపెట్టి, "యురలకబోఁగాదు; పొగబండి నెక్కినన్ బున్నెమ్మలేద
పెద్దలనడ సెడు" నని బెట్టిదంపుఁగట్టడి సేయుమని జేనిఁగొనకొల్పుఁదగు
నయ్య? యెల్లరు నోపరయ్యెదరు. దొలుతను బడులలో నొజ్జలు నేఁటివి సదు
వులు సవిసూపి కొండకలకు నేఁడు నాటను బజ్రబదుకు మందలకు వలయు
చదు వించుకయుఁ గఱపంగ నెగ్గె? కలవుచేఁ బసిగొని చానున్నవారికిఁ గూటి
నీళ్ళించుక వోయఁగీడె? "ఎంగిలి; వలవదు. కాఁడిగా దాన. బాఁపల పోలెను
వలయును మెసఁగఁ. బ్రాలకుఁగా మీరు ఊనేల దునఁగ దొరఁకొనుఁ డింతకుఁ
ఒందు; మీరుఁ గుడుతురు; వార్చుఁడ"ని పట్టువఱచుదురె? నేర్పు గలరరు;
మీకుఁగాఁ బట్టుఁగాక; దానవతఁగుల పసి యూఱునయ్య; కొలఁదియె వారికిఁ
గడలిని ద్రచ్చి చవిఁదిగిచి క్రోలంగ దయ్యాలపగిదిఁ? గోల్మొసడులకు నుక్కు
పట్టువు మడువును జొత్తెంచి నీళ్ళాడ నెల్లర కగునె? తెనుఁగులలోనందుఁ
జమువుఁగడునెద్దడి. గావుటఁ, బ్రాఁదెనుగు వలను గాద. యేలిక లిప్పుడు దయ
సేసి యూరూర బడు లుంచి యెల్లరకుఁ జదువుఁ గూడిడఁగ నున్నవారఁట;
మీకుఁ బ్రాఁదెనుఁగు బెడ్డ లాకూటిలో వైవఁబాడియె? యకట? యావంతయును
లేదవంత యాదెస మీకు. మాలలు వలఁతులె మీచదువు గఱవఁ? బ్రాబాసఁ
దగులఁ బడ నేరికేన్ లావె? ప్రాఁదెనుఁగు సదువంగ కొందఱు గలరేనిఁ,
బ్రాఁదెనుఁగు వ్రాయంగ నేరి కగునయ్య? యిప్పటి యేల్బడి చొప్పును

బట్టి, మనుదల యెల్లను వ్రాఁతనయ్యెడును. వ్రాయను జదువను నేరని వాఁడు సేయఁజాలఁడ యెట్టి పనియేని నేఁడు. ప్రాఁదెనుఁగు దొల్లిఁటి పెద్దల మాటేనిఁ, గ్రొందెనుఁగు నీనాఁటి పెద్దలమాట. యెప్పటిమాటలున యపుడు తెల్లముగఁ దెలియును, దెల్వికివలయు నమ్మాట యెల్లరకు నలవడిన మాట గావలయు. పెఱయవి యిప్పనికి వెరవు లేవు. వలయునది దెలి వుగా కులి వౌనె? నుడులకెల్ల నులివు బొంది; దెల్విసుఁడియుసుఱ. యులివు సెవి గ్రువ్వగాఁ దల? దూఱుఁదెల్వి. పుట్టెనిండుగఁ దెల్వి వొంగారకున్నఁ జెవికి విందుగ వాతనుడి వెడలునొక్కొ? ప్రామిన్కులేనియుఁ గ్రొమ్మిన్కు లేనిఁ, దేటగాఁ దలఁపులు దెలియరాకున్నఁ, బసలేనిమాటలు వదివేల వేల? డబడబ-డుబడుబ-బడబడలు గావె? తెనుఁగు నాటను జదువు వెంపొంద కుండఁ గీడెంత మూడెనో చుండి కనువిచ్చి తెనుఁగునాటను బాస దికమకలాడి పాడయ్యె! బాసతోఁ జదువును బ్రదుకుఁ! గడుఁగీడుగా దొక్కొ చిత్తగింపఁ?

బ్రాఁతల మేలంద్రు పెద్దలు వల్వారు; మాటమాత్రమ; యేరునొల్లరువాత; నూరువల్లెవారుఁ బెద్దలు విన్నలు, నెల్లరుఁ గ్రొత్తల కోరుచుండెదరు. పూచ్చిన పాతులు ద్రవ్వి వెలివుచ్చ నలవియె యెల్లరకుఁ? బుచ్చినన్, వెగట, ప్రాఁని నాణెమ్ములు పెద్దల పేర్చెప్పి యమవస నేరునీ, దీవింత్రె పార్లు? ప్రాఁతదుగ్గాణులు సాతునకీఁగ నుప్పుగల్లేనియు దొరకనఁ బడునె? ప్రాఁతత్రోవల నేఁడు గాసికిఁ బోఁజన్నె, కాల్నడనేనియుఁ గమ్మిబండులనుఁ? బ్రాఁతతేపలఁ గడలిఁ గడవంగఁ జొత్త్రె? పొగబండి వొగయోడ నేఁడుజ్జగింత్రె? ప్రాఁతపొత్తాలలోఁ బేర్కొన్న ప్రోలుల తొల్లింటి వాసియు వన్నెయుఁ జెన్నునేఁడు సూడఁ గఁగాంత్రె యరసియు నేడఁ? బ్రాఁతకొత్తలఁ బడులఁ గొలిచియుఁ దూచి కోమట్లు బేరంబుసేయఁ గన్దెరి? ప్రాఁజాలఁ జెక్కిన యక్కరాలిపుడు సక్కంగఁ గాదువో చదువంగనేని; వానిన నేఁడునున్ గివ్వఁబూనుదురె? తొంటిబిరుదులు నేఁడు వలతురె దొరలు? బంట్రౌతులని వారిఁ గొనియాడుఁ దగునె? జగనొబ్బగండడన నేటేఁడు గులుకు? నెవడిప్పు డోయంచు బల్కు సుంకరియన, దళవాయి యనగను జంగిలి యనఁ? వెట్టరె మొగమునఁ జప్పటులటు సీరఁ? దొంటి యట్లిప్పుడు సాని యందురె తల్లిఁ? దొంటిబాఁపల వగిదిఁ జియ్య దినఁ దగునె? తొంటిపాడినిఁ బట్టి తనయాలి నొడ్లకుఁ బున్నెమ్ము పొంటె నిపు దెరవీఁగఁ దగునె? పాపలు లేరేని యేరేని యిపుడు బాఁపలకడ కంచి పుత్తురె యాంద్ర? తొంటిపోఁడిమిఁ గూడుఁ గుడుములుఁ గుడుతురె? ప్రాఁతమైవడిఁ దొడఁ బూయఁ జన్నె? ప్రాఁతమడుపుల నిపుడు నీళ్ళాడఁ దగునె? ప్రాఁచినీళుల నేరు గ్రోలరు సూరె! తొంటిపెద్దలు వోలె నేఁడు సీరలు దాత్తెరి నెత్తిపై, నొడలిపైఁ, దోలు, నారలును, గత్తళాలరికట్లు వావ

డాలు ? వ్రాఁదొడవు వలతురె గోతు లీనాఁడు ? తొంటియట్టుల పోటుబంటులు నేఁడు నుండసురియలు గొని పోరెదరయ్య ? పగవారు మననాటిపయిఁ దాఁకు దేరఁ దెనుఁగు బంటులు లేచి తెగియించి నేఁడు విండులకోలలయు గుదెలయుఁ దోడఁ బగవారి బారినిఁ బడకుండఁజేసి చెట్టకు దొఱగించి. సేగి గూరకయ, నేర్తురె చెప్పఁడ నేలఁ గాఁపాడ ? ఋంగలవెనుకలఁ జూడంగ నేర్పుగలరని మీమెచ్చు ప్రాఁబాఱ్ల పాడిఁ దవిలి తగవులు నేఁడుఁ దీర్వంగఁ దగునె ? ప్రానుడులు గఱచిన పాఱుని మనుమలు వలుక రయ రచియేల ప్రామినుకు లిపుడు ? దొంటిపెద్దలు గొల్చువేల్పుల నేఁటి పెద్దలు గొల్వంగఁ గానంగరాద, కువలిన గుడులలోఁ గూడని పనులు బాఁపల సల్పుదురు పాడియతక్క. యేరుగడముల నల్లవో దచ్చికడల ! వీననుఁ బొమ్మలు గై సేసి గొల్వర. తారకాణింపంగ నిది యొండ చాలుఁ బ్రాఁతల యెడఁగల గుఱి యెంత వట్టొ ! ప్రామిన్కు వల్కని దుగపుట్టుకయుఁ జిచ్చు నిచ్చవేల్వని గేస్తుఁ జెడుదురన్న పాకియెల్లెడఁ దోఁచుఁ ప్రాఁబొత్తములఁగాక. యేరేనిఁ బాటింత్రె యాపాడినేఁడు ? వేల్పుల తెంకులు, వేల్పులకొల్వు, వేల్పుల బాసయు. వేల్పులయాన, బాపల బాసయు, బాపలపాడి, తొంటిపెద్దలచైసి, యివియెల్లమాసి పరియ, నించుకేనియు నురనిపాక్లట్టెఁ. పెలుకుఱు చీప్రొద్దు, గుదగుదలాడుచు, బురపురఁ బొక్కుచు, జాలిఁ గూయిడుచు, బడలు సాలఁగఁబడి వనరుచు నుండ్రఁట ! కటకటా ! యేలొకో యరయుఁడయ్య ! "తెన్నాటి కాఁపుల ప్రాఁదెన్గు ముత్తవ్వ ముదిసియుఁ జివికియుఁ బరిసెఁ గాన నెండుడొక్కను బూన్చియుఁకఁ దన్పఁదగు దాని; నెల్లరు వలయుఁ గ్రొమ్ముద్దియఁ గొల్వ"నని తూఁటలనిరఁట చెవి సూఁడఁగాను ! బెద్దయుం బ్రొద్దయ్యెఁ; బెద్దముత్తయిదువ. వాలాయమున కింతవగఁగుంద నేల ? పలుకు ముత్తవలెల్ల రనఁటులు వోలెఁ బిల్లలఁ·గన లావు కాకువోరె ?

తెనుఁగు నాటను గల పెక్కురువల్లెలు వేరులు మాఱియుఁ దనరు నిపుడు. దొంటి పేరులు గొన్ని రాగి పట్టాల, ఱాలపైఁ గానంగ నయ్యెడుఁగాదె? ప్రాఁత యక్కరములు సదువంగ నేర్చిన యయ్యలు సెప్పంగ వాస నేర్చి, యిపుడు పేర్కొన్నచోఁ దెయఁబడునె యా యూళ్ళవారికేన్ ? బొత్తముల నున్న యిప్పటి పేళ్ళవి గ్రొత్తవికావునఁ దప్పని వానిని ద్రోచిపుచ్చి, ప్రాఁత పేరులు సేర్చి మగుడ నచ్చొత్తి. బడులఁ బిడ్డలచేతఁ జదివింపమేలె ? యొక యూరి గామిడికిఁ గమ్మొండు గిచ్చి. కమ్మపైఁ బ్రానుడియవ్రాసి యంపెదరె ? "యంచెల" వారది యంచిపుచ్చుదురె ? లెంకనొక్కనిఁ జీరి, ప్రాఁత పేరది సెప్పి. యూరికేగంగఁ బనుచుడు, వాఁడు "నేనెఱుఁగ నదియేటి దేడనున్న" నఁడె ? క్రొన్నుడి ముతకని నేఁటి పేర్వలుక మీనాల్క యీకొనమి, మొదల షేల్ నుడియు పల్క, వెంబడి మీరు పని సక్క నెఱవేఱఁ గ్రొన్నుడియుఁ

దెల్లముగ వ్రాకువ్వవలయుఁ; బ్రానుడి పద్దెంబు మున్నుగాఁ జదివి, పదపడిఁ
దేటగాఁ గ్రొందెల్గు వల్కు నయ్య వారట్టుల; మేలు సూరె! సుంకరు 'లంచెల
యొకి మీఁడు, రచ్చతీర్పర్లుఁ. గాపర్లు, బడియయ్యవాండ్రు సుద్దిగా నూళల
ప్రాఁత పేరులను నేర్వంగఁ గట్టడి సేయుమని జేని వేఁడంగ వలయును జుండి
తడయకయ. ప్రాఁబొత్తములు మీకు దొరకొన్నవచె గొన్ని యందుల ప్రాను
డులు మన మెఱుగనవి యున్నవియును దివిచి ప్రోవెత్తి, బడులఁ బిల్లలచే
ముందుఁ జదివింప నురును! దానికిఁ గానొకఁడు గట్టడి సేయుండ దొరలకు
మీరలు సెప్పుపుచ్చి. ప్రాఁత పట్టాలలోఁ గొన్నిటియందు నూళలెల్లలతోడ నేర్ప
డియున్న వెన్నియో; యవి యిపుడు దెలియంగఁగాద. యట్టి యందొక కొన్ని
నల్లిండ్లుగాఁ జేసి యొడయరు మన రచ్చకీఁగ, వాని నేమి సేతుము రిత్తపేరులు
వట్టి? ప్రాఁత పొత్తములందు మందుల ప్రాకులఁ బేర్లున్న వానిని బేర్కొని
మనము బోయవానిని జీరి వానిఁ దెమ్మన దేరంగ నగునె? తేఁ, దెలియఁ
జన్నె? ప్రాఁతపురాణాలఁ బేర్కొన్న నాడులు, ప్రోలులు, వీడులు సరిపోల్పన
గునె? ప్రాఁజిత్తరువుఁ బట్టి చెన్నపురి నిపుడు వీదులు, నిండులు, సంగళులు,
బడులు, రచ్చలు, సానళ్ళుఁ గొలువు కూటములు నరసి క్రుమ్మరనగునె కాఁపు
లయట్ల! తొంటిపడగల నెత్తఁ దొంటి పజలట్ల పోరికిఁ బఱతెంత్రె నేటి
ప్రజలు? దొంటి యట్టుల నేఁడుఁ జిందమ్ములొత్త మాతొత్తుదురె యేరునుద్దిగాఁ
బోరఁ? దొంటియట్లిప్పుడుఁ గైవారములు సేయ, నగరె యెల్లరు నన్ను వెట్టి
వెడఁ గనుచు? బాసలు నిట్టివ, ప్రాఁతలుఁ గ్రొత్తలుఁ జేతి గీఁతలు,
నోటి పలుకులు సుండి; సైగల. యవి పేనికై యమరి చెల్లు నాగుట్టు
ముందరఁ దెలియ రాకున్న, రిత్తసైగలఁ గోర్కు లుప్పతిలునె? ప్రాఁత
పురాణాల నేఁటి పజ బ్రదుకు గానంగ రాదవు గడముట్ట నెల్లఁ; గ్రొన్నుడు
లీరలు గొఱగాని వండ్రు; ప్రాఁబొత్తముల వలయు నుడులెల్ల
లేవ; నేఁటి బ్రతుకును జెప్పు నుడులెవ్వి సెల్లుఁ; బ్రాఁత పొత్తములలో
లేనివి యన్యేనేన్ గ్రొత్తలు గూడునని యీకొంటి[illegible]ని, నేరు గొల్ల
దులు సెపుఁడ ప్రానుడి ప్రోవు గెలిగించి వలయు నుడి ద్రవ్వితివ్వ?
బడులలో బిడ్డలునుఁ బ్రానుడి ప్రోవులు పరికించి రోసి మఱి మ్రొగపడకున్నన
నేఁటి మాటలు గివ్వవలయు నండ్రె? బాపురె! బమ్మ కేనలవియె యటు
సేయఁ? జదువర్ల నూర్వ్వరఁ జాలించి మీరలు ప్రాఁబొత్తముల నుడులు వెత
లపైవింప నవినేర్చి బాసాడఁగలడె యల నలువ? వేమేఁడు లగుదెంచె నన్నయ
యేగి. నన్నయనుడులెల్ల మాఱకయ యున్నె? ఈ కమ్మలో నున్న వెన్నియో
మాటలు నన్నయనుడులేనిఁ దెలియంగఁ బడునె యిప్పు డీ రాజేంద్రవరమున
వారు? మీరు వోలెనుఁ గాద యెల్ల రవి నేర్వఁ, బ్రానుడి నేరని వారితో మీకు

మనఁబోవక పోవరాద కాదె ? పెఱవారి నిచ్చలు మాటాడు నుడుల నాడకుం
డగఁ బోవకుండనగునె ? వారాఁగవలఁతులు వాకు మాఱక యుండనే రాఁగి
కట్టుదు రెల్లర నాల్కలీతోఁపు మీకెపుడుఁ దోఁప దొక్కొ ! నుడి మాఱునని
మీరు నొగిలెద రేల ? మీరు మాఱక ఱాలవోలె నుండెదరె ?

ఇంకను వినుఁడయ్య విన్నవించెదను మార్పులు దెనుఁగుల మనుదల
మనుదలలోను. మనికిపట్టులు దొంటి యట్టివిగావ. కొఱముట్లు గ్రొత్తలయేడఁ
జూచినను. బ్రోయాలు గుండలుఁ గట్టెయగపలును గైఁబట్టనోడును గూడు
వండగఁను. నెల్లికొయ్యలఁ దెచ్చి నిప్పొదవఁజేసి ప్రోయిని గుంపటినిఁ జిచ్చు
వెట్టెదరె ? ఇంటను వెలపల రేపు దొడంగి క్రొత్తల కదె కందు మత్తమిలు
దలుకఁ ? గాఁపుల పనులిపుడు వాఁపలు సేయఁ గాఁపులు నడతురు బాఁపల
యట్లు. క్రిందికొలమున వారు పల్వురు నేఁడు గొలువులఁ బెద్దలయి కుదురు
కొనఁగఁ బడులలో జదువులు సెప్పుచునుండ, రచ్చలఁ దగవులు దిద్దుచునుండ,
బాఁపలువారల యండఁ జేరెదరు. తొలి నేల దయ్యాల గురుకొని చేసిన కట్టడి
మివులంగ నడచినయట్టి కాఁపుల బాఁపల సంకలియ నునిచి వారిచే దండువుఁ
గొనఁగ వలదె? కటకటా మాటలు మాఱిన కతనన కడలేని వంతను గుందెడు
మీకు గుండెలు వ్రక్కలు గాకుండఁ బోకుండ నగు బెట్టులయ్య. మీ కట్టెదుట
ద్రెళ్ళె వేల్పులు బాఁపలు సేసిన బైసి ? యిమ్మెయిఁ బ్రాఁతలు వరిపరి తెరగుల
నెన్నియో మాఱియు మాసియుండంగ, నా ప్రాంతలకుఁ బేర్లుగానున్న ప్రాను
డులు నవియును మాఱియు మాసియుఁ బోయెఁ. బ్రాఁత సరకుల పోవ, సర
కుల పేరు మఱచుట వింతేటి ? యిది వింతగాక ; నీ మార్పు వాలాయమని
యెఱుగ రామివలనొండె వెడఁ గొండె నరయుఁడయ్య. అలగొంతి తొలిపట్టి
యేపినిదొకొని మింటికి నేఁగువాఁ డాలితోడఁ దమ్ములుఁ గూలుఁడు, నుఱకయ
వారల డొక్కలు డిగవిడువ, వెల్పులదొరయుఁ బాడియె నావుడు, జముబిడ్డ
నాఁడె మిక్కిలి మనుకుక్క వారి డొక్కలకని ? పాడివలనన పుట్టి పాడికి
నెలవయి. పాడితేఁడనఁ బేరు గ్రువ్వఁబడియు, మ్నిటి మగనికి ముని మను
మఁడయి పెరిఁగి, మిన్నేటి పట్టిచేఁ బాడి గఱచి, పాడి గనఁజాలఁ డొకాఁ
కని సలుపఁ డొక్కొ ?

ప్రాఁత చదువులు గొన్ని వెక్కెండ్లు వూచి పాతుడు వడుడును బరి
వోయియున్న. గుడ్డళ్ళగొని మీరు నేఁడు బ్రొక్కలు సేసి యెలుకల మెట్టలఁ
ద్రవ్వి, తడవి, దొరకొన్న యెమ్ములు గొన్ని వెలువిచ్చి యిదిగొ, యిదిగొ
తొల్లిఁటి బాస వెలఁది నా నాకె యుసురంది తకతక నేల నాటాడి యెల్లర
నాల్కల నెక్కి నెక్కొన్నె? ప్రాఁతనుడులకు నున్నె పస యెన్నడున్నెని?

యుడుగరయ్యెద రింక ప్రాఁతలగడన. ప్రాఁత పల్కులఁ దూఱఁ, గినియెద
రెయేరు? నేఁటి దెగడ, నో డౌదవుఁగాక. ప్రౌనుడు నగ్గింపఁ నుబ్బుదురె
యేరు? నేఁటి మాటల మెచ్చ నాదట వుట్టుఁ. బ్రౌనుడుల నెఱిఁగించి వుత్తురె
యేరుఁ బనులు సక్కఁగఁ గాఁగఁగోరు వారు? ప్రౌనుడుల గిత్తురె కయికోళ్ళ
నిపుడు తీర్పుల యొడఁబళ్ళకమ్మలయు మీఁద? దెవులు గదిరిన యట్టి గాదిలి
పట్టి సానున్న యపు డొక్క మందులవాఁడు వ్రాబల్కులను మందు నది యిడు
చొప్పుఁ జెప్పంగఁ దల్లికి నెటులుండు వగవుఁ, డే దయ్యెనేనియు నొడ్లకుఁ
జక్కఁగాఁ దెలియంగ వలతురేన్, దేటగాన తెలిసెడి యన్నుడియ వలయుఁ
గాదె? యొడ్డులతో మీకుఁ బనిలేని నాఁడు మీకు వలచిన యట్ల చేయంగఁజనును.
ఱోడులు దక్కంగ నేరట్టిరొంద్రె? నేఁడుగాఁ బుట్టెనె యీపాడినేల?వాలాయమే
తీరు నుడువుదు రెల్లరు వరికించి తెలియుఁడు రిత్తవంతేల? నివ్వెఱ గొందిన
నార్తురే ప్రౌనుడి? నాలితోనెవ్వండు వ్రాఁబల్కులాడుఁ గౌఁగిటఁ దాఁబట్టిముద్దాడు
నాఁడు? నెయ్యంపు నెచ్చెలులు గూడియున్నెడలఁ బ్రాఁబల్కులాడంగ మురిపె
మొదవెడునె? యుల్లమున మొల్లముగ వేడ్కవైకొనునె? యలయు నెడ
డయ్యునెడ నాఁకొన్న యెడల నొచ్చునెడఁ గినియు నెడ జాలిగొన్నెడలఁ
బ్రాఁబల్కు దనకుఁదా వెడలి రానగునే? యెగ్గు సేసిన పగఱ నెడలేక వీకమైఁ
బెల్చనఁ బ్రబ్బుచు నుగ్గడించుడును, వెల్వెడవె నిక్కంపుఁ గ్రొందెనుఁగు
నుడులు, గన్నుల యుమిసెడు నెరగళ్ళయట్ల, తోలుఁ దొఱవగిన చిల్వరాయని
తోఁకఁ ద్రొక్కఁగ వెసనూర్చి చిలుముఁ బొవలట్ల? యలరునెడఁ దనియునెడ
వేడ్కగొన్నెడలఁ గులుకునెడ, ముఱియునెడ, నుబ్బియున్నెడల వెలి నొలుకు
వాతను సాజంపునుడుల; క్రొమ్మెఱుఁగుఁ దివలవి; యెద కొలిమి నేరు తళతళ
మనుపయిఁడి పలుకులు; కూర్మివెల్లువయల లవి; గ్రొవ్విరి తావులు; పలుకుల
సాని దా వీణియ గోట మీటివఁ జెలఁగెడు మ్రోఁత వోలె హరవు మొల్లము
గాఁగఁ జేయునుడులు; వంటనూఁదఁగదగు; వాచవి పుట్టించు; లేనగవు లేమ
వాతెఱ దొండపండ్ల. యిటువంటి సాజంపు మాటలఁ దొఱఁగి, ప్రాఁబల్కులను
గుండు తాల ఋఁగప్పి. మీతలఁపు నొడ్లకు నెఱిఁగించి పుచ్చఁదొడఁగుట కన్నను
మిన్నకుండుటయ మేలని తోఁచదె వగవఁగ మీకు?

నెఱవుమైఁ జూడుఁడు: మిమ్ము నరికట్టి, నిచ్చలు మీ నుడువు నుడువు
లవి విడిచి ప్రాఁబల్కులన కాని పలుకంగఁ గాద, ప్రాఁబల్కులన కాని చెవి
సొన్పఁ గాద; యని యానవెట్టిన, మీరు రెన్నాళ్ళ యాపగిది సేయుదురు, విసు
వొదవకున్నె? "నోరారఁ దీపొడు తెలితెల్గుఁ బల్కులు వలుకంగ నేనాఁడు
గాంతు మొకొ? యిచ్చమై మానాల్క సాజంపు సొంపునఁ దలఁపులఁ దెలు
పను వలను గనునె? యాలియు బిడ్డయు నెయ్యునియుఁ దోడ నిచ్చమై

మే మెప్పుడు ముద్దులు గులుక నరమరలేకుండ మాటాడఁగలాగు? వీనుల విందుగా మఱి మెన్నఁడున్నేనిఁ జిన్నారి పొన్నారి నేఁటి తెలి తెన్గు వినఁగఁ గాంతుమొ లేదో," యని కుంది కుంది, యాచెట్ట కట్టడి ద్రెవ్వఁ ద్రోఁద్రోవఁ గడఁగుదు. రంతియ కాదు; మగుడ నేరును నటుల పెడఁగుఁ గట్టళ్ళఁ జేయవలవద యని చెప్పుదర మీరు. గాదు వో, బయిసుకవట్టి మీరదియ మెత్తుమందురు గాక; యందురె మీరు విన్న పెద్దలు నాక. పాఠ్ల గాంపులు నాక, యెల్లర కట్టివి లగ్గ; పలయునని ? దయ్యాలయునుఁబెండ్ల ప్రాఁడెంకు లిపుడు మేటులయి సొబగు లయి యుండెనేనిఁ, దగునె మనకెల్లరకు నిచ్చమై మనఁగ ? యరిసెలు వడి యాలు లెస్సలు గానిండు; దగునె నిచ్చలు బిడ్డలవి యారగింప ? వంకాయ వేఁచిన చిటి కందిప్రప్పు సచ్చిన పెద్దలు దినరట్టె పో, నిలిచిన పెద్దలు బోసేయుచుండంగ, నిచ్చలు వానిని నేయమ్ము వట్టి యేమజ్జగింతురు దొసగొందు ననుచు ? నేయమ్ము నందఱ కనువైన మాద్రి నుండని నాఁ డేయ వాటింతు రయ్య ? "లచ్చ" కొక్కరు లేర ప్రాఁబాసమేర మీఱక కట్టుమై నడచువారు.

'నన్నయగట్టిన కట్లుఁద్రెంపెదరె ? చదువుసానిని బోడిగావింత్రె యంచు డెప్పెద రీరలు నిజమునుఱక. ప్రాఁతకట్లవి గొన్ని పెద్దయుం ద్రొద్దొడుఁ, గ్రొత్తపోగులులేమిఁ, బ్రిదిలెఁ దామ. యిఁకఁ గొన్ని సిక్కుపడఁ ద్రెళ్ళంగఁ బికిరి తెలియమిఁ బెద్దల; యేమిసెప్పఁ ? బ్రాఁదోవ వారాఱ్వఁ బాటించరైరి, మీకుఁ జిక్కుయినవి మెర్పు వెతికితిరేని, మాకుఁ జిక్కుయినవి మేమూద్దుమయ్య. బాసకట్లను బంటికాట్లకులోఁగి, నాల్క దెబ్బలు వడియు సుమ్మెఁదడిసి చివికితునకలగావె పుటుకుమనుచు? గ్రొందెనుఁగు నెల్లరకుఁ దెలియఁగాదట్టె ! యూరూరినుడులవి వేఱువేఱట్టె ! యట్టేని, వేనవేల్ దెనుఁగు లెల్లెడలఁ ద్రిమ్మ ఱుచుండు వారెటులొనొరదొడ్ల నెఱఁగికొని పనులను సవరించువారొ ? చుట్టలు నెయ్యరులు వెక్కుళ్ళలందుఁ గల వారు సెప్పంగ నాలించితయ్య. కొలువు నకుఁ బలుచోట్లఁ గ్రుమ్మఱు వారలు పెప్పంగఁ జెవులారనే వినితినయ్య, నేను గొందఱఁ బెఱచోట్ల తెనుఁగులఁ బల్కరించితి నించుమించుగ నెల్లడఁబెద్ద లెల్లరు నొక్కచొప్పు నుడివెదరు. యించుక యెడమున్నదని యొప్పకొన్నఁ, బెఱబాసవలె నెఱుఁగరామి లేద. కబ్బములన కల్గు ప్రాఁదెనుఁగన్ననో, పలుఁ దెఱఁగులయి తోఁచుఁ బరికించిచూడఁ; బరిసెం మాటలు వెక్కులందులవి, యేడను వినరామిఁ దెలియరే రిపుడు. ప్రాఁబాసకట్టడఁ దుదముట్టఁ గనలేక యెవరికెట్టులు దోఁచెనట్లు వ్రాయ, వ్రాసిన వారేనిఁ దమవ్రాల మఱునాఁడు దెలియ రయ్యెదరట్లు బాస సివికె నూటిలో నొకటకేన్ ప్రాఁతమాటలపుఁ గట్టడి సెప్పంగ నేరయ్యలావు? గ్రొందెనుగుఁగట్టడి గడవఁగాదేరేని పెన్నతోఁ బాలతోఁ గ్రోలినవారు. గడుపులోఁ గూడఱుగునట్టు లుండుఁ. గూడఱుగు

చక్కటి దెలియరాకున్నఁ గూడఱుగక పోవఁగాద చుండు, పుట్టుగు గోలెను మన మాడు బాస సక్కటి దెలియకయ నేర్వనయ్యె. లాఁతుల బాసను నేర్వంగ దాని చక్కటి నెఱుఁగుట దోడుగానుండుఁ బ్రాఁదెనుఁగు వెఱబాస యట్టిదిగాన దాని చక్కటి నెఱుఁగఁగోరుదు రెల్లఁ బ్రాఁదెనుఁగు నేఁడును మాటాడకునికి. మాటాడి నేర్వఁగాఁగాదు దానిఁ. దెనుఁగుఁ గబ్బములెల్ల నొక యూరఁబుట్టెనె? కయితగా తెల్లరకు నొక యూర నుడియె? తిక్కఁడు పెద్దన లొక్క బాసాడిరె? పాఱుచుఁ జదివినను వాసి యగ పడున; కలయంగఁ జూచిన నన్నయ తిక్కల నుడులను నొక్కింతగాన నగున తెనుఁగు నాటను గల నూళుల నెల్ల నుడిగములు సమకూర్చి ప్రోవులు పైవకయ. యీనాటి పెద్దల నుడులను నేర్చి కతయేనిఁ గమ్మెని గివ్వరాదట్టె! నన్నయ. దిక్కండు, పెద్దనంబోని తొలి కైతకాంద్రకుఁ దొలి చదువరులకు పెన్నానగా నేరు నుడిగములపొత్తాలు వెంకన, రంగన సూరన వోలెఁ జేసిరె ? యేనాట నీకట్టుఁ గలదె ? నుడికప్పఁ గెలగించి నుడులేటి కూర్చి కయితమ్ము సెప్పిరే కమ్మగానేరు ? పెద్దల కబ్బాలు గాలించికాదె వెంకన రంగనలు ప్రోవిడ నోపిరి ? బాసను బరికించి బాసకట్టడి గనిరి గాక, గట్టడిమున్నచేసి మఱి వ్రాసిరె ? ముందెద్ది విద పెద్ది సూడక కడఁకఁ దబ్బిబ్బుసేయ మీ పేర్మికిఁ దగునె ? పొత్తాల పుట్టువు నెఱినెఱుక గలరు! మీయట్టి రిట్టులన నేమి నాఁగలదు.

పెద్దలచే విన్నదించుక నేనుఁ బేర్కొంటి నిచ్చోటఁ దెలియంగఁ బడఁగ. నీ కమ్మలో నేను గడుఁబూన్కి వూని కూర్చితిఁ బెక్కులు వ్రాఁత నుడులు నాయోపు! నంతకుఁ బ్రావరువడి పట్టి. ప్రాబాస సదువర్లు మెప్పు వచ్చి పసదన మిత్తురని యాస సేసి దొరఁకొన్న పనియని తోఁతెంచుఁగాని "ప్రానుడి పిఱుఁ దన దవిలి పోవఁగఁగాద. యిట ముందరేమయినయ్యె; నిట మున్ను దొలి చొప్పు సొప్పడద"నుచుఁగనుపించి చాటి చెప్పఁగ నిట్లు వ్రాసితినయ్యు. నాకది సూడంగ మేలనఁగ బాద. చచ్చి క్రుళ్ళిన డొక్కులా నుడులు ద్రవ్వి పిన్నబిడ్డలవాత పైవంగఁ జనదు. బూచులని పాఱుదురు వీఁగి తలడిల్లి. తొలుత మీరలు సదువురచ్చ గూర్పంగఁ, జదువుఁ బెంపునకు నైనాలు జతనాలు సక్కఁజేయఁగలార యని యాససేసి యుంటను, మీ పన్ను పన్నుగడ లెల్లఁ బనుపడక గుఱికి నవి దవ్వల నగుట, వగఁగూరి నాతోఁపు మిమ్ము వినిచితిని. దగు చొప్పు మది నరసి నేఁటి యదనునకు నొనరెడు వడు వొకఁడు వాడిగాఁజేసి, పాఱులు గాఁపులు నాక, యెల్లరును జదువులు నేర్వఁగ నియ్యకొనుఁడు. నేఁటి పెద్దల నుడుల తిన్నగాఁ గూర్చి వ్రాఁతలు నేర్వంగ నియ్యకొనుఁడు. నిక్కంపు నాఁడెమ్మ దెల్విచేఁ బొసగు; త్తనుడికారములఁ బొరయదయ్యు. యిప్పటి మన యేలికల బాస గాఁపులు మాలలు సుఱకఁగాఁ

జదువంగ, నుడువనెట్లయ్యె? మనబాస వెఱలకున గాద మనకేనిఁ గడుఁగొడివె యెట్లయ్యె?నదియుఁదలపోయఁ,గదురదె నాన మది మీకుఁ? ప్రాఁదెనుఁగ తగులఁ బడి,క్రొందెనుఁగు మీరుసాలించ కునికిన చదువు కొఱయయ్యె, మాట మాటకు గుటక వైవక మీరేని మాటాడ నేరరీమేటిబాస. మాట మాటకు మేర మీరితి మేమొకోయని కట్టుఁ బొత్తాలు సూచివ్రాసెదరు. ఎంత మేటిదియయిన నేమయ్యెనయ్యా? తలఁపుతో వాతికేన్, జేతికేన్, రాద. కాసికిఁ దాతేఁగి మోచి తెచ్చినవేని, మిన్నేటి నీళ్ళులేన్, మేటివేని, దప్పివోఁ ద్రావంగ నగునె యెల్లరకు? మైలవోఁగలయంపి సిలుకుట కగునేమొ. బెఱనాళ్ళ చదువులపాడిని మీరు వాడిగాఁజేకొన మెయికొనరేనిఁ, దెనుఁగులు ముతకలయి వెనుకఁ జిక్కు-దురు. వెఱవారు దెలివొంది నాఁడెమ్ము మివిలి, మించిపోదురు నుండి డిగ ద్రొబ్బిమనల.కనంతకంతకు పన్నెవాసియుఁ దఱఁగి, రూపఱి, లావేది, యెత్తు వడి, క్రుంది, తెనుఁగుఁ బలుకుల వెలఁది సిందఱవోయి. లాఁతిబాసల సాన్లు నాఁడెమైక్రేడింపఁ,జింపిరిగొట్టవు నేపొందదింక; నమ్మఁడ,నమ్మఁడ,నమ్మఁడ నిజము- నాతలఁపు గీదేనిఁ జెప్పి దూఱుఁడు; పెద్దలు; మీయెదుట రిత్తవల్కు-, నాయితమ్మనకునై యారివేరమును బూనంగలేదయ్య; బూమియ సెప్పఁ; బాపికినై తగవు; వాలి చుట్టలమె? యొడ్డారమునకు వాదూనంగలేద మురకటించు కొనకుంపి మోములు మీరు. నెయ్యమ్ము సెదరంగ నియ్యకుడఁయ్య. నా చెప్పు మాటలు దప్పుగాఁ దడవక, నాఁడెమ్ము సక్కగా నరసికొనుఁడు. కడుఁగూర్మి సదువు నెడఁగలరేని మీరలెల్ల వారికి లగ్గు నింపెట్లు గూరునటులన చేయుండి పట్టు విడిచి. నా చెప్పఁగల యది సెప్పితయ్య. యీ విట్టులంటి నావలవదు మీకు; తరుసంటి పలుకంటి వని కసరఁగాదు తప్పులు గనిపించి దయసేయుఁ డయ్య కలరూపుఁ దెలిసి యవుఁగాదనుఁడ మీరు. గేలెత్తి మ్రొక్కెదఁ గిని యకుఁ డయ్య. యెలమినాయెడ మీకునలరెడునయ్య. వరవుడమునునిచ్చపన్నఁగ లాఁడ ; నుడిగము వడవుఁడ. యూదవూనకుఁడ. యించెడు నానుడు లెల్లను మీకుఁ! గండయ్య, విండయ్య, కొండయ్య మేల. మన రచ్చ దయ్యము మన చును గాత! అక్కున సిగలోనఁ జొక్కన మోమున సానుల నెలకొల్పు మానుదొరలు సిరి, సేవ, నుడి మెఱుఁగు సమకూర్చి మంత్రు తెనుఁగుఁ జద వుల రచ్చతీర్పరుల నెల్ల. భళిరె! భళి! భళిరె! భళి! భళిరె భళి! భళిరె!

పర్లాకిమిడినుండి,
యొక వేయుఁ దొమ్మిదినూఱులుఁ
బదమూడు నగునేఁట, నాలువవు
నెల తుదినాఁటనంచిపుచ్చినది

ఇట్లు మీ యడియరి,
నీడ నేనిడితిఁ గైవ్రాలు
గిడుగు వేంకటరామమూర్తి.

## ౪

# విన్నపము*

ఎందుకీ కొత్తతెలుగు పత్రిక మరిఒకటి ? దేశములో కావలసినన్ని ఉన్నవే పత్రికలు, అనేక విధములయినవి; వాటివల్ల నెరవేరనిదీ, దీనివల్లనే కాదగ్గదీ ఏమున్నది విశేష ప్రయోజనము ? ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరము వివరించి మనవి చేస్తున్నాము. చదువరులు సావధానముగా పక్షపాతము లేక చిత్తగింతురుగాక ।

నిజమే ; అనేక పత్రికలున్నవి ; పత్రికాధిపతులూ సంపాదకులూ చాలా కష్టపడి, ధనము కర్చుపెట్టి జనులకు అనేకవిధాల ఉపకారము చేయడానికి ప్రయత్నము చేస్తున్నారు. వారి ఉద్దేశము దొడ్డదే. వారి ఉద్యమము కొనియాడదగినదే ; గాని, వారి ఉద్దేశము చక్కగా నెరవేరలేదనిన్నీ, వారి ఉద్యమము పూర్ణముగా ఫలించకుండా కొంతమట్టుకయినా వ్యర్థమవుతున్నదనిన్నీ మాకు తోస్తున్నది. ఇట్లే పుస్తకములు వ్రాస్తూఉన్నవారి ఉద్యమమున్ను సార్థకము కావడములేదు వ్యర్థముగా ధనము వెచ్చించడమే కూడని వ్యసనమంటారే ; ధనముకన్నా ఎక్కువ విలువగల దేహబలము, బుద్ధిబలము వ్యర్థముగా వెచ్చించడము ఎంత కీడోగదా! కాశీకి వెళ్ళదలచుకొన్నవారు పొగబండి -అందులోనూ మేల్ బండి—ఎక్కిపోక ఎడ్లబండిలోనో కాక ఎక్కువపుణ్యమని కాలినడకనో ప్రయాణముచేస్తే, ఏమంటారు లోకులు ? అర్ధణా కవర్లలో పెట్టి పంపించవలసిన శుభలేఖలు కూలి మనుష్యుల చేతనో బ్రాహ్మణులచేతనో పంపించి ఎక్కువ కర్చుపెట్టితే ఎక్కువ గౌరవము చేసినట్లా ? కాగితముమీద ఊటకలముతో వ్రాసిన మంత్రముకన్న గంటముతో తాటాకుమీద వ్రాసినది శ్రేష్టమంటారా ? లోక వ్యవహారములో తేట తెలుగున నలుగురూ వాడుకొనే మాటలతో చెప్పితే స్పష్టముగా బోధపడే విషయము వాడుకలో లేనిమాటలతో చెప్పితే వృథా ప్రయాసము కాదా ? దానివల్ల ఏమయినా లాభమున్నదా ? లేదని

---

*ఈ వ్యాసము మేము సనాతన సత్సంప్రదాయానుసారముగా వాడుకలో నున్న తెలుగుబాషలో వ్రాసినాము. ఈ సంప్రదాయము అనేక గ్రంథములలో కనబడుతున్నది. ఈ సంచికలోనే మూడో వ్యాసములో దానికి ప్రమాణములు చూడనగును. ఇందులో మేమువాడిన శబ్దములు నూరేండ్లకు పైగా తెలుగువారిలో పెద్దలు వాడుతూ ఉన్నవే. (ప. సం.)

తెలిసినా చాలామంది వ్యర్థముగా తాము ఆయాసపడి చదివేవారిని ఆయాస పెట్టుతున్నారు. ప్రతి మనిషీ తన మనస్సులో తాను ఏ విషయమును గురించి అయినా ఆలోచించుకొన్నప్పుడు ఏదో ఒక విధముగా తనలో తానే మాట్లాడు కోక తప్పదు—తన మాటలు పైకి వినబడకుండా గొణగవచ్చును ; ఒకప్పుడు విషయమందు మనస్సు లగ్నమైఉంటే, తాను మాట్లాడుకొంటూఉన్నట్టు తనకు తోచకనే పోవచ్చును—అనగా భాషద్వారానే కాని పరామర్శ అసాధ్యము* ఆలోచించేటప్పుడు ఏ మాటలు వాడుకొంటారో ఇంచుమించుగా ఆ మాట లతోనే ఆ ఆలోచన పైకి తెలియచేయడము అందరికీ స్వభావము—సహజ ధర్మమువంటిది మాటకూ మనోభావమునకూ గల సంబంధము చిన్నతనము నందే కలిగి అంతకంతకు దృఢపడుతుంది. ఈ ప్రకారము అలవాటయిన మాటలు మానుకొని వేరే మాటలతో భావమును చెప్పడము, ఎంతో కొంత ప్రయత్నము చేస్తేనేకాని, సాధ్యముకాదు. ప్రయత్నపూర్వకముగా మాట్లాడే మారుభాష స్వభాష అనిపించుకోదు· ఇంగ్లీషుగానీ, సంస్కృతముగానీ మనము మాట్లాడగలిగినా అవి మన స్వభాషలు కానేరవు. వేదములోని భాష పాణిని కాలములో లౌకిక భాషకాదు. అట్లే నన్నయ తిక్కనాది కవులు వాడిన కావ్యభాష ఇప్పటి దేశభాషకాదు. అది పుస్తకములు చదువుకొంటేనే గాని రాదు. దేశస్థులతో సహవాసము చేయడము చేతనే అలవాటయేది దేశ భాష, దేశభాషలో ఆలోచించిన విషయము వేరే మరిఒక భాషలో చెప్పడము భాషాంతరీకరణము. అన్యభాషలో విన్నది దేశభాషలోనికి మార్చుకొని భావ మును తెలుసుకోవలెను, ఇట్లు చెప్పేవాడున్ను వినేవాడున్ను (వ్రాసేవాడున్ను చదివేవాడున్ను) ఉభయులూ భాషాంతరీకరణము చేసుకొంటేనే గాని ఒకరి భావములు ఒకరికి తెలియకుండా ఉండేటట్లు ప్రాచీన భాష వాడడమువల్ల లాభములేదు సరేగదా శ్రమ ద్విగుణ మవుతున్నది. కావ్యములలో కవులు ఔచితినిబట్టి ఎట్టి శబ్దములు వాడుక చేసినా చెల్లునుగాని లోక వ్యవహారము లోను, జనసామ్యమునకు వ్రాసే గ్రంథములలోను చెల్లకూడదు.

ఈ పత్రికలో మొట్టమొదట చర్చించే విషయము వ్యావహారికభాష, దాని ప్రవృత్తి, దాని ఉపయోగములు, దాని గౌరవము, దానిని ఉపేక్షించడము వల్ల దేశమునకు కలుగుతూ ఉన్న నష్టములు.

మేము ఉద్దేశించిన ప్రయోజనము:—ఇంగ్లండులో ఇంగ్లీషు, ఫ్రాన్సులో ఫ్రెంచి ఎట్లున్నవో—అట్లే తెలుగుదేశములో పెద్దలు నోటను వాడే నేటి

---

* "It (language) is essential to analytical thought. It is the material basis of classification : and classification is the formal basis of knowledge.' *Payne. History of America Vol II*

తెలుగు భాషకు సాధ్యమయినంత దగ్గరగా తెలుగువ్రాత తెచ్చి నోటిమాటా, చేతివ్రాతా ఒకదాని కొకటి పోషకములుగా చేసి, రెండిటికీ సమముగా ప్రవృత్తి కలిగించి, వ్రాత సార్థకముగాను సులభముగాను చేసి, తెలుగువారు వ్రాసేదేకాక మాట్లాడేదికూడా సభ్యభాషే అనే గౌరవము దేశమునకు సంపాదించడము.

మా దృష్టిలో ఇదే వాస్తవమైన భాషాభిమానము. * మా ఉద్దేశము కొనసాగితే, పెద్దమనుష్యులు వ్రాసే సభ్యభాష దేశమంతా క్రమక్రమముగా వ్యాపించి విద్యాబోధకు కావలసిన సులభసాధన మేర్పడుతుంది. పామరులకు సులభమైన వాఙ్మయము పుట్టుతుంది. వక్తలకూ వాచకులకూ తగినభాష కుదురుతుంది. మనము ఇంగ్లీషునేర్చుకొని వ్రాస్తూఉన్నట్టే మన దేశమందు కాపురమున్న ఇంగ్లీషువారున్ను ఇతరులున్ను మనభాష నేర్చుకొని మన భాషలోనే వ్రాసిగాని నోటను చెప్పిగాని మనకు హితోపదేశము చేయవచ్చును. భాషలో ఐక్యమువల్ల దేశమునకు రాష్ట్రమునకు ఎంతబలము కలుగునో చరిత్ర చదివినవారికీ రాష్ట్రము ఏలేవారికీ తెలుసును. వాడుకలో ఉన్న భాషవల్ల కలిగే ఇన్నిలాభములు విడిచి, వాడుకలో లేనిదీ. కొద్దిమంది పండితులకు మాత్రమే సాధ్యమయినదీ, ప్రాచీన భాష వ్రాతలలో వాడడము వ్యర్థ ప్రయాసము కాదా? ఈ ఆచారము ఏ దేశములోనూ లేదు; మనదేశమందయినా పూర్వము లేదు. మన తాతలనాడు లేదు, మన తండ్రులనాడు లేదు. ఈ ఒక్క తరములోనే ఈ వైపరీత్యము, ఈ ఉత్పాతము పుట్టినది. ఈ విషయము ముందు ముందు మేము విపులముగా చర్చించ దలచుకొన్నదే; గాని ఇక్కడ సూచనగా మాత్రము చెప్పినాము.

పత్రికలుగానీ, పుస్తకములుగానీ, వ్రాసేవారి ముఖ్యోద్దేశ మేమి? నోట మాట్లాడేవారి ఉద్దేశమే: తమ అభిప్రాయములు ఇతరులకు తెలియజేయడము. మాట్లాడడము తమ ఎదుటనున్న వారికోసము. వ్రాయడము దూరముగా నున్న వారికోసము. ఎవరిమట్టుకు వారు జ్ఞాపకముగా వ్రాసి పెట్టుకోవడము కూడా గలదు నోటి మాటకన్న చేతివ్రాత మేలయినది. నోటిమాట ఒక్కమారే వినబడునుగాని చేతివ్రాత చాలామార్లు చూచి చదువవచ్చును. వ్రాత అనగా కాగి

* వాడుకలోనున్న భాషను తృణీకరించి ప్రాచీన భాషను ఆదరించడము బ్రతికియున్నవారికి తిండిపెట్టక చచ్చినవారికోసము సంతర్పణ చేసినట్టుగాదా? ఆదికవులకు ఇట్టి దురభిమానముంటే తెలుగులో గ్రంథములే లేకపోవునుగదా? మన పూర్వుల యెడల యెట్టిగౌరవ ముండవలెనో అట్టి గౌరవమే ప్రాచీనాంధ్రము సారస్వతముపట్ల ఉండవలెను. మాకు వాటియెడల చాలా భక్తికలదని వాటికి మేముచేసే ఉపచారమును బట్టి లోకులు తెలుసుకోగలరు.

తము ఒక విధమైన గ్రామఫోన్ పలక. వ్రాసేవారు తమ నోటను పలికిన పలుకులే చదివేవారు తిరిగి తమనోటను పలుకుతారు. ఇదే నోటిమాటకూ చేతివ్రాతకూ గల సంబంధము, నోట పలికినదిగానీ, చేత వ్రాసినదిగానీ,ఏది మాటయినా భావమును బోధించుటకు సాధనమాత్రము, అది పాత్రవంటి అన్నా అనవచ్చును. ఏదో పాత్రలో పోయక నీరు నిలవనట్లు, మనోభావము ఏదో ధ్వనిద్వారాగాని స్పష్టముగా తెలియదు. మనోభావమునకు ఆధారముగాను సంజ్ఞగాను ఉన్న ఈ ధ్వనికేగదా భాష అని పేరు. ఈ ధ్వనికి గురుతులు గదా వ్రాసిన అక్షరములు! ఇతరులకు ఏ జ్ఞానేంద్రియముద్వారా నయినా తెలియరాక నిగూఢముగా ఉన్న ఒకరి మనోభావము పైకి వినబడే ధ్వనులవల్ల తెలుపుడు కావడము చాలా విచిత్రమయిన విషయము అట్లే చెవికి వినబడే ధ్వనులకు కంటికి కనబడే గురుతులు వాడడముకూడా అద్భుతమైనదే. వాటి రహస్యము తత్త్వవేత్తలు ఎరుగుదురు. దానిని గురించి మరొక్కప్పుడు విచారింతము గాని ఇప్పుడు అది అట్లుండనీయండి.

నాగరికత గల ప్రతి దేశములోను ఎక్కువ నాగరికత గలిగి పెద్దలని పేరు పొందినవారు నిత్యమూ వాడుకొనే భాష సభ్యమయినదనిన్నీ ఇతరులు వాడుకొనేది అసభ్యమైన దనిన్నీ ఎన్నిక చేయడము కద్దు. దేశములో నాగరికత వ్యాపించినకొలదీ సభ్య భాషకూడా వ్యాపించి అదే సామాన్యభాష అవుతున్నది, ఇంగ్లీషువారినిగురించి, అంతో ఇంతో వారి భాషను. గురించీ మన వారికి చాలామందికి ఎంతో కొంత తెలుసును ఫ్రెంచివారు. జర్మనులు మొదలయిన వారి భాషలను గురించికూడా కొంద రెరుగుదురు. వీరిలో పెద్దలయిన వారి వ్యావహారిక భాషే వారి దేశములో సామాన్యభాష; దేశభాష. అట్టిభాష మాట్లాడే వారందరూ అది వ్రాయగలరు. వ్రాసే భాషకున్ను మాట్లాడే భాషకున్ను వ్యత్యాసము అట్టే ఉండదు. స్వీట్ పండితుడు చెప్పినట్లు 'వచనములోని భాష మాట్లాడే భాషకు దగ్గరగా ఉంటుంది * ఔచిత్యము, పదముల లోని కూర్పు, సొంపు—ఇవన్నీ రసికుల భాషలో-వ్రాసినప్పుడే కాక మాట్లాడినప్పుడుకూడా—కనబడక మానవు. సామాన్యులు నేర్పులేక ఏదో ఒక విధముగా తమ అభిప్రాయములు చెప్పినా విభక్తులు, ఆదేశములు ఆగమములు, అనుబంధములు, శబ్దార్థములు, మొదలయిన వన్నీ పండితులు మాట్లాడే భాషకూ పామరులు మాట్లాడే భాషకూ సామాన్యమే.

లోక వ్యవహారములో పండిత పామర సామాన్యముగా అందరినోటను నలుగుడు పడుతూ ఉన్న భాష ఎంతో కొంత మార్పు పొందడము భాషకు

---

* 'The language of prose often approaches very closely to that of ordinary conversation." Sweet's English Grammar Vol. I.

సహజధర్మమే. ప్రాచీన పుస్తకములు చూచిన వారందరూ ఇది లెస్సగా ఎరుగుదురు. భాషా తత్త్వ మెరిగిన వారికి భాష మారడము వింతగా కనబడనే కనబడదు. మారకపోవడమే అసంభవము. ఇంగ్లీషుభాషకు వ్రాసినట్లే ఫ్రెంచి మొదలయిన భాషలకున్ను పండితులు భాషా చరిత్రములు వ్రాసి ఉన్నారు. భాషా చరిత్రమనగా భాషలో కలిగిన మార్పుల వృత్తాంతమేకదా. ఎప్పుడూ ఒక్కలాగున ఉండే భాషకు చరిత్రమే లేదు. వాడుకలో లేక గ్రంథములందు మాత్రమే నిలిచిఉన్న భాషకు మరి మార్పు ఉండదు; మరి చరిత్రమూఉండదు. నిఘంటువులున్ను. వ్యాకరణములున్ను, వాడుకలో ఉన్న వ్యావహారికభాషలకూ కావలెను; వాడుకలో లేని ప్రాచీన భాషలకూ కావలెను. మొదటి వాటికి లక్షణము భాషతో కూడా మారుతూ ఉండవలెను ; తక్కిన వాటికి లక్షణము స్థిరముగా నిల్చి ఉండవలెను లాటిన్, సంస్కృతము మొదలయిన వాటి లక్షణము స్థిరమైనదే. ఇంగ్లీష్ భాషకు 1775 లో జాన్సను పండితుడు వ్రాసిన నిఘంటువు ఇప్పుడు పనికిరాదు వెబ్‌స్టర్ పండితుడు సుమారు నూరేండ్ల క్రిందట వ్రాసిన ఇంగ్లీషు నిఘంటువు ఎన్నోసార్లు పునర్ముద్రితమైనది; అయినప్పుడెల్లా గ్రంథము సవరణకూడా అవుతూనే వచ్చినది. బెన్ జాన్సను (1600) మొదలయిన పండితులు వ్రాసిన ఇంగ్లీషు వ్యాకరణములలోని లక్షణము ఇప్పటి ఇంగ్లీషుకు పట్టదు. ఎందుచేత బాష మారినది గనక *వైల్డు అనే పండితుడు చెప్పినట్లు వ్యాకరణము భాషకు ఆధారము కాదు: భాషే ఆధారము వ్యాకరణమునకు. 'పూర్వకాలమందు జనులు ఈ ప్రకారము మాట్లాడేవారు. గనుక ఇప్పుడు కూడా జనులు అట్లే మాట్లాడవలెను.' అని నియమించేవాడు మంచి శాస్త్రకారుడు కాడు. ఎందుచేతనంటే భాష ఎల్లకాలమూ ఒకటే తీరున ఉండదు ; మారుతూ ఉంటుంది ; మార్పువల్ల కీడుకానీ, మేలుకానీ, మారినదేమో మారినదే ; అనివార్యము. ఆ మార్పు గ్రహించి యథాశక్తి, తన కాలమందు వాడుకలో ఉన్న సభ్య భాష ఎట్లుంటే అట్లే పాటించవలెను శాస్త్రకారుడు.

---

* Grammarians do not lead speech : they follow it If a grammarian said, 'This is the way people used to speak in times past, therefore this is the way people ought to speak now, he would not be a wise or good grammarian, because a language is not the same at all times ; and if it has changed well it has changed, for better or for worse, and all that the grammarian has to do is to accept the fact and describe the best usage of his time to the best of his ability *Wyld*.

ఇట్లు అన్నిదేశములలోనూ తాత్కాలికముగా పెద్దలు వాడుకొనే భాషకే లోకమందు ప్రవృత్తి కనబడుతున్నది గాని ప్రాచీన గ్రంథములందే నిల్చి వాడుకలో లేని భాషకు గాని శబ్దములకుగాని విభక్తులకుగాని ప్రవృత్తి కానరాదు. నేడు ఇంగ్లీషు వారిలో తగు మనుష్యులు సభలో సంవాదము చేస్తూ ఉన్నప్పుడుగాని న్యాయసభలో న్యాయవాదులు ధర్మోపదర్శనములు చేస్తూఉన్నప్పుడుగాని బడిలో ఇంగ్లీషు పండితులు శాస్త్ర ప్రసంగములు చేస్తూఉన్నప్పుడు గాని, వారి నోటను వచ్చే వాక్యములు కాగితముపైని వ్రాస్తే గ్రంథములలోని భాషకున్నూ వాటిలోని భాషకున్ను వ్యత్యాస ముండదు; ఉన్నా అత్యల్పము. అంతమాత్రాన అవి వేరు భాషలు కావు; మొత్తముమీద రెండూ ఒకటే భాష.

ఇంగ్లండులో ఉన్నట్లే ఇతర దేశములలోను వ్రాయడమునకున్ను మాట్లాడడమునకున్ను ఒకటే భాష ఉన్నందున అనేక తరములనుండి సభ్యముకాని ఉపభాషలు * మాట్లాడడమునకు అలవాటు పడ్డవారు సయితము ఇప్పుడు పెద్దల సహవాసము వల్లను, చదువు వల్లను, సభలకు వెళ్ళుటవల్లను, క్రమక్రమముగా పెద్దలభాష నేర్చుకోవడమునకు వీలు కలుగుతున్నది. అందుచేత పూర్వకాలమునందు ఉపభాషలకున్న అల్పప్రవృత్తికూడా రానురాను తగ్గిపోయినది; వాటిలోనివి కొన్ని అంతరించినవి. ఇప్పుడు పెద్దలభాషే దేశమంతా అల్లుకొంటున్నది. భాషవల్ల జనులలో పరస్పర సంబంధము దృఢపడుతున్నది భాష సామాన్యమైనప్పుడు పుస్తకములు సామాన్యము కావా? అందువల్ల జ్ఞానము సామాన్యము. భావములు సామాన్యము. అందుల ఫలము సంఘమునకు ఐకమత్యము.

ఇంతేకాదు, 'నోటిమాటకు చేతి వ్రాతకు సామ్యమున్నందువల్ల లాభము, ఒక దేశమువారు మరి ఒక దేశభాషను నేర్చుకొనుట చాలా సులభముగా ఉంటుంది మాటకు. ఇంగ్లీషువారిలో అనేకులు ఫ్రెంచి, జర్మన్, ఇటాలియన్ పోర్తుగీసు, స్పానిష్ మొదలయిన యూరోపియన్ భాషలు అన్నీ గాని కొన్నిగాని అవకాశము కొలదీ నేర్చుకొన్నవారున్నారు. మన చక్రవర్తి గారికి ఎన్నో భాషలు వచ్చునట. స్వదేశ భాషవలెనే స్వేచ్ఛగా తడుముకోకుండా వారు ఇతర దేశభాషలు మాట్లాడగలరు; వ్రాయగలరు. ఇతరులతో సహవాసము చేయడముచేతను, వారి భాష నోటను తరచుగా మాట్లాడడము చేతను, ఆభాషే గ్రంథములలోను వార్తాపత్రికలలోను కంటితో చూచి చదవడము చేతను—ఇట్లు చెవికి, నాలుకకు, కంటికి, చేతికి కూడా అలవాటయి వ్యత్యాసము లేకుండా ఏకరూపమయిన భాష మనస్సులో నాటుకొంటున్నది. లోక వ్యవహారమందు ప్రవృత్తి లేక గ్రంథములందే ఉన్న భాషను దాని

---

*Provincial dialects.

లక్షణమంతా వల్లించినా వాడుకచేయడము సులభము కాదని అందరికీ తెలిసిన విషయమే. సంస్కృత వ్యాకరణమంతా కంఠపాఠము చేసిన వారందరూ స్వేచ్ఛగా లౌకిక వ్యవహారమును గురించి సంస్కృతమున మాట్లాడలేరు, వ్రాయనూలేరని చెప్పవచ్చును. మనదేశమందు వేలకొలది హిందువులు హిందూస్తాని భాష మాట్లాడగలరు. అనేకమంది అరవలు తెనుగున్ను.అనేకమంది తెనుగులు అరవమున్ను స్వేచ్ఛగా మాట్లాడగలరు. తడువుకోకుండా అన్య భాషలు మాటాడగలిగిన స్త్రీలను చూచినాను ఎంతోమందిని—ఒక్క అక్షర మైనా వ్రాయలేని వారిని. వేరువేరు భాషలు రెండు మాట్లాడే జనులు ఎక్కడ కలిసిఉంటే అక్కడ రెండు భాషలకూ ప్రవృత్తి కలిగి చాలా మందికి రెండు భాషలూ అలవాటు కాగలవు.

ఇది మనమందరమూ ఎరిగిన విషయమే. వాడుకలో ఉన్న భాషే వ్రాతలోకూడా పెట్టితే, అక్షరములు మాత్రము నేర్చుకొంటే చాలును ఎవ రయినా ఆ భాష చదువవచ్చును; వ్రాయవచ్చును. యూరపులోని భాషలు అలాగు ఉండబట్టే కదా ఇప్పుడు వేయిమందికి ఒకడయినా అక్కడి జనులలో చదువురానివాడు లేడు. స్త్రీలలోగానీ; పురుషులలోగానీ మన దేశమందు తెలుగు భాష గతి ఎట్లున్నదో చూడండి. లోక వ్యవహారమందు పెద్దలు అందరూ నోటను మాట్లాడేది ఇంచుమించుగా ఒకటే భాష అయినా, ఉత్తర ప్రత్యుత్తరములలో ఆ భాష అందరూ—పండితులుకూడా — వాడుతూ ఉన్నా 'గ్రంథము' లన్న వాటిలోను, వార్తాపత్రికలలోను, ఆ భాష బుద్ధిపూర్వకముగా మానుకొని ఏదో కృత్రిమ భాష, లోకములో ఎక్కడా ప్రవృత్తి లేనిది, (కొన్ని నేటివీ, కొన్ని మొన్నటివీ, కొన్ని కొత్తవీ, కొన్ని పాతవీ, కొన్ని ఎన్నడూలేక విశ్వామిత్ర సృష్టిలో పొడచూపినవీ—అన్నీ చేరిన 'బాస') ఎవరికి తోచినట్లు వారు కల్పించి వ్రాస్తున్నారు. ఇటుపయిని ప్రకటించే పత్రికలలో ఈ కృత్రిమ గ్రాంథిక భాష విమర్శించడమునకు ఉద్దేశించి ఉన్నాము. గనుక ఇక్కడ దానిని గురించి విస్తరించి చెప్పము. తెలుగువారిలో నాగరికులు స్వదేశభాష వ్రాయలేరన్నమాట యూరపులో వింతగా ఉంటుంది నాగరికులు స్వదేశభాష మాట్లాడలేరంటే యూరపులో నవ్వుతారు పిచ్చిమాటని. మన తెలుగువారిలో తగు మనుష్యులే సిగ్గుపడకుండా అంటారు; "మేము తెలుగు మాటాడలేము. మాలో పండితుడైనా మాటాడలేడు" అని. వాస్తవముగా వారు వ్రాయలేనిదీ, మాటాడలేనిదీ ప్రాచీనభాషగాని ఇప్పటిభాషకాదు. నాగరికులైన ఇంగ్లీషు పండితులుగాని ఫ్రెంచి పండితులుగాని తమ దేశపు ప్రాచీన భాషను మాటాడనూ లేరు. వ్రాయనూలేరు.

కొంతకాలము కిందట మన దేశములో సంస్కృతము వలెనే యూరపులో లాటిన్ గ్రీక్ భాషలు ఎవరో కొందరు యావజ్జీవము వేరేపని లేకుండా అభ్యసించి పండితులయి చాలా గౌరవము పొంది, ఆ భాషలో ఉన్న ప్రాచీన గ్రంథరాజములు చదివి వాటి అర్థమును దేశభాషలలో జనులకు బోధించేవారు. సాధారణముగా 'గ్రంథము' అనేది వ్రాయడమునకు ఆ ప్రాచీన భాషలే యోగ్యమయినవని అనుకొనేవారు. కొందరు బుద్ధిమంతులు మాత్రము అప్పుడప్పుడు అక్కడక్కడ లేచి వాడుకలో ఉన్న దేశభాషలలో కొన్ని గ్రంథములు వ్రాసి గురు శుశ్రూష చేసిన జనులకు కొన్ని విద్యలు చెప్పుతూ వచ్చినారు. ప్రాచీన భాషా పండితులు ఇట్టి వారిని చూచి ద్వేషించేవారు. మతగ్రంథములు—బైబిలు—దేశభాషలలో వ్రాయనిచ్చేవారు కారు. అట్లు వ్రాయడానికి ప్రయత్నించిన వారిని వెలివేసి కఠినముగా దండించేవారు. తర్కశాస్త్రము జ్యోతిశ్శాస్త్రము మొదలయిన శాస్త్రము లేవిన్నీ దేశభాషలలో వ్రాసేవారుకారు. అట్లు వ్రాస్తే తమ మహాత్మ్యం తమశాస్త్రముల మాహాత్మ్యము పోవుననిభయపడేవారో ఏమో! మొత్తానకుదేశభాషలు దిక్కుమాలినవిగాఉండేవి. యూరపుదేశస్థులు ఇప్పుడు తమ దేశభాషలే ఎక్కువగా అభ్యసించి ఆదరిస్తున్నారు. అల్లే మన తెలుగుభాషకూడా సంస్కృత పండితులదృష్టికి నీచభాషగా ఉండేది. ఇప్పటికీ ఉన్నదని చెప్పవచ్చును. సంస్కృతము ముందర ఇట్టి దేశభాషలు అపభ్రంశములు. గ్రామ్యాలు * వీటిలో గ్రంథములు వ్రాస్తే నరకములో పడతారట! ఇట్టి భావములుగల పండితుల మాట తిరస్కరించి కొందరు దేశభాషాభిమానులు, రసికులయిన వారు తమ వేష దేశభాషలయందు అభిమానము గలవారై వైకృత భాషంలో వ్రాసిన గ్రంథములను మెచ్చుకొంటారని తెనుగునకు గౌరవము సంపాదించినారు •. అట్టివారు ఎంత ఉదారవంతులో కదా!

వారి ఉద్దేశ మేమి? సామాన్యజనులు సంస్కృత భాష పూర్ణముగా అభ్యసించలేరు. ఆ భాషలో సంపూర్ణ పాండిత్యము కలిగితేనే కాని అందులో ఉన్న గ్రంథములు చదువుకొని అర్థం చేసుకోవడ మసాధ్యము. జ్ఞానమువల్లగాని మనుష్యులు వృద్ధి పొందలేరు. జ్ఞానము కలుగడానికి ఏ భాష అయితే నేమి? పరిచయము గల భాషలో బోధించినది తెలుసుకోవడము సులభము గనుక అపభ్రంశ మన్నాసరే * గ్రామ్యమన్నాసరే, వైకృతమన్నా సరే, మ్లేచ్ఛమన్నా సరే •, లౌకిక భాషలోనే కావ్యములుకూడా వ్రాయవచ్చును. కావ్యమనగా రసవంతమైన వాక్యము. రసమునకు ప్రధాన మైనది శబ్దముకాదు

* "అపభ్రంశం ప్రయుంజానా నరకం యాంతిమానవాః—

• "స్వస్థాన etc" ఆంధ్రశబ్ద చింతామణి :—

శబ్దార్థము. మాట అనీ అనడముతోనే రసము స్ఫురించితేనే కాని ఆనందము కలుగదు : శృంగారరసము కానీ, భక్తిరసము కానీ. అట్టి స్ఫురణ వాడుకలో ఉన్న మాటలవల్లనే కలుగుతుంది—ఇదీ ఆ మహాత్ముల ఉద్దేశము. ఈ ఉదార భావమే కర్పూర మంజరిలో రాజశేఖర కవి తెలియజెప్పినాడు. నాటకమంతా (ఉత్తమ పాత్రల వాక్యములుకూడా) ప్రాకృతములోనే రచించి, అట్లు రచించినందుకు, 'సంస్కృతభాష మగవానివలె మోటుగా ఉంటుంది; ప్రాకృతమైతే సుందరివలెనే సుకుమారమైనది. స్త్రీ పురుషుల కెంత భేధమున్నదో అంత భేదమున్నది ప్రాకృతమునకున్ను సంస్కృతమునకున్ను; ఉక్తివిశేషము కావ్యము; వట్టి శబ్దములు కావు; భాష ఏదైతే అదే కావచ్చును' అని సమాధానము చెప్పినాడు.

ఇట్లే తన ఆంధ్రభాషార్ణవములో కోటి వెంగనార్యుడు "దేవతల భాషగావునఁ దెలుగుకన్న। సంస్కృతము మిన్నయాయుక్తి సరియె తెలిసి । రసికుఁ డగువాఁడు తనదుజాఱుసికలోన । దులసినే యిడుకొనునొ జాదులనె యిడునొ?" అని 'సంస్కృతము తులసివంటిది; తెనుగు జాజిపువ్వులవంటిది, అన్నభావము తెల్పినాడు. తెలుగువారికి తెలిసిన తెనుగుమాటలచేతనే రసస్ఫూర్తి కలుగునని ఒప్పుకొన్నాడు , "కాననీ యాంధ్రకృతులందుఁ గలుగునట్టి। పదములకు నెల్ల నర్థమేర్పడెడురీతి । నద్భుతంబుగఁ గృతిని జేయంగవలయు । నర్థమైన రసస్ఫూర్తియగుట యరుదె ?॥,

జనులందరూ ఏక కుటుంబములోని వారని ఎన్నుకొని జాతిభేదములు పాటించకుండా ప్రవర్తించే ఉదార చరితుల వలెనే, భాషలన్నిటికీ ప్రయోజనము ఒకటే అని తెలుసుకొని, ఏభాష ఎవరికి సుపరిచితమో వారికి ఆ భాషే జ్ఞాన సంపాదనమునకు, జ్ఞానదానమునకు యోగ్యమైనదనిన్నీ తెలియని భాష ఎంత ప్రాచీనమైనా నిరర్థక మనిన్నీ దూర దృష్టిగల లోకజ్ఞులు అంగీకరిస్తారు. తాతగారు తవ్వించిన నూయి అని ఉప్పు నీళ్ళైనా తాగేవాళ్ళు కాపురుషులటగదా। ఎవరైతే నేమి? తమకు హితమైనదే లోకానకంతా హితవుకాక తప్పదనుకోవడము వివేకము కాదు.

'కొన్ని జీవులు చిదిపి జాల్ గొంటికి బ్రదుకు। కొన్ని నునుసోఁగవెన్నెలల్ గ్రోలి పొదలు । భిన్నరుచులైన వానికిఁ బ్రీతి సరియె । తగవుగాదిందులో

* "అప్పకవీయము (సరస్వతి బాల్య భాష)

, క్షితిమ్లేచ్ఛ....వ్యవహారహాని సంధిలుకతనన్—విడువగూడదు. అప్పకవీయము 1-169.

ననేకతర గర్హ. * అని దమయంతి తనకు ఇష్టుడు నలుడేకాని సురపతి అయినా ఇంద్రుడు కాదని చెప్పినట్లు తెలుగువారు తమ భాషయందభిమానము కలిగి ఉండడము తప్పుకాదు. పూర్వకవులు వాడిన దైనా ప్రాచీనాంధ్రము కన్న వర్తమానంధ్రభాషే సుపరిచితమైనది. గనుక దాని యెడల ఎక్కువ ఆదరము చూపడము దోషము కాకూడదు; మెచ్చదగినదే కావలెను. 'దప్పిగొన్నట్టి వారికా దప్పిదీఱ। సలిలపూరంబు హితవొ? యాజ్యంబు హితవొ?', అన్న కవి హృదయము స్పష్టము. తిక్కన కవికూడా తనకాలమందు వాడుకలో ఉన్న తెలుగును ఆదరించి పాత తెలుగును ఎట్లు నిరసించినాడో చూడండి.

చ॥ పలుకులు పొందులేక రసభంగము సేయుచుఁ బ్రాత వడ్డ మా
టలఁ దమనేర్పుఁజూపి యొకటన్ హృదయంబలరింప లేక యే
పొలమును గాని యట్టి క్రమముం దమ మెచ్చుగ లోకమెల్ల న
వ్వులఁ బొరయం జరించు కుకవుల్ ధర దుర్విటు లట్ల చూడఁగన్॥

పాత మాటలలోనే మహాత్మ్యమున్న దనుకొన్న వారు. అనన్య సామాన్య భాషా వైదుష్య గరిష్ఠులు, 'ఆంధ్ర భాషామయం కావ్య మయోమయ విభూషణం గీర్వాణారణ్య సంచార విద్వన్మత్తేభ శృంఖల'మ్మని చెప్పదగిన కావ్యములు రచించుకొని, తమమాటలు పండితుల కయినా తెలియకుండా చదువుకొని కావ్యరసము జుఱ్ఱుకొందురుగాక। రసజ్ఞులయిన కవులు మాత్రము అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ కూడా యథోచితముగా సరికొత్తమాటలతో పొందించి వివిధములయిన కావ్యములు వ్రాస్తూనే ఉన్నారు. రామభద్రుడు సకల కథాసార సంగ్రహమందు.

ఉ॥ నన్నయ తిక్కనాది కవినాథులు చెప్పిన యట్ల చెప్ప లే
కున్నఁ దటుత్త రాంధ్రకవు లూరక యుండిరె? తోఁచినట్లు ని
త్యోన్నత బుద్ధిఁ గబ్బములు యోజ రచింపక యందు జ్ఞాన సం
పన్నుల కావ్యముల్ హరి సమర్పణమై చెలువొందు నెందునున్॥

అని ఉత్తరాంధ్రకవుల కావ్యములకు గౌరవము లేదన్న వారికి ప్రత్యుత్తరముగా చెప్పినాడు. ఈతని తాత వాడుకమాటలతో చెప్పిన ఒంటిమెట్ట రఘువీర శతకమును ఆకాలమువారు మెచ్చుకొన్నారట। భాషలో అపశబ్దములున్నా

* శ్రీ వే. వేంకటరాయ శాస్త్రిగారు పరిష్కరించిన పాఠము; గాని నాల్గవ చరణములో యతి భంగము మావద్దనున్న తాటాకు పుస్తకములోని పాఠము:- 'తగవుగా దిందులో నేకతరవి గర్హ'

సువ్యక్తమై భావము మంచిదైతే చాలును. 'చెరుకునకు వంకబోతేమి చెడునె తీపు?, అని శేషప్ప అన్నట్లే.

మ॥ అపశబ్దంబులఁగూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా
 ప పరిత్యాగము సేయుఁగావున హరిన్ భావించుచున్, పాడుచున్,
 జపముల్ సేయుచు, వీనులన్ వినుచు నశ్రాంతంబు గీర్తించుచున్,
 దపసుల్, సాధులు ధన్యులౌదురు గదా తత్త్వజ్ఞ చింతింపుమా.

అని భాగవతోత్తముడైన బమ్మెర పోతరాజు చెప్పియున్నాడు.

రసవంతమైన కావ్యములు రచించిన వారందరిని లాక్షణికులు ఎందుకో ఒకందుకు నిందించడము అరుదుకాదు. కుకవుల నింద మామూలేకదా. రసికులయినవారు పిచ్చలచ్చనాలు పాటించలేదు. వాస్తవముగా కవులు స్వేచ్ఛా విహారులు వారి రుచే వారికి ప్రమాణము. వారికి శబ్ద సిద్ధి లోకమువల్లనే తెలుస్తుంది. వారి ప్రయోగములే లక్షణమునకు లక్ష్యములు. అన్నిదేశములలో కవులకు ఈ అధికారము, ఈ స్వేచ్ఛ ఉచితమైనవని అంగీకరించినవే. ఏ కవి ఇతరులు చెప్పిన లక్షణమునకు భయపడి తన మతము మార్చుకొంటాడో ఆ కవి అస్వతంత్రుడు; అతని కవిత్వము అతనిది కాదు; అతని పన్నీ ఎరవే; పంజరములో రెక్కలు కత్తిరించి పెట్టిన చిలకలాగున 'కృష్ణతాతా-తోటకురా' అని పలకవలసినవాడేకాని యథేష్టగా వనమందు విహరిస్తూ కూజించే కోకిలవలె పాడలేడు. అందుచేతనే, సహజమైన రీతిని పదములు కూర్చితే కవితసొంపుగా ఉంటుందిగాని మాసికలువేస్తే ఉండదు.

మ॥ చతురుల్ పూర్వ కవీంద్రు లన్నిటకు; నే స్వల్పజ్ఞుడన్ స్వామికిన్
 హితమో కాదో మదీయ కావ్యమని నాకేలా విచారింప; న
 గ్రతనూజుల్ వ్యవహార కర్తలయినంగానీ, కడుంబాలుఁడౌ
 సుతు నవ్యక్తపు మాట తండ్రి కొదవించున్ గాదె యానందమున్॥

అని అబ్బయామాత్యుడు చెప్పినాడు. అతడే లాక్షణికులను పరిహసించి సరస్వతి తనకు నేర్పిన మాటలనే వాడుతానని:—

ఉ॥ చెల్లనటంచు నొక్క కవి చేసిన లక్షణ మొక్క రివ్వలన్,
 జెల్లమిఁజేసి తా రొకటి చెప్పగ ఛాందసవిస్తరంబు సం
 ధిల్లుటఁ గావ్యశంక లవనిం దఱుచయ్యె రసజ్ఞులార! నా
 యుల్లపు సౌధవీధిఁ గొలువున్న సరస్వతి సత్యవాణి నా
 తల్లి యొసంగు పల్కులివి తప్పులుచేయక చిత్తగింపుడీ॥

అని కవిరాజ మనోరంజనములో వ్రాసినాడు. ప్రాచీన లక్షణమే పరమ ప్రమాణముగాను ప్రాచీన భాషే శిష్టభాషగాను ఎన్నుకొని, పాత కంపే

తమ కింపుగా వ్రాయడము ఎంత ప్రచురముగా ఉన్నా. సరస కవులు కొందరు వాడుక మాటలకు కావ్యములందు ప్రవృత్తి కలిపిస్తున్నారు. ఇతరులు ఆక్షేపిస్తే వారు భయపడరు. చూడండి ఏమంటున్నారో నేటి కవులు కొందరు.

ఉ॥ కాలముఁబట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశ భా
షాలలితాంగి మాఱుటది సత్కవి సమ్మతమౌట, నన్య దే
శ్యాలును నాంధ్రభాషఁ గలపౌటను, నౌచితిఁబట్టి మేము క
బ్బాలను వాడుచుంటి మవి పండితు లేగతి నొప్పకుందురో !

సెబాష్! తిరుపతి వెంకటేశ్వర కవులు! మీరు నిజమైన ఆత్మ గౌరవము గల కవులు! 'కాలము, దేశము, ప్రభుత్వము, భాష—మారక తప్పదు; అన్యదేశములతో సంబంధమున్నప్పుడు అన్యదేశ్యాలు భాషలో చేరకమానవు. ఔచిత్యము, అనౌచిత్యము. ఏర్పరించడములో కవి హంసవంటివాడు. తన అంతఃకరణ ప్రవృత్తే కవికి ప్రమాణము.' ఎంత చక్కగా చెప్పినారు!

ఈకవుల కావ్యములను విమర్శించినవారు శబ్ద రత్నాకరమును బట్టీ, చిన్నయసూరి వ్యాకరణమునుబట్టీ, తప్పులెన్నినప్పుడు, పంచాంగములో చెప్పకపోతే ఆకాశముమీద నక్షత్రాలుండరాదా అనీ, ప్రయోగమూలం వ్యాకరణము గనుక ప్రయోగమే ప్రమాణమనీ, సిద్ధిర్లోకాద్ధృశ్యా అనీ, నిరంకుశాఃకవయః అనీ, సమాధానము చెప్పినదే కాక,

'క. వ్యాకరణ మొక్కత్రోవ, మహాకవు లొకత్రోవ, కోశ మఖిలమ్మొక
త్రోవై కనుపట్టెడి నీ భాషా కావ్యమ్ములను దఱుచు చదివిన కొలదిన్.'

'క. తొలిబాసయందుఁ బలె నీ తెలుగుంబాస వెలయించు దీపము లేమిన్
విలువగల కవుల లక్ష్యమ్ములె తా మీ భారమెల్ల మోయగవలయున్.'

అని తమ గ్రంథములలో స్పష్టముగా తమ ప్రమాణము విశదపర్చినారు.

మాకు వీరే మార్గదర్శులు. కావ్యభాషలో శబ్దముల సాధుత్వాసాధుత్వములు నిర్వచించడానికి కవుల ప్రయోగములే ప్రమాణము * ఈ ప్రయోగములు లక్ష్యముగా చేసుకొని వాటికి విరోధము రాకుండా లాక్షణికులు లక్షణము చెప్పవలెను. ఈ లక్షణశాస్త్రము భాషావిషయములో కవికి సంకెళ్లు వేయడమునకు అధికారము కలదికాదు; పూర్వకవుల వాడుకకు జ్ఞాపకమాత్రము; ఆవిషయములో కవికి లోకమే ప్రమాణము. ఔచితినిబట్టి ప్రాచీన శబ్దములూ, నవీన శబ్దములూ, దేశ్యాలూ, అన్యదేశ్యాలూ యథేష్టముగా వాడవచ్చును కవి. ఈ ప్రకారముగానే ఏ కాలములందున్న కవులు ఆ కాలమందు లోకములో వున్న భాషారూపములు వాడి వున్నారు. కావలసినన్ని శబ్దము లట్టివి వుదాహరించ వచ్చును. ఇట్టి శబ్దములు అనేకములు కవిప్రయోగరూఢములని ఎరుగక కేవల

గ్రామ్యము లనుకొని వ్యావహారిక భాష అపభ్రంశమనిన్ని. గ్రంథములందు ప్రవృత్తి లేనిదనిన్ని బాలులు, బాలికలు, భ్రమపడేటట్టుగా డాంబికులు తాము వాడడము మానివేసి, ఇతరుల్లు వాడితే ఆక్షేపిస్తూ ఇప్పు డేదో గ్రాంధికభాషట వ్రాస్తున్నారు. ఈ పత్రికలో వచ్చే నెలనుండి ఇట్టి శబ్దములు విమర్శించి, వాటి ప్రయోగములు మాకు చిక్కినన్ని చూపించి, వాటిసాధుత్వము సిద్ధాంతము చేయ నుద్దేశించినాము. అనేక గ్రంథములు చదివిన పండితుల సహాయము లేనిదీ ఈ వుద్యమము బాగుగా నెరవేరదు గనుక అట్టివారు మాకు తోడ్పడు దురుగాక. *

గ్రాంధికభాష అనేది కొత్తపేరు. అది ఏదయినా గ్రంథములలోనిది గదా కావలెను. తెలుగు గ్రంథములు అనేక విధములుగా వున్నవి. వీటిలోని భాష ఒక్కలాగుండదు. కొన్ని (క) ఛందోబద్ధములు; కొన్ని (గ) కేవల వచనములు. ఛందోబద్ధములయిన వాటిలో కొన్ని (1) ప్రబంధములు, పురాణములు, ఇతిహాసములు, మొదలయినవి; కొన్ని (2) శతకములు, కొన్ని (3) ద్విపదములు, రగడలు: కొన్ని (4) కళికలు, వుత్కళికలు; కొన్ని (5) పాటలు, పదములు, కృతులు, కీర్తనలు, జావళీలు మొదలయినవి; మరికొన్ని (6) దండకములు మొదలయినవి—ఇట్లు వివిధముగా వున్నవి. వచనములు కూడా నానారూపములుగా ఉన్నవి. కొన్ని (1) చంపూకావ్యములలో మధ్య మధ్యను ఉన్నవి; కొన్ని (2) అప్పకవీయము, బాలసరస్వతీయము, మొదల యిన లక్షణ గ్రంథములలోని 'అవతారిక' 'తెలివిడి' 'వివరణము' 'టీక' అనే పేళ్లు గలిగి ఉన్నవి. కొన్ని (3) సంస్కృతాంధ్ర కావ్యములకు నిఘంటువు లకున్ను తెలుగు టీకలుగా ఉన్నవి; కొన్ని (4) వైద్యము, జ్యౌతిషము, గణితము; సంగీతము, అభినయము, మొదలయిన శాస్త్రములు వివరణము; కొన్ని (5) వేదాంత విషయ కోపన్యాసములు : కొన్ని (6) స్తోత్రములు ; కొన్ని (7) రాజశాసనములు ; కొన్ని (8) కథలు ఆఖ్యాయికలు, క్షేత్ర మాహాత్మ్యములు.

ఇవి అన్నీ గ్రంథములేగదా ! వీటిలోని భాషగదా గ్రాంథికభాష అన వలెను. ఇవి అన్నీ వివేచనతో పరీక్షించి చూచినయెడల ప్రబంధములందు మాత్రమే వ్యావహారిక భాషకు భిన్నరూపముగా ఉన్న ప్రాచీన భాష ప్రచురముగా కనబడును: వీటిలో అయినా ఆయా కవులు తమతమ ఇష్టానుసారము ఉత్తరాంధ్రభాషా రూపములు, విరళముగా కొందరు, ప్రచురముగా కొందరు, వాడిఉన్నారు. ఛందోబద్ధములయిన తక్కిన గ్రంథములలో - వెరసుమాట— కవులు నిరాటంకముగా వ్యావహారికభాష ఆదరించినారు ప్రబంధమువలెనే

* చూ. కొవ్వూరి సారస్వత మహాసభవారి తీర్పు. (మూడవవ్యాసము)

శతకములు వ్రాసినవారు కొందరున్నారు. పాటలు మొదలయినవి మాత్రము పూర్వులందరూ సరసముగా వాడుకమాటలతోనే కూర్చినారు. ఈ పాటలు ఛందోబద్ధములు కావా ? ఆ పాటలు రచించినవారు కవులు కారా ? త్యాగారాయలను వారికృతులను తలచుకోండి. ఇక వచనములమాట చెప్పుతాము. చంపూకావ్యములలో అక్కడక్కడ ఉన్న 'వచనములు' మాత్రము వాటిలోని పద్యములవలెనే ప్రాచీన భాషామయమయిన కావ్యభాషలో వ్రాసిఉన్నవి. తదితరమైన వచనగ్రంథమేది చూచినా వ్యావహారిక భాషలోనే ఉన్నది. పద్యకావ్యము వలెనే కేవలము కావ్యభాషలోనే రచించిన వచనగ్రంథము నిజమయిన తెలుగు దేశములో మాకు ఎక్కడనూ కనబడలేదు. తంజావూరు మొదలుకొని గంజాం జిల్లాలోని ఛత్రపురము వరకూ ఏయేచోట్ల తాటాకుపుస్తకములున్నవని మాకు తెలిసినదో ఆ యా చోట్లకుపోయి అవి చూచినాము. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు సంపాదించిన తాటాకుపుస్తకములలో నాలుగయిదు కాబోలు ఉన్నవి, అంతే, కావ్యభాషలో రచించినవచనగ్రంథములు. వాటిలో జైమినీభారతము మాత్రము నిరుడు పరిషత్తువారు అచ్చు వేయించినారు. కొన్నిటికి ప్రతులు చెన్నపట్టణము గవర్నమెంటువారి గ్రంథాలయమందున్ను, తంజావూరి గ్రంథాలయమందున్ను ఉన్నవి; మరియెక్కడనూ మాకు కానరాలేదు. ఈ అద్భుత వచన గ్రంథములు రచించినవారెవరో తెలుసుకొంటే, ఎందుచేత అట్టి అద్భుత వచనము వారు రచించినారో ఊహించవచ్చును. మ. రా. రా. జయంతి రామయ్య పంతులుగారే ఒక పుస్తకములో * "తంజావూరు, తిరుచినాపల్లి, మధుర - ఈ రాజ్యములు పాలించిన 'నాయక' రాజుల కాలములో ఇవి పుట్టినవి. ఇవి మొన్న మొన్న దొరికినవి. ఇంతవరకు ఈ గ్రంథము లున్నవని ఎవరూ ఎరుగరు. ఇప్పటి గ్రాంథిక వచనమునకు చెన్నపట్టణములో ఉండిన చిన్నయసూరిగారే బ్రహ్మ." అని వ్రాసినారు. బాగాఆలోచించండి. తంజావూరు తిరుచినాపల్లి, మధుర, చెన్నపట్టణము - ఇవి అరవదేశములోనివి. అక్కడ కాపురముంటున్న తెలుగులు ఎట్టి తెలుగున సంభాషింతురో వారితో మాట్లాడినవారికి గాని తెలియదు. చెన్నపట్నము మొదలుకొని రామేశ్వరమువరకు ఉన్న పెద్ద పట్టణములలో ఉన్న తెలుగువారిని కొందరిని చూచి వారితో సంభాషించియున్నందువల్ల మా కాసంగతి బాగా తెలుసును. పాత తెలుగుమాటలు కొన్ని, కొత్తవి కొన్ని అరవమాటలు కొన్ని కలిపి చిత్రమైన ఏసతోను, స్వరముతోను వారు మాట్లాడుతారు. + కొంత పరిచయము కుదిరేవరకూ వారి మనోభావము స్పష్ట

---

* Defence of literary Telugu P. 2.

+ తంజావూరి గ్రంథాలయములో అరవైకంటె అధికముగా తెలుగు నాటకా లున్నవి. వాటిలో స్పష్టముగా కనబడుతుంది అరవతెలుగు ఎట్టిదో.

ముకాదు. ఇట్టి తెలుగు వ్యావహారికభాషగా గలవారు తెలుగుపండితులుగా ఉంటే వారు రచించే గ్రంథములు ప్రాచీనకావ్యములశైలినికాక మరి యేలా గున వ్రాయగలరు? వేగినాడు, వెలనాడు, పాకనాడు, కమ్మనాడు, పల్నాడు మొదలయిననాళ్ళు నిజమయిన తెలుగుదేశములోనివి. ఇక్కడి వారు వందలు వందలు వ్రాసిపెట్టినారు గ్రంథాలు నానావిధములయినవిన్నీ. అందులో మొదను చెప్పినట్లు ప్రబంధాలన్నీ కావ్యభాషలోనున్ను, వచన గ్రంథాలన్నీ వ్యావహారిక భాషలోనున్ను ఉన్నవి.

ఇదీ తెలుగు దేశములో మొన్నమొన్నటివరకు సంప్రదాయము. పెద్దన గారు మనుచరిత్ర వ్రాసినట్లు కావ్యభాషలో వ్రాయించక వ్యావహారిక భాషలో వ్రాయించినారు తమ ధర్మశాసనములు. కృష్ణదేవరాయలవారి ధర్మశాసనములు వాడుకభాషలో ఉన్నవిగాని ఆముక్తమాల్యదవలె కావ్యభాషలోలేవు. శ్రీ సకల కవితా స్వతంత్ర భట్టారక యెలకూచి బాలసరస్వతీమహామహోపాధ్యాయుల వారే తమ ప్రబంధములు కావ్యభాషలో వ్రాసి, ఆంధ్రశబ్దచింతామణికి టీక వ్యావహారికభాషలో వ్రాసినారు. అప్పకవివంటి లాక్షణికుడు తన లక్షణ గ్రంథములలో పద్యాలన్నీ కావ్యభాషలో వ్రాసినా అవతారికలు, వ్యాఖ్యలు, టీకలు మొదలయిన వచనము లన్నీ, - ఒకటీ రెండూకాదు, వందలున్నవి - వ్యావహారిక భాషలో వ్రాసినాడు. అచ్చుపడ్డ అప్ప కవీయమందు 1859 వ సం॥ లో పరిష్కర్తలు ఈ వచనములోని వాడుకభాషకావ్యభాషగా మార్చివేసినారు. * ఇట్లే భారతము లక్ష్మీపతిగారు భారతమునకున్నూ ముద్దరాజు రామన్న రాఘవ పాండవీయమునకున్ను, చిత్రకవి అనంతుడు హరిశ్చంద్ర నళీయమునకున్ను సోమనాథ పండితుడు. జూలూరు అప్పయ పంతులు, శిష్టు కష్ణమూర్తిశాస్త్రి మొదలయినవారు వసుచరిత్రకున్ను వ్యావహారికభాషలో టీకలు వ్రాసినారు. అనేక వ్రాతపుస్తకములు దేశమందున్నవి. వందలకొలదిగా పండితులు, కవులు, రాజులు, మంత్రులు, సేనాపతులు మొదలయినవారు వాడుకమాటలలో వ్రాసిన వ్రాతలు ప్రచురముగా మా కంటికి కనబడడముచేత ఈ విషయమందు మాకు, దృఢమైన విశ్వాసము కలిగి, వాస్తవమయిన సంప్రదాయము లోక ములో బహిరంగముగా ప్రకటించడము మంచిది అని తోచి ఈ పత్రికా ముఖ మున విజ్ఞప్తి చేయడమునకు సాహసించినాము.

ఇంకొక్క మాట. తెలుగువారి విద్య, వారి భాష, వారి సారస్వతము— వీటినిగురించేకాని యితరవిషయములజోలికి మేము పోము. తెలుగువారి

* అప్పకవీయము వ్రాతపతులు ఇరవై చూచి ఉన్నాము. అన్నిటిలోను మేము చెప్పినట్లే వచనములున్నవి. ఆంధ్రవిజ్ఞానసర్వస్వములో మ॥ కొమర్రాజు వెంకటలక్ష్మణరావుగారు చెప్పినది చూడవచ్చును.

విద్యకు ఆటంకములు కాకుండా ఉంటే రాచకార్యములతోగాని, మతములతోగాని, జాతితోగాని మరిదేనితోగాని, మాకుపనిలేదు. భాషా సారస్వతముల విచారణలోనైనా సత్యమందే మాకు పట్టుదలగాని, వాదుల యెడలను ప్రతివాదుల యెడలను ద్వేషముండదు; అందరున్ను మిత్రులే. ఇది మా సంకల్పము.

రాబోయే సంచికలలో మేము విచారించదలచుకొన్న విషయములు: —

1. తెలుగు మాటల సాధుత్వా సాధుత్వముల నిర్ణయము. అసాధువులనుకొన్న అనేక శబ్దములు సాధువులనుకొనుటకు ప్రమాణములు. 2. నన్నయ భారతములోని పదముల పట్టిక. 3. తెలుగుపదముల రూపాంతరములు. 4. సంస్కృత పదముల రూపాంతరములు. 5. అంత్యవర్ణములనుబట్టి (అకారాంతాదిగా) ఏర్పరచిన తెలుగు మాటల పట్టిక 6. గ్రంథములలో పాఠాంతరములు. 7. తెలుగుభాషా చరిత్రమునకు కావలసిన సామగ్రి. 8. నేటి తెలుగు భాషకు లక్షణము ఏర్పరచుటకు కావలసిన సామగ్రి 9. మన పూర్వులు వ్రాసిన వచన రచనకు ఉదాహరణములు. 10. తెలుగులో చేరిన అన్యదేశ్యములు. 11. తెలుగు మాటల వ్యుత్పత్తి. 12. తెలుగునిఘంటువులలోని లోపములు. 13. తెలుగువ్యాకరణములోని లోపములు 14. తెలుగుఛందస్సు. 15. దేశము, జాతి, వృత్తి మొదలయినవాటిలో భేదమునుబట్టి తెలుగు భాషలో కలిగిన భేదములు 16. సర్వజనసామాన్యమైన విషయములు బోధించే పుస్తకములు 17. నేడు తెలుగుగ్రంథములలో వాడుకూఉన్న భాష 18. సారస్వత విమర్శ. 19. భాషాతత్వము 20. అన్యదేశముల సారస్వతము 21. విద్యాభివృద్ధి.

బ్రహ్మాండమంత పని ఏమిటి: చిన్న చీమంటంటి మేమేమిటి! ఎంత సాహసము! అని భయపడి విముఖులమై ఉంటే. మా మిత్రులు 'మీరు పని మొదలుపెట్టితే సాయంచేసేవారు లేకపోతారా? మీవలెనే ఈ విషయములు విచారిస్తున్నవారు కొందరున్నారు. ఒకరికొకరు తోడయితే పనిసాగకపోదు." అని పురికొల్పారు. సదుద్దేశముతో చేయబూనుకొన్న ఈ పని నెరవేరేటట్టుగా తెలుగువారున్ను తెలుగువారి అభివృద్ధిని కోరే యితరులున్ను మాకు యథాశక్తి సాయము చేయుదురుగాక అని మిక్కిలి వినయంతో ప్రార్థిస్తున్నాము.

# పీఠిక*

ఈలాటి సాహసం - ఆంధ్రభాషాధ్యయనాన్ని పెంపొందించడానికై అంకితమయిన పత్రికను నెలకొల్పటం - అనాహూతమయిన కొందరపాటుగా కనిపించవచ్చు. "రిజస్ట్రార్ ఆఫ్ బుక్స్" ప్రకటించిన ప్రచురితగ్రంథాల పట్టికలు తెలుగు సాహిత్యం అభివృద్ధి చెందుతున్నట్లు రుజువుచేయటం లేదా? ఇప్పటికే ఈ దేశంలో, ప్రఖ్యాత రచయితలు వున్నారు కదా? విజ్ఞానవ్యాప్తికి ఉపకరించే గ్రంథాలు తెలుగున ఎక్కువగా, వెలువడుతున్నవి కదా? ఇన్ని వున్నపుడు, ఆంధ్రభాషాధ్యయనాన్ని పెంపొందించడానికి, వేరే, ఇంకేమి కావలసివచ్చింది?

గత కొన్ని సంవత్సరాలుగా రెండు విభిన్నమతాల మధ్య తీవ్ర వాదోపవాదాలు సాగుతూనే వున్నాయి. సనాతనత్వానికి వక ప్రమాణాన్ని నిర్ణయించే ఒక మతం, సాహిత్యానికి గల కాలంలోనే నిజమైన తరుణోపాయం వుండేదని భావిస్తూ, దేనిని కీర్తిశేషులు గురజాడ వెంకటఅప్పారావు పంతులుగారు 'నవ్యకావ్యభాష' అని పేర్కొన్నారో, ఆ భాషలో రచయితలు వ్రాసిన రచనలే, ఆదర్శప్రాయాలని విశ్వసిస్తున్నది. రెండో మతం - (నేటి గ్రామ్య జాతీయంలో చెప్పాలంటే) నూతన దృక్కోణపు అగత్యాన్ని నొక్కి వక్కాణిస్తూ, ఫ్రెంచి, ఆంగ్ల సాహిత్యాలనుంచి తాను నేర్చుకున్నాననుకుంటున్న గుణపాఠాలపై ఆధారపడి, నూతన భాషా, సాహిత్య ప్రమాణాలను నిర్ణయిస్తున్నది. ఈ విధంగా ఏ తరంలోని సాహిత్యమైనా, తన కాలపు ఆలోచనా స్వభావాదులను ప్రతిబింబిస్తుంది, ఒక యుగం, వెనకటి యుగపు సాహిత్య ప్రమాణాలను బానిసవలె, గుడ్డిగా అనుసరించదు. అది, వర్తమానకాలంనుంచి ఆవేశాన్ని పొందుతుంది. విషయస్వీకరణలో, భావవ్యక్తీకరణలో, రెండింటా, తనలక్ష్యం జీవిత విమర్శేకాని. నిర్జీవపదార్థ విమర్శకానేకాదని అది ఉద్ఘాటిస్తుంది. ధ్వనులు పదజాలం, జాతీయాలు, భౌతికంగా మారుతాయి; కాని ఆ పరిణామం, భాషా

---

* ఇది ఈ గ్రంథకర్త సంపాదకత్వాన వెలువడిన తెలుగు పత్రికనుంచి పునర్ముద్రితం.

ఇది మొదలు, ప్రజాసాహిత్యం iii వ్యాసము వరకు, అచ్చయిన వ్యాసాలను గిడుగు రామమూర్తి పంతులుగారు ఇంగ్లీషున వ్రాశారు. వీటిని, చీరాల కళాశాల తెలుగు అధ్యాపకులు శ్రీ బూదరాజు రాధాకృష్ణ గారు అనువదించారు. వారికి మా కృతజ్ఞత — ప్రచురణకర్తలు.

భాషలకుగాని, రచయితలకుగాని లీలగా మాత్రమే గోచరిస్తుంది. ఆ పరివర్తనపు యదార్థస్వరూపం, తరువాతకాలంలో మాత్రమే కనిపిస్తుంది. మానవ భాషాచరిత్ర, వారి ఆచారాదర్శాల చరిత్రలాగే, ఏక సుదీర్ఘపునరావృత్తగాథ. ఆ పునర్జన్మలు మంచికైనా, చెడుకైనా - ఎక్కువగా మంచికే అనిపిస్తుంది- ఎట్టి స్థితిలోను నిశ్చలంగా మాత్రం వుండవు. సనాతనవాదులైన ఈ రచయితలే ఈ సత్యానికి సాక్షిభూతులు కారా?

యుద్ధకాలంలో తాత్కాలికంగా ఈ వాదోపవాదాలను ఆపటం అవసర మనిపించింది. * కాని శాంతి ఏర్పడబోతున్న ఈ రోజులలో యుద్ధానంతర పునర్నిర్మాణప్రసంగాలమధ్య, పునరున్మిషితమైన ఆంధ్రభాషారచనలో యదార్థ చిత్రణలతో నిండివున్న కథలు, కావ్యాలు, వ్యాసాలు, నాటకాలు' ప్రజాజీవితాలను స్పష్టంగా ప్రతిఫలిస్తూ, అందరూ చదవగలిగి, అందరూ అర్థం చేసుకోగలిగిన భాషలో వుండాలన్న ఆకాంక్ష అన్న ఆశాకిరణం సమర్థనీయం కాదా?

ఇవే మాలోవున్న ఆశావిశ్వాసాలు. అట్టి రోజు దరిదాపులో వుండ వచ్చును; దూరంలో వుండవచ్చును. ఆరోజు వచ్చినప్పుడే రానివ్వండి, ఈమధ్య కాలంలో, మనపని అగ్రగామిమార్గాన్ని నిష్కంటకం చేయటం వంటిది. ఈ పత్రికపుటలలో మాలక్ష్యం - చర్చించి ప్రయోగించటం; ఆ మహాసమయంకోసం మనలను మనమే సంసిద్ధపరచటం; భవిష్యద్విజయం కోసం పునాదులు వేయటం - అన్నది మాత్రమే.

అయితే యిప్పుడు మనకు చర్చనీయాంశాలేవి? మనం చేసే ప్రయోగాలేమిటి? మొట్టమొదట గమ్యాన్ని నిర్ణయించుకోవటం అవసరం. జీవద్భాషను ప్రయోగించడమే మహోదాత్తమైన. పరమాత్మీయమైన 'సంస్కరణ'గా మనం భావించటంవల్ల, మేము మతసాంఘికసంస్కరణల ప్రమేయం పెట్టుకొన దలచడంలేదు. ఈ గడ్డలో పుట్టినవారికి ఇచ్చటి జీవద్భాషలోను, జీవద్భాష ద్వారాను నిజమైన చదువు చెప్పటాన్ని అడ్డనంతవరకు, లేక వ్యాప్తికి దోహదం చేయగలంతవరకు రాజకీయాలతో గూడా ప్రమేయం పెట్టుకోదలచ లేదు. సాహిత్యపునరుజ్జీవనం, భాషాశాస్త్రపరిశోధన - ఇవిమాత్రమే మాకేవలా

---

* మా వాదాన్ని ప్రభుత్వం నిరాకరించిందని కొందరు సరిగా తెలియని వ్యక్తులు వెలిబుచ్చుతున్న భయభావాలకు ఆధారంలేదు. 1919 జనవరి 7 వ తేదీన పర్లాకిమిడిలో మ. ఘ. ప. లార్డ్ పెంట్లండ్ మాకిచ్చిన వాగ్దానాన్ని పురస్కరించుకొని, మేమీవిషయాన్ని ప్రకటిస్తున్నాము. ప్రభుత్వం నిర్బంధాలు పెట్టలేదు.

దర్శాలు. పండితుల, సాహితీపరుల చర్చలను వికటీకరిస్తున్న దూషణలకు, వ్యక్తిత్వాలకు మా సంచికలో స్థానంలేదు. మా విమర్శమాకు చేతనైనంతలో న్యాయబద్ధంగా, నియమవంతంగా కళాసూత్రాలమీద, భాషాశాస్త్రసిద్ధాంతాలమీద ఆధారపడి వుంటుంది:

కార్యరంగం ఇంచుమించు అపరిమితమైనది. ప్రభుత్వంచే ఆరంభింపబడిన భాషాశాస్త్రపరిశోధనకార్యాన్ని మేము చేపట్టి నిర్వహిస్తాము (చూ. 4వ సంపుటి) కేవలం భాషాశాస్త్రవిషయంలోనే అనంతావకాశమున్నది. ఆంధ్రదేశీయమైన భాషను పరిశీలించటం ప్రాచీనవైయాకరణుల కాలంనుంచీ చేయబడలేదు. అద్యతనకాలంలో వ్యాకరణాధ్యయనంయొక్క ప్రయోజనం చాలా మారింది; జీవశాస్త్ర, మానవశాస్త్రాలవంటి శాస్త్రాలలోని అభిప్రాయాలవల్ల అది మారిపోయింది; భాషకు సంబంధించిన నియమాలు మార్పుకు అతీతంగా స్థిరీకరింపబడినవని అది యింకా సూత్రాలను విధించటంలేదుకాని ఎల్లప్పుడూ చిన్న చిన్న మార్పులకు లోనై వుంటుందని, ఒక తరంనుంచీ మరో తరానికి ధ్వనులు, జాతీయాలు సంస్కరింపబడుతూ వుంటాయని అంటున్నది. ఒకనాటి వ్యాకరణం మరోనాటి వ్యాకరణంకాదు; ఇంకా ఏ పక్కకాలంలోనైనా వకభాష జాతి, కులం, మాండలికం అనేవాటినిబట్టి విభిన్నవ్యాకరణధర్మాలను ప్రదర్శింపవచ్చును. భౌతికంగానూ ప్రాంతీయభేదాలవల్లనూ వ్యాకరణం మారుతుంటుంది. శబ్దజాలం కూడా అంతే. పయిగా వకభాషయొక్క సారవత్త్వం ముఖ్యంగా జాతీయవిషయం. అర్థాలు మారుతాయి; వ్యాకోచిస్తాయి, సంకోచిస్తాయి. పెరుగుతాయి, తరుగుతాయి, శబ్దజాలం అనేకాలంకారికపద్ధతులలో ప్రయోగించబడి నిర్జీవరూపకోటిలో చేరుతుంది. విదేశపదజాలం దిగుమతి చేసుకోబడి దేశభాషలోవకభాగంగా పరిగణింపబడుతుంది; ప్రత్యేకప్రయోజనాలకోసం ఇతరాధారాలనుంచి శాస్త్రీయపదజాలం సృష్టింపబడి ప్రస్తుత వ్యవహారంలోకి, సాహిత్యంలోకి చేరుతుంది; లేదా, ఆయాప్రత్యేకకళలలో, శాస్త్రాలలో పండితుల వుపయోగానికే పరిమితంగా మిగిలిపోతుంది. ఎప్పుడూ వ్యవహారభాషకంటె గ్రాంథికభాష అధికనియమవంతమైనదే - తిరుగా నాగరకభాష నియమబద్ధభాష, యాస అన్న భేదాలతో స్వతసిద్ధంగా వ్యావహారికం ఏర్పడవచ్చు. వాగ్వ్యవహారమెప్పుడూ లిఖితవ్యవహారానికి సన్నిహితంగా వుంటుంది; కాలగతిని, యాస కూడా సొగసుదనంపొంది అంగీకృత సాహిత్యభాషాశబ్దాలలో చేరిపోవచ్చు. సాహిత్యకభాషలోని విశిష్టవిభాగమైన కావ్యభాష తాళలయలు, యమకగమకాలు, స్వరమాధుర్య, గాంభీర్యం, ఉదాత్తత, రసమయత్వం, శ్రావ్యత, అట్టివైన మరికొన్ని ప్రత్యేక కారణాలవల్ల వచనభాషకంటె ఎక్కువ సంప్రదాయబద్ధంగా, సనాతనంగా, నియమబద్ధంగా వుండబో

తుంది - కాని. ఏకకాలంలోని కవిత తననాటి శిష్టవ్యవహారనాగరభావాల పోక
డలను ప్రతిఫలిస్తుంది. జానపదగేయాలలో ఉత్తమోత్తమకవితయొక్క బీజాలు
కనిపిస్తాయి. వైయక్తికమైన స్వభావనిబిడీకృతి మాత్రమే కవిసృష్టిలోని ప్రతి
ఫలనం; జానపదపదాలు సాహిత్యకరచనలుగా పరిణమిస్తాయి; జానపదగాథ
వీరగాథగా పురాణంగా పరిణతమౌతుంది.

కవితాకళలోని సామాన్యభాషకు వ్యావహారికానికీ గల తరతమ
సంబంధం ఆంధ్రసాహితీ విషయంలో దుర్భరనియమబాధలకు లోనైనట్లు కని
పిస్తుంది.

ప్రాచీనకావ్యాలలో కనిపించే విశిష్టసనాతనగద్యఫణితి సర్వకాలాలలో
సర్వవిధాల వచనరచనలకున్ను ఆదర్శప్రాయమని ఆధునికవచనరచయితలు
ఊహిస్తున్నారు. పద్యాలు వ్రాసేవారిలో చాలామంది కవితావస్తువు, కావ్యనిర్మా
ణం, ఛందస్సులకు సంబంధించి అర్వాచీనసంస్కృతాలంకారికులు నిరూపిం
చిన నియమాలను నవ్యాంధ్రకవులు శిరసావహించవలసినవని వాదిస్తున్నారు.
అయితే దేశీయ ప్రజాకవులనుంచి నేర్చుకోదగ్గది యికనేమీ లేదా యేమిటి?
బాలలగేయాలు వ్రాసినవారినుంచి బుర్రకథలువ్రాసినవారినుంచి నేర్చుకోతగ్గది
లేదా? ఈ నవ్యప్రపంచంలోని గాయకులకు "రొమాంటిక్ యుగం"లోని
ఆంగ్లకవులలాగా ప్రకృతివర్ణనలు చేయటం నిషిద్ధమా? ఆంధ్రకవిత్వాన్ని మొట్ట
మొదట సృష్టించినవారికి పరిమితమైన సంకుచితపరిధిలోనే నవ్యులు గిరిగీసు
కొని శాశ్వతంగా బంధింపబడి వుండవలసిందేనా? సమాజంలాగానే కళకూడా
స్వాతంత్ర్యం, శోధన అన్నవాటివల్ల మాత్రమే అభివృద్ధమౌతుంది. ఆంగ్ల
సారస్వతం, ఆధునికశాస్త్రజ్ఞానం - అన్న మార్గాలద్వారా అధునాతనయుగంలో
దేశవిదేశాలనుంచి కొత్తభావాలు జనబాహుళ్యానికి అందుతున్నవి. తాము
ఆసక్తితో, ఉల్లాసంతో చదువుతున్న భావాత్మక కథనాత్మక వర్ణనాత్మకాలయిన
ఉదాత్తకావ్యసముచ్చయాన్ని సమర్పించిన 16 వ శతాబ్దపు ఆంగ్లేయకవుల
వలెనే, గ్రీకులాటిన్ భాషల అధ్యయనం యొక్కయు. మధ్యకాలపు మతసం
స్థలయొక్కయు, ప్రతిబంధకాలనుంచి తొలగి దాస్యవిముక్తులయిన ఆ ఆంగ్ల
కవులవలెనే, ఇప్పటికీ పతనావస్థలోవున్న మధ్యకాలపు మనస్తత్వపు శృంఖ
లాలచే కట్టుబడిన వీరు తమకు తెలియని భాషాప్రక్రియలలో భావాలలో నూత్న
పరిశోధనలు చేయాలన్న భావావేశాన్ని పొందుతారా? సృజనాత్మకంగాగాని,
సాధారణశాస్త్రప్రయోజనాలకైగాని వ్రాయబడిన వచనం విదేశాల మార్గదర్శ
కత్వంనుంచి చాలా నేర్చుకోగలదు; నవ్యసాహిత్యము, నేటి శిష్టవ్యావహారి
కము ఒకే లక్ష్యంగలవి అని గ్రహించుటమే బహుశా మొదటి పాఠంగా వుం
టుంది వచనానికి కావలసిన లయ, కారక నిబంధనలు, ఉచితపదబంధం

నుంచి భావవ్యక్తీకరణకై ఆకాంక్షింపబడే నిసర్గగుణరసజ్ఞానాదులు- కళాకారుడి సమస్త పద్ధతులూ - మృతశబ్దజాలాన్ని మృతవ్యాకరణనియమాలను అవసరమని భావించవు; కళాకారుడికి, ఆతడి పాఠకుడికీ మధ్య అతడు పలికేటప్పుడు అధికతరసంబంధం వుంటుంది; వక్తృశ్రోత లుభయులూ పంచుకొనే భాషనే పాఠకులు వింటారు; అప్పుడే అతని సందేశం ఎక్కువ సుబోధంగావుంటుంది.

కేవలం ఈ వాస్తవికతలను చర్చించటమే మా లక్ష్యంకాదు: మాపత్రికలో ఇందుకు తగినట్లు పరిశోధించడానికి రచయితలను ఆకర్షించగలమని ఆశిస్తున్నాము. అనువాదమైనా మౌలికరచనమైనా ఆహ్వానిస్తాము. ఎలిజబెత్ యుగపు తొలిరోజులలోకూడా నవలలను, కల్పితగాథలను, నాటకాలను అనువదించే అలవాటు అధికంగా వుండేదని గుర్తుకు తెస్తున్నాము. మూలానికి తమ ఉపజ్ఞను జోడించి మహా మేధాశాలులుకూడా ఆంగ్లభాషలో రచించారు. ఆంధ్ర సాహిత్యం పునరుజ్జీవితమౌతున్న ఈ కాలంలో మనరచయితలకు సూచనలను సేకరించడానికి విస్తారమైన అవకాశమున్నది. నిజానికి ఇప్పటికే షెక్స్పియర్ వ్రాసిన 'కింగ్‌లియర్, ది టెంపెస్టు, సింబలీన్'లకు, మోలియర్ వ్రాసిన సుఖాంతనాటకాలైన "లిమెడిసిన్. మాల్గ్రెలుయ్ లావ్రే"లకు అనేకానుసరణలు, అనువాదాలు వున్నాయి. కాని, ఎలిజబెత్‌యుగపు ఆంగ్లకవులు అన్యభాషలలోని మూలగ్రంథాలను జీవదాంగ్లభాషలోకి పరివర్తించగా, ఎక్కడో ఒక్కడు తప్ప మన రచయితలు, అనువాదకులూ జీవద్భాషను వర్జిస్తున్నారు; పురాతనాలంకారికనియమాలనే అనుసరిస్తున్నారు; తమభావాలను వ్యక్తీకరించడానికి ప్రాచీనకృతకభాషనే మాధ్యమంగా ఎన్నుకొంటున్నారు; అనువాదకళ మీద విమర్శనలు లభిస్తూనేవున్నా దోషజుష్టమైన పండితంమన్యుల శబ్దార్థ నిర్ణయమార్గాన్నే అనుసరించటం మంచిదంటున్నారు. అందుచేత ఆంగ్లం, ఫ్రెంచి లేక యితర భాషలలోని చక్కని మాతృకలను, సజీవవచనంలోవున్న ఉపజ్ఞాపూర్వకపరిశోధనలను, నిగూఢైతిహ్యాల యొక్కయు ప్రాతగిల్లిన సంప్రదాయబద్ధమైన లాక్షణికనియమాలయొక్కయు గతానుగతిక ప్రతిబంధాలులేని ప్రతిభావంతమై స్వతంత్రమైన సమకాలిక జీవిత చిత్రణాలతో కూడిన గాథలను జాతీయపదగుంఫితమైన నిజమైన తెలుగులోకి అనువదించడాన్ని మనం ఆహ్వానించాలి.

ఇక, రచనాకళనుగురించి చర్చింపదలుస్తున్నాము; అనగా జీవద్భాష కళాత్మకసృష్టి కేవిధంగా వుపకరిస్తుందో చర్చింపగోరుతున్నాము. ప్రక్రియావైవిధ్యం, ఉద్ఘాటనం, జానుదనం, శక్తిసత్త్వం అన్నవి మన భాషాస్వభావానికి అనుకూలమైన ఏపద్ధతిలో ఆంగ్లరచయితలనుంచిగాని యితరులనుంచిగాని గ్రహించి అన్వయించగలం? మనలో వచనరచన యింకా శైశవావస్థ

లోనే వున్నది * ఈ వ్యవహారసాధనాన్ని యింకా మనం కల్పించుకోవలసియే వున్నది. అనువాదం తృప్తికరంగా వచనాన్ని మార్దవం చేయడానికి తోడ్పడ వచ్చు; కవిత్వాన్నికూడా అభివృద్ధి పరచవచ్చు. జానపదకథల కీర్తనల సేక రణను మేము ప్రోత్సహిస్తాము; వాటిలోని సహజ సౌందర్యాన్ని పృథక్కరించి ఆలోచనాపూర్వకంగా చర్చించడాన్ని ప్రోత్సహిస్తాము. ఊనికకు ప్రాముఖ్యం గల దేశీయచ్ఛందాలను మేము వెలుగులోకి తెస్తాము. ఏ కవియైనా అజ్ఞాత ప్రజాగాయకుల ముగ్ధకళలను దేశీయవిధానాలలో అభివృద్ధిపరిచే రీతులను పరి శోధిస్తే, వారి పరిశ్రమకు స్వాగతమిస్తాము.

భాషాశాస్త్ర విభాగంలో - మాండలికనిఘంటునిర్మాణానికై మాండలికా లను పరిశీలించటం కావలసిన సంభారాన్ని సమకూర్చటం అవసరమని సూచి స్తున్నాము. యితర దేశాలలో ఇందుకోసం యిప్పటికే మహత్తరమైన పని జరిగింది. ఆంగ్లసాహిత్యంలో కవులు, కథకులు తమతమ మాండలికాలను ప్రయోజనాత్మకంగా వుపయోగించారు. ఉదాహరణకు లాంకషైర్ మాండలి కంలో వా, డార్సెట్ మాండలికంలో బార్నెస్, ఇంకా ప్రముఖంగా స్కాచ్ మాండలికంలో బర్న్స్ రచించారు. మనశిష్టులు, సామాన్యప్రజలపట్ల, వారి భాషపట్ల అసహ్యతను ప్రదర్శిస్తున్నారు. కాని ఈ సామాన్యులకు సైతం, అవ సరాలున్నపనీ, వారు వాటిని సాధించుకుంటారనీ, ఏ బజారులోనైనా దొరికే గజిబిజిగా ముద్రితమైన జానపద గ్రంథాలు నిరూపిస్తున్నాయి.

మేం మొదట చెప్పినట్లుగా, మా వుత్సాహం కొందరికి గర్వంగా కనిపించవచ్చునుగాని, నిస్సందేహంగా మేము చేయగలిగినదానికంటే, ఎక్కు వగానే కృషిచేయాలని ఆశిస్తున్నాము. కనీసం, ఖండాంతరాలలో పొంగులు బారుతున్న భావాలను వ్యక్తీకరించగల జీవద్భాషగా, బలవచ్ఛక్తిగా నేటికాలపు తెలుగును తయారుచేయాలని అనేకమంది కావిస్తున్న కృషిని, పక్కచోటికి మేము చేర్చగలం. దక్షిణదేశపు యితర ప్రజలకంటె తెలుగువాళ్ళం, అభ్యు దయ భావాలను అధికంగా గ్రహించగలమని, మనల్ని మనమే పొగుడు కుంటూ వుంటాం. ఏవిధంగానూ, సంఘసంస్కరణ విద్యాసంస్కరణ విష యాలలో మనం వెనకబడిలేం; అన్ని బహిరంగ గోష్ఠులలోనూ ఆంధ్రవిద్వాం సులు అగ్రగాములుగానే వున్నారు. ఏది మనం మంచిదని నమ్ముతామో, దాన్ని ఆచరించగల ధైర్యం, మనకు వుంది. మనం సంఘసంస్కరణను గురించి కేవలం మాట్లాడుతూ కాలంగడపం; దానిని ఆచరించి చూపుతాం; ప్రజాసముద్ధ రణపట్ల మనకు విశ్వాసం ఉంది. నిరుపేదలు నిస్సహాయులూ అయిన ప్రజలకు,

---

* చూ. శ్రీజయంతి రామయ్యపంతులుగారి "గ్రాంథికభాషారక్షణము" 2 వ పుట.

విమర్శనాత్మక వ్యాసాలలో, శాస్త్రీయగ్రంథాలలో, మిగిలిన సమస్తప్రక్రియలలో ప్రయోగాత్మక రచనలు చేయాలని సంకల్పిస్తున్నాము.

మా కార్యక్రమం పెద్దదేగాని, పరిశోధనారంగానికి అవసరమైనంత విస్తారమైనది కాదు. మద్రాసు విశ్వకళాపరిషత్తుకు సంబంధించినంతవరకు ప్రాచ్యభాషాధ్యయన రంగంలో, విశేషించి ద్రవిడ భాషా పరిశీలనలో, వాస్తవిక విమర్శనాత్మకబుద్ధి కొరతగావుంది. కనీసం తెలుగులోనైనా, ఉపలబ్ధసామగ్రిని మేము పరిశీలించినవిధానాలద్వారా. ఈ విమర్శనాత్మకదృష్టి ఏవిధంగా వుండాలో నిరూపించగలమని ఆశిస్తున్నాము.

# లిఖిత వ్యవహృతాంధ్రాలను ఎలా సన్నిహితం చేయాలి?

* "వ్యావహారికభాషాపోషకసంఘం" యొక్క ప్రథమ లక్ష్యం గ్రాంథిక వ్యావహారికభాషలకు సాన్నిహిత్యం సాధించటమే. లిఖితభాషకు ప్రప్రథమ మూలాధారం వ్యవహార భాషయే; కాని, కొన్ని విస్పష్టకారణాలవల్ల అవి క్రమంగా వకదానికొకటి దూర దూరమై పోతున్నాయి. అందువల్లనే ఆర్డెన్ చెప్పినట్లు "భాషను సంభాషణకు మాత్రమే వినియోగించే వేలాది దేశీయులు వ్యాకరణబద్ధంగా వ్రాసిన గ్రంథాన్ని చదవలేరు, చదివి వినిపిస్తే అర్థం చేసుకోలేరు." ఇంకా, కాంబెల్ అన్నట్లు "చాలా వుత్తమగ్రంథాలను అర్థంచేసుకొనడంలో పండితులకు గూడా వ్యాఖ్యానాల వుపయోగం తప్పని సరి." కాని, యింగ్లీషు జాతివంటి కొన్ని జాతులలో ఈ రెండు భాషల సంబంధాలు ఎప్పుడూ సరిచేయబడుతున్నవి; అవి నిరంతరం వకదానికొకటి సన్నిహితం చేయబడుతున్నవి.

లిఖితాంగ్లం వ్యవహృతాంగ్లానికి సన్నిహితంగా వున్నదన్నప్పుడు ఆ రెండూ కచ్చితంగా వకదానినొకటి పోలివున్నవని ఖండితంగా మేము చెప్పటం లేదు. కాలదేశభావభంగిమలతోబాటు కవులలో వక్తలలో వైయక్తికంగావున్న విద్యాప్రమాణాలతో గూడా మారుతూవుండే ఉచ్చారణ, శైలి, జాతీయాలు, పదజాలం, చివరకు వ్యాకరణరూపాలు అనే వాటిలో ఆ రెంటికీ విభేదం వున్నది. అందులోనూ మరీ వున్నతశ్రేణికి చెందిన గ్రాంథికాంగ్లం వ్యావహారికాంగ్లం కంటె ఎక్కువ జాగరూకమైన ఉచ్చారణక్రమాన్ని అపేక్షిస్తుంది; ఎక్కువ ప్రాచీనరూపాలను భరిస్తుంది; అధికాడంబరయుక్తపదజాలాన్ని సహిస్తుంది. కవితాభాష కొంతవరకు ఆలాంటి స్వభావం కలది. అయినప్పటికీ ఉత్తమవచనం తన కాలానికి చెందిన సంభాషణశైలికి పూర్తిగా దూరంగా ఎన్నడూ వుండలేదు.

"ఈ విషయంయొక్క మూలబీజం యిక్కడే వున్నది. గ్రాంథికభాష తననాటి వ్యవహారభాషకు అతిసన్నిహితంగా వున్నప్పుడే సజీవంగా, సర

---

* చూ: తెలుగు పత్రిక చివరి సంచికలోని 32 వ పుట.

ళంగా వుండగలుగుతుంది. కేవల సాహిత్యక సంప్రదాయం ఎంత అద్భుతమైన దైనా తరువాతికాలపు శైలికి సరిపోదు. జీవలక్షణంలేని కేవల సాహిత్యక సంప్రదాయం నిర్జీవపదార్థంవంటిది. సాహిత్యం జీవితవిమర్శనమైనపుడెంత సజీవంగా వుంటుందో, సాహిత్యకరూపం వ్యావహారికానికి సన్నిహితంగా వున్నప్పుడంతగా సజీవత్వాన్ని పొందుతుంది. ఈవిధంగా వుత్తమవచన రచన సంప్రదాయానికన్నా తననాటి ప్రజావాణికే యెక్కువ ఋణపడి వుంటుంది.

తక్కువ రచనా చమత్కారం గలిగి తక్కువ శ్రమతో వ్రాయబడిన ఏనాటి సుందర రచనమైనా - పద్యంకూడా యత్కించిత్తుగా అలాటిదే- రచయిత తాను అవే అభిప్రాయాలను నోటి మాటలతో వ్యక్తీకరిస్తున్నట్లయితే ఏవిధంగా 'మాట్లాడు'తాడో, ఆ విధంగానే వ్రాస్తాడన్నభావాన్ని పరికల్పిస్తుంది. తననాటి వుత్తమోత్తమ వ్యావహారికరూపాలమీద గల అధికారికపరిజ్ఞానం నుంచి వుత్పన్నమయ్యే ఈ జీవశక్తియే, డ్రైడెన్ వచనంలో మనకు అభిరుచి పుట్టిస్తున్నది. భావానుభవాలకు జీవద్వాహికకాని రూపాలు (మాథ్యూ ఆర్నాల్డు చెప్పినట్లు) మనం 'సంతోషంతో వాడదగినవి' కావు. అన్నికాలాలలోనూ మహాకవుల పరమరహస్యంగా వున్న 'మేలు కలయికల' వచనం- ఒకవైపు సాహిత్య సంప్రదాయపు మూలసూత్రాలను, మరోవైపు సమకాలిక వ్యావహారిక భాషా మూలలక్షణాలను సరియైన పాళ్ళలో సుకుమారంగా మేళవించిన వచనం వాడదగ్గది. ఏ రచయితమైనా తనదికాని భాషలో తగినంతగా తన్ను తాను వ్యక్తీకరించుకోలేడు; అన్యకాలానికి చెందిన శిథిలశైలిలో భావావేశాలు చక్కగా వ్యక్తం కాజాలవు. సాహిత్యకభాష దైనందినవ్యవహారభాషల సంబంధాలు చెడినప్పుడు యీ స్థితి వస్తుంది."

సాహిత్యకాంగ్లభాషా స్వభావంపై ప్రొఫెసర్ వైల్డు చేసిన విమర్శనలను దృష్టిలో పెట్టుకొని మా పఠితలు, మా ప్రతికక్షులు కొందరు చేసిన వ్యతిరేక ప్రతిపాదనలను గ్రహింతురుగాక! గ్రాంథికవ్యావహారికాలకు సాన్నిహిత్యం అవసరమైనప్పుడు, మాట్లాడినట్లే వ్రాయండని ప్రజలనుత్సాహపరచటానికి బదులు, గ్రాంథికభాషలోనే మాట్లాడండని ప్రోత్సహించినందువల్ల కూడా ఫలితముంటుందని మా ప్రతికక్షులు వాదింపవచ్చు; పయిగా, అందువల్ల ప్రాచీనగ్రాంథికభాష సుప్రతిష్ఠితం కావడం, వ్యావహారికభాష పరిష్కృతమై ఉదాత్తం కావడం - రెండూ జరుగుతాయనవచ్చు. మంచిఇంగ్లీషు మాట్లాడే ఆంగ్ల స్త్రీ పురుషులు ఆ భాషావ్యాకరణసాహిత్యాలను జాగ్రత్తగా చదివినందున అలా చేయగలుగుతున్నారని, గృహవ్యవహారంలో వున్న వ్యావహారికాంగ్లభాష వ్యావహారికాంధ్రం అంత గ్రామ్యంగా, వ్యాకరణవిరుద్ధంగా వున్నదనీ వారు అభిప్రాయపడుతున్నారు. పూర్ణమైన అజ్ఞానంవల్ల ఏర్పడ్డ భావమిది. మేము భవిష్యత్తులో ఏదో వక సంచికలో "వ్యావహారికం, గ్రామ్యం

యాన, మాండలికం, ప్రాచీనశబ్దం" మొదలైన సాంకేతికపదాలకు ఇంగ్లీషులో గల అర్థాలను వివరించ ప్రయత్నిస్తాము. శాస్త్రీయంగా "మాండలికం" అన్న పదాన్ని, దానికున్న విశిష్టార్థంలో మాట్లాడని ఆంగ్లభాషాభాషులు తమ వ్యవహారంలో గ్రాంథికభాషనే మాట్లాడుతున్నారన్న వూహ ప్రాథమిక దోషజుష్టమని చెప్తూ ఈ వ్యాసాన్ని ముగిస్తాము. "నాగరకాంగ్లం, ప్రామాణిక వ్యవహృతాంగ్లం, స్వచ్ఛాంగ్లం, వ్యావహారికాంగ్లం" లేక "కేవలం ఆంగ్లం" అన్న పేర్లలో మీ యిష్టంవచ్చినట్లు పిలవండి - అది ఒక జీవద్భాష; అన్య భాషలలోని ప్రతివక్కదానిలాగా అది వ్యాకరణబద్ధమైనది; బ్రతికివున్న ఆంగ్ల స్త్రీ పురుషుల కందరికీ అది మాతృభాష; వారెక్కడ నివసించినా ఉన్నత తరగతుల బాల బాలికల కది మాతృభాషే; అది పుస్తకాలనుంచికాక జీవన్మానవుల నుంచి, వారి సంపర్కంవల్ల నేర్చుకోబడుతున్నది. ప్రాయికంగా అది ఏవక్క నిర్ణీతకాలంలోనైనా ఏకరూపతతో వున్నది. కాని, ఎప్పుడూ స్థిరంగా లేదు. ఎప్పుడూ మారుతూనేవుంది; ఇప్పుడు దాని ఎదుటనే అంతర్ధానమవుతున్న ఆంగ్ల మాండలికాలకన్నా దానికెక్కువ ప్రతిష్ఠవుంది.

తెలుగువారిలోని శిష్టుల మాతృభాష కూడా అట్టిదే. శిష్టవ్యావహారిక మిప్పుడు వారితో సన్నిహితంగా వుంటున్న ఇతరతరగతులవారి మాండలికాలను అజ్ఞాతంగా తనలో ఐక్యపరచుకొంటున్నది. ఈలాటి భాషకు బదులుగా బ్రతికివున్నవాడు యెప్పుడూ మాట్లాడని ఒక మండలికాన్ని మా ప్రతికక్షులు కోరినట్లు వుపయోగించటం ప్రజలకు సాధ్యమా?

# జీవద్భాషను వాడటానికి స్వాతంత్ర్యం

"వ్యవహృతపదాలు వ్యవహారంలోని నాణేల వలెనే సాపయిక మూల్యం గలవి."

పన్నెండో శతాబ్దంలో నన్నయ సంస్కృత మహాభారతాన్ని తెలుగు లోకి అనువదించినప్పుడు దేశభాష పరాంకోటిపరిమితినందుకొన్నదనీ, ఆ తరువాత సుపరిష్కృతమైన భాషాయంత్రభాగాలన్నీ శ్రమతో నిర్మింపబడి సంపూర్ణతను బొందినవని, తరువాతికాలపు రచయితలు తమ సాహిత్యరచన లను ఆ యంత్రాన్ని పనిచేయించి తయారుచేసుకొనేవారనీ, సాంప్రదాయి కాంధ్రాన్ని మెచ్చుకొనేవారు స్పష్టంగా నమ్ముతున్నారు. ఆ వాదాన్ని విశ్వ సించే వ్యక్తులెంత గొప్పవారయినా, అట్టి నమ్మకాలు భాషాస్వభావ వికాసాలకు సంబంధించినంతవరకు ప్రామాదికభావనలపై ఆధారపడ్డవని మేమెరుగు దుము. భాషాస్వభావవిజ్ఞానాన్ని సంస్కృతభాషాపరిచయంవల్ల ఏర్పరచుకొన్న పండితుడు ప్రాచీనాంధ్రభాషాభ్యసనానికి తనజీవితం అంకితంచేసి, తనరచన లలో ఆ ప్రాచీనతరరూపాలను పునరుద్ధరించడానికి ప్రయత్నిస్తాడు. అందు వల్ల అతగాడు అన్ని కాలాలలోను సాహిత్యకభాష సంస్కృతభాషఅంత ఏకరూపంగా వుండితీరాలన్న విశ్వాసాలను కల్పిస్తున్నారు. ఆ పండితుడి సిద్ధాంతాలనే నేటి విశ్వవిద్యాలయపట్టభద్రులలో కొందరు అనుసరించటం భాషాశాస్త్రాధ్యయనం వుండవలసిన తీరులో లేదనిసూచిస్తుంది.

ఆంధ్రప్రజలందరి తరపునా రమారమి ఆరేళ్ళక్రితం మద్రాసు ప్రభు త్వానికి వక బ్రహ్మాండమైన అర్జీ పెట్టుతూ "ఆధునికాంధ్రభాష కాక" "గ్రాం థికభాష"యే అన్ని విద్యాసంస్థలలోనూ సరియైన బోధనాభాషగా వుండితీరా లన్న ఆ ఉద్యమనాయకులు ఇలా ప్రకటించారు :—

"12 వ శతాబ్దిలోకి నన్నయ తెలుగున్నూ, నేటి రావుబహద్దర్ వీరేశ లింగంగారి తెలుగున్నూ వేరు కావు. ఒకదానిలోని భాషయే రెండోదానిలోని భాషకూడా. ఒకేవిధమైన వ్యాకరణాలంకారికచ్ఛందోలక్షణాలు ఈ రెంటికీ అన్వయిస్తాయి. అందువల్ల, కొందరు "నవ్యసిద్ధాంత ప్రచారకులు" చెప్పినట్లుగా గ్రాంథికభాష ప్రాచీనభాష అనిగాని, పాతబడ్డ భాష అనిగాని, చెప్పటం తప్పు."

ఆధునికాంధ్రభాషావిషయంలో శ్రీ జయంతి రామయ్యపంతులుగారు వ్రాసిన ఈ అర్జీని ప్రజలు ఆమోదించడానికై ఏర్పాటుచేయబడిన బహిరంగ

ంచిన శ్రీ వీరేశ గంగారు ఆధునికాంధ్రభాష గ్రామ్య
టా ఘోషంగా తృణీకరించారు. "ఆధునికాంధ్రభాషను గురించిన వినతి" అన్న మా కరపత్రంలో మే మాయన అభిప్రాయాలను విమర్శించి, తరువాత ఆయనతో ఆవిషయం చర్చించాము. గ్రాంథికవాదులకు ఆరాధ్యుడై ఆదర్శప్రాయుడైన శ్రీ వీరేశలింగంపంతులుగారు తమ అభిప్రాయాలను మార్చుకొని, తమ "స్వీయచరిత్ర"లో తెలుగు మారిందని, ఆధునికవచన భాషావసరాలను తీర్చడానికి నూతనవ్యాకరణాన్ని అవశ్యకంగా వ్రాయవలసి వున్నదనీ, బహిరంగంగా ప్రకటించి, ఆధునికాంధ్రంలో ఏదో ఒకరచనను, ఆధునికభాష కొరక వ్యాకరణాన్నీ వ్రాయాలన్న తమ సంకల్పాన్ని గ్రంథస్థంచేయట మొక మహత్తరవిషయం, కాని ఆయన మరిలేడు. ఇప్పుడా గ్రాంథికవాదుల తప్పును గ్రహించిన తెలుగు విద్వాంసులు వేలసంఖ్యలో వున్నారు.

గ్రాంథికవాదానికి మూలవిరాట్టుల గ్రంథాలలోవున్న వ్యావహారిక రూపాలను శ్రద్ధతో తొలగిస్తే, ప్రాచీనభాష నిర్దుష్టంగా జీవిస్తుందని ఇదిగా ఆశించారు. విద్యాధికారులు వారి భావాల నామోదించి నేటి తెలుగును వెలివేశారు. అయిదేళ్ళ క్రిందట మద్రాసు విశ్వకళాపరిషత్తువారు "విశ్వవిద్యాలయావసరాలకు ఆధునికాంధ్రభాష అని తెలియవచ్చే భాషను యిప్పట్లో గుర్తించగల స్థితిలో" లేమని ప్రకటించారు, కాలచక్రపరిభ్రమణం మరి దేన్ని తెచ్చిపెడుతుందో ఎవరికెరుక?

కేంద్రీకృతాధికారవ్యవస్థలోని అనర్థాలను వ్యతిరేకించేవాక్స్వాతంత్ర్య ప్రియులైన విద్వాంసులుకూడా తాము మాట్లాడే భాషను మనస్ఫూర్తిగా వర్జించి పండితంమన్యుల దురధికారాలకు తల వొగ్గటానికి మేము ఆశ్చర్యపడుతున్నాము. కొందరు యద్విధంగానైనా సరే తమ మాతృభాషనే వుపయోగించాలన్న జన్మహక్కుకు మహత్తర మూల్యం సమర్పిస్తారు, మేము వాళ్ళలో వున్నాం. పండిత పరిషత్తులు, కేంద్రీకృతదుష్టప్రభుత్వకూటాలు, విశ్వవిద్యాలయాలు, పరిషత్తులు - అన్నవాటితోసహా యావత్ప్రపంచాన్నీ ధిక్కరించడానికి సందేహించము మేము - మా హక్కును మేము వినియోగిస్తాము, జాతీయ ప్రయోజనంకోసం మేము దాన్ని న్యాయబద్ధంగా సాధిస్తాము.

ఆధునిక వంగభాషను గురించిన ప్రఖ్యాత భారతీయకవి సర్ రవీంద్రనాథ ఠాకూర్ అభిప్రాయం తెలుగుకున్నూ సమానంగా అనువర్తిస్తుంది. ఆయన గడచిన సంవత్సరం "యం.ఏ. పరీక్షకై ప్రాంతీయభాషలు"అన్న విషయంపై 'మోడరన్ రివ్యూ'లో ప్రచురించిన లేఖలోని భాగాలను వుద్ధరిస్తున్నాము. అందుకు మేము వారికి క్షమాపణ చెప్పుకోబోవటం లేదు. ఆ సంపాదకులందు కభ్యంతరం చెప్పరని ఆశిస్తున్నాము.

మన సాహిత్యకభాష ఇంకా ఆస్థిరదశలోనే వుం
నూతన భావావేశాలనొందికను స్వీకరించ ప్రయత్నిస్తున్నది.
జాతీయజీవనంలో నిరంతర పురోగతికై ప్రయత్నిస్తున్నది. మన సమస్యల్లో
ద్యప మహాయుగ నిర్మాణానికి సహాయకారిభావాలనుద్ధరిస్తున్న
కన్నా అవశ్యం అధికవేగంతోనే మన జీవనంలో భావనలో ప్రాదుర్భవిస్తు
న్నాయి. అందువల్లనే, మన ఆదర్శాలను దిద్ది తీర్చటంలో పరిరక్షించడంలో
ప్రధానసాధనమైన మన భాషను భవిష్యత్తులో ఇతోధికవిస్తారంగా నిర్ణీతప్ర
మాణాలకు సునిశ్చితాభ్యుదయానికి ఆధారంగా వుంచుకోవలసివున్నది.

"కాని కలకత్తా విశ్వవిద్యాలయం మన భాషమీద ప్రసరిస్తున్న ప్రత్యక్ష
ప్రభావం దాన్ని బలపరచి సజీవం చేయకపోగా, కృత్రిమం చేసి క్లుప్తీకరించే
దిగా వున్నదని నేను కనుగొన్నాను. మృతభాషనుంచి అరువుతెచ్చుకొన్న
వ్యాకరణదుకూలాలలో చుట్టిపెట్టి పండితులు కృతకంగా నిర్మించిన వంగ
భాషను భద్రపరచటమన్న అకాలిక దోషాన్ని సార్వకాలికం చేయ ప్రయత్ని
స్తున్నది కలకత్తా విశ్వవిద్యాలయం. సజీవమై ససాహిత్యకమైన తమ మాతృ
భాషలో ఆధికారికపరిజ్ఞానం సంపాదించదలచిన మన పిల్లల దారిలో అది
రోజు రోజుకు చెప్పుకోదగ్గ ప్రతిబంధకంగా తయారవుతున్నది. జీవితకాలంలో
విద్యాగ్రహణశక్తి మహోద్ధృతంగా వున్న రోజులలో - అచేతనమై సిద్ధాంత
బద్ధమై గరీయసమై, బోధనైకలక్షణ లక్షితమై, సృజనాశక్తిలోని చరమప్రాణం
కూడా కోల్పోయిన సాధారణపండితుల కృతకభాష మనపిల్లల నెత్తిన రుద్దబడు
తున్నది. నా స్వంత విద్యార్థులే ఎక జడసిద్ధాంతం (నియమం) కోసం తమ
భావవ్యక్తీకృతిలోని సహజస్ఫూర్తిని బలియిస్తుండగా, ఒకవిధంగా మేధా
సంబంధ భ్రూణహత్య జరుగుతూవుండగా నేను చూస్తూవుండవలసివస్తు
న్నది. ఇది చూచి మన విశ్వవిద్యాలయాన్ని దాని ప్రత్యక్షాధికారపు తుది ఘడి
యలలో నియంతృత్వపుచరమకార్యంగా భారీ యెత్తున మన జీవద్భాషకు
మరణముద్రనువేయనివ్వాలా అని భయపడుతున్నాను.

"నేటి యూరపుఖండపు విశ్వవిద్యాలయాలలో బోధనాభాష విద్యార్థుల
మాతృభాషే అయినందున, వారు పాఠాలను గ్రహించటంలో, లిఖించటంలో,
భావాలను వ్యక్తీకరించటంలో అనుక్షణం తమ మాతృభాషతో సన్నిహిత
సంబంధాన్ని పొందుతున్నారు; వారి ఈ భాషాపరిచయం విద్యాధికారుల
ప్రత్యేకవర్గపు ఆజ్ఞలకు బానిసకావడంలేదు. నిరంతరం విభిన్నరచయితల
మూర్తిమత్త్వాలు, వారి శైలులలోని వైయక్తికప్రత్యేకతలు, వారి భాషలోని
జీవకళలోని తారతమ్యవిచక్షణ, విద్యార్థుల మనస్సులకు బాగా హత్తింపబడు
తున్నాయి, అందువల్ల వారికి పై పరీక్షలకుగాను కావలసినదంతా తమ తమ

# భాషను స్థిరీకరించగల వారెవ్వరు ?

"మనుష్యుడి మెదడు ప్రతులు తీసే యంత్రమూ కాదు. అతడి నాలిక పునరావృత్తి చేసే యంత్రమూ కాదు."

మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో తెలుగుపండితులైన మ. రా. శ్రీ వి. సుబ్బారావుగారు "ఆధునికాంధ్ర వచన రచనా విమర్శన"లో తెలుగు భాష తొమ్మిది వందల సంవత్సరాల క్రిందటనే 'పరిష్కరింప' బడ్డదని "స్థిరీకరింప" బడ్డదనీ, యింగ్లీషు యింకా మార్పులు చెందుతున్నదనీ, ఇప్పటికిన్నీ శుద్ధం కాని, స్థిరీకరింపబడని యితర భాషలు మారినపని తెలుగులో కూడా మారు పాటులున్నవనటం అర్థరహిత మన్నారు * తెలుగు ఇంగ్లీషుకన్నా వుత్తమ భాష అని, ఇంగ్లీషువారికి తమ భాషను పరిష్కరించుకోవలసిన అక్కర లేక పోయినా, తెలుగువారు తమ ప్రాచీనభాషను ఎట్టి స్థితిలోనూ 'చెడి'పోనీరాదనీ ఆ పండితుని వుద్దేశ్యం. నవ్యాంధ్రపరిషన్నాయకులీ సిద్ధాంత ప్రకటనను అనుమోదించారు. వారు ప్రభుత్వానికి సంతకాలతో వక వినతిపత్రం సమర్పిస్తూ "గ్రాంధికాంధ్రంలో విప్లవాత్మకమయిన మార్పులు తేవాలనే ప్రచారాన్ని నిరాదరించే" మన్నారు.

ఇంగ్లండులోనే కాక జర్మనీ, ఫ్రాంసు దేశాలలోనూ మనపండితులవలెనే తమతమ భాషలను స్థిరీకరించి వాటిని సర్వనాశనంనుంచి కాపాడాలని ఆతుర పడుతున్న విద్యావంతులెందరో వుండేవారని ఈ సనాతనపండితుడూ, ఆయన శిష్యులూ, తెలుసుకొంటే వారికి జ్ఞానాభివృద్ధి కలుగవచ్చు. ప్రొఫెసర్ లౌన్స్‌బరీ అంటాడు. * "గతకాలపు వ్యక్తులముందొక ప్రత్యేక లక్ష్యం వుండేది; అది వారి మాటలలో భాషనుస్థిరీకరించటం. అది వక్కసారి సాధింప

---

* "ఇంగ్లీషులో భాషాసంస్కార మింకనూ జరుగుతున్నదని స్కీటు లోనగువారు వ్రసివున్నారు. ఇంగ్లీషువారికి చక్కని భాష ఒకటి యేర్పడి 411 సంవత్సరము లయినవి. మనకు భారతము పుట్టి 900 సంవత్సరములయినవి. అప్పటికీ మనభాష సంస్కారములు పొంది శుద్ధమైనది, సంస్కార శుద్ధములు గాని భాషలు మారుపాటు చెందుతున్నవని శుద్ధమైన మన భాషను మార్చుకో వలసినదేనా ?

* "ప్రయోగ ప్రమాణం" అన్న అతని గ్రంధంనుంచి ఈ భాగమూ, మరికొన్ని కూడా గ్రహింపబడ్డవి.

బడితే భాష మరి ఏ మార్పులనూ పొందదు. ఒకవేళ పొందినా అట్టిది అత్యంత సంకుచిత పరిమాణంలోను, అధిసీన్ని క్రమనిర్దిష్టమార్గాలలోనూ మాత్రమే మాధుత్తుంది. అఫశబ్ద ధోరణులు - అవి నిజమైనవైనా, ఊహింప బడినవైనా - ఆ విధంగా శాశ్వతంగా నిరోధింపబడతాయి. సాహిత్యం వున్న ప్రతి దేశంలోను, ప్రతి కాలంలోను ఈ విధమైన నమ్మకం బహుళ వ్యాప్తిలో వుంటూవున్నది. విద్యావంతు లీవాదానికి చనవు యివ్వటం ప్రత్యేకంగా ఆశ్చర్య కరమైంది. భావవ్యక్తీకరణ సాధనంగా భాషను వారెంత ఎక్కువగా వినియోగించినా, సాధారణంగా భాషాచరిత్రను, దాని స్వభావాన్ని మారుస్తూవుండే విభిన్నపు భావాలను గురించి వారికున్న జ్ఞానం అల్పాల్పమైనది. బెంట్లేవంటి మేధాశాలియైన పండితుడీ వాదాన్ని ఉద్ఘోషించినప్పుడు ఈభావం ఎంతబాగా వారి మనస్సులలో నాటుకపోయిందో తెలుస్తుంది. ఆయన "ఇకమీద మరో విదేశం మనపై దండెత్తి ఆక్రమించకుండావుంటే ప్రజలకు తమ భాషమీద ఏపాటి గౌరవమైనా వుంటే ఇంగ్లీషు భాషను మార్పుల కతీతం చేయటం కష్ట సాధ్యమైన వుపాయం కాజాలద"ని వ్రాశాడు.

తరువాత కాలంలోకూడా, 1747 లో ప్రచురింపబడిన తన నిఘంటు రచనా ప్రణాళికలో డాక్టర్ జాన్సన్ తన మహాప్రయత్నానికి "ఇంగ్లీషుభాషను స్థిరీకరించడం" ఒక ప్రధాన లక్ష్యమని ప్రకటించాడు. కాని, భాషా స్వభావాన్ని గురించి కొంచెంగానైనా తెలుసుకోకుండా ఏక వ్యక్తి ఆ భాషలోని శబ జాలాన్ని స్వీకరించలేడు. తన పని పూర్తికాగానే ఆయన ఈ ప్రత్యేక దోషం నుంచి బయటపడ్డాడు. 'మానవ వ్యవహారాలన్నీ మారుతూవుండగా, మనుష్యులందరి ఆలోచనలను భావాలను పునరుక్తిచేసే భాష మార్పు చెందకుండా వుంటుందని వూహించడం అర్థరహిత"మని ఆయనే అన్నాడు.* ఆంధ్ర నిఘంటుకారు లింతకన్నా సరిదిద్దరానివారు కారనుకొంటాము.

"చాలామంది సనాతనవ్యక్తులకు ఒక భాషను స్థిరీకరించాలంటే భౌతికంగాకాకపోతే మానసికంగానైనా ఆ భాషాభాషులందరూ చావటం ప్రథమావశ్యకత అన్న ప్రాథమిక సూత్రాన్ని గ్రహించట మసాధ్యమనిపిస్తుంది. (ఛాందసాంధ్ర పండితులకులాగానే - సంపాదకుడు.) ఇప్పటివారిలో కొందరికి కూడా ఈ అసాధ్యత వర్తిస్తున్నది. అప్పుడు మార్చేవాడొక్కడూ వుండడు కాబట్టి భాష మార్పులు చెందనే చెందదు."

భాషను శాస్త్రీయంగా అధ్యయనంచేశారని చెప్పదగిన బెంట్లే, జాన్సన్ లవంటి విద్వాంసులే యీలాటి అభిప్రాయాలను వ్యక్తీకరిస్తుంటే, భాష కేవలం

---

* చూ. లెస్లీ స్టీఫెన్. పుట 38.

భావవ్యంజనసాధనమని మాత్రమే తెలిసినఅక్షరజ్ఞానవంతులనుండి యర్థకన్నా జ్ఞానవంతమైనదే మాశింపగలము? భాషను స్థిరీకరింప నిశ్చగించడం బహుళ వ్యాప్తిలోవున్నది. విశ్వాసంతో ఉద్ఘోషింపబడ్డదికూడా. ఆంగ్లభాషారచయితల లోని కొందరుత్తమ జ్ఞానవంతులు నమ్మి వుద్ఘాటించడమేకాక యూరపుఖండం లోని విభిన్న సాహిత్యభాషలలో రచించినవారుకూడా వీరివంటివారే వారు - ఇలాగే అన్నారు. "వ్యక్తులు అలవాటుగా తాము వాడుతున్న పదాలయొక్క చారిత్రక పరిణామాలనుగురించి, వ్యాకరణ పరిణామాలనుగురించీ ఏమీ ఎరుగరు. అందుచేతనే గత శతాబ్దులలో భాషావిషయకమై ఉత్పన్నమైన ఆందోళనలకు సమర్థనీయంకాకపోయినా వ్యాఖ్యాన మొకటివున్నది."

"ఇతోధికంగావున్నభాషల క్షీణదశకు అచంచల నిదర్శనలుగా వారు సమకూర్చుతున్న దురుదాహరణలను, వారి హెచ్చరికలనూ, వాటినిగురించి ప్రజలు ప్రదర్శించిన నిర్లక్ష్యభావాన్నీ చూచినవారికి గతకాలపుటనుభవాలు అర్థవంతమగు సూచనలిస్తాయి. పూర్వ పూర్వ కాలాలలో తమలాగా తెలివి తక్కువగా భావించిన ప్రముఖవ్యక్తుల అభిప్రాయాలతో తాముగా పరిచితులైతే అర్వాచీనులకు వృథాకాలహరణం తప్పుతుంది."

భాషను పునీతం చేయదలచేవారికి మహాసమర్థుడైన ప్రతినిధి స్విఫ్ట్: 1710 నాటి (నెం. 230 గల) "టాట్లర్" సంచికలో "ఇంగ్లీషు భాషలోని నిరంతరభ్రష్టత"ల నతడు నిందించాడు; "కాన్ట్, మాబ్" మొదలైన కత్తిరింపు మాటలను "షామ్, బ్యాంటర్, బుల్లీ" మొదలైన విరుద్ధపదాలనుగురించి నిష్ఠూరపడాడు; కాని తరువాత తన ప్రయత్నాలు విఫలమైనవని అంగీకరించాడు. "కొంతకాలంగా మాబ్, బ్యాన్టర్"ల అభివృద్ధిని నిరోధించడానికి నేను చేయదగినదంతా చేశాను, కాని నాకు సహాయం చేస్తామన్నవారు మోసగించారు; వారి సంఖ్యాబలానికి తలవొగ్గాను."

ఆ విధంగానే ఆంగ్లభాషను పరిష్కరించి స్థిరీకరించడానికి వక పరిషత్తును స్థాపించవలెనన్న ఆతని సంకల్పం పనికిమాలినదని నిరూపితమైంది. వార్బర్టన్, జాన్సన్‌లు దాన్ని వ్యతిరేకించారు. స్విఫ్ట్ సంకల్పం భాషాసాధారణ స్వభావజ్ఞానంలాగాలేదని, ఇతర భాషల చరిత్రనుగురించిన సరియైన జ్ఞానమతనికి లేదనీ, ఆ వూహలలోని అర్థరాహిత్యాన్ని గ్రహించిన నిఘంటకాదుడు వర్ణించాడు.

"బహుశా భాషాస్వభావాన్నిగురించి కొంచెంగూడా అప్పటికి తెలియని స్థితిలోవున్న పూర్వమహాపురుషులు భాషను క్రమబద్ధం చేయడమనే భావనలోని హేత్వభాసాన్ని గ్రహించలేకపోయారంటే ఆశ్చర్యకరం కాదు; ఫలితంగా అట్టి ప్రతినిధి సంస్థల ఉపయోగితలోని విశ్వాసం దేశవ్యాప్తం కావలసివచ్చింది.

ఫ్రెంచిపరిషత్తు కేవలప్రభుత్వపరిరక్షణలో వుండికూడా ఫ్రెంచి భాషను స్థిరీకరించటంలో విఫలమైంది. ఆ సంస్థ స్థాపింపబడిన తరువాతశతాబ్దంలో యింకా మారింది. * పరిషత్తుల ప్రయోజకత్వపు భావాలమీద నమ్మకం చచ్చిపోతూవుంది; అలాంటి సంస్థలు భాషాస్వభావపరిజ్ఞానం వృద్ధిచెందుతున్నందున ప్రజాభిరుచిని పొందజాలవనిపిస్తున్నది.

ఒక భాష మారకుండా ఆపడానికి ఆ భాషాభాషి సమాజమంతటికీ "సరిగా" మాట్లాడమని, వ్రాయమని జాగ్రత్తగా నచ్చచెప్పట మొక్కటే అత్యంత ప్రయోజనకరపద్ధతి; అంతేగాని, ప్రభుత్వశాసనాలు, పరిషత్తుల ఆంక్షలు, విశ్వవిద్యాలయనిబంధనలు; కాకపోతే నిఘంటువులు, వ్యాకరణాలూ అందుకుపనికిరావు. మహారచయితల గ్రంథాలెప్పుడూ మర్యాదావంతంగా వుండి, ఎప్పుడూ అధికసంఖ్యాకజనం చేత చదువబడి పరిశీలింపబడుతూవుంటే, ఆ గ్రంథాలలోని శబ్దజాలం, భావనలూ వ్యావహారికభాషతో ఏకీభవించి సజీవంగా శక్తిమంతగా వున్నట్లయితే, సాహిత్యం జాతీయభాషమీద తన సాంప్రదాయిక ప్రభావాన్ని తప్పకుండా ప్రసరిస్తుంది. నిర్బంధ విద్యావిధానం వుండి, వుపాధ్యాయులు పదాల వుచ్చారణోపయోగాల విషయంలో జాగరూకులై వుండి, గ్రంథాలు తమనాటిభాషలో వ్రాయబడుతూవుండి, పిల్లలకు చదువుమీద అభిరుచి కల్పించబడివుంటే, ఆలావున్న దేశంలో, బహుశా, భాషాపరిణామం వీలైనంత తక్కువగా వుంటుంది. కాని యిప్పట్లో నూటికి తొంభై యిద్దరకు పయిగా తెలుగువారు సంతకమైనా చేయలేరన్న యదార్థాన్ని దృష్టిలో పెట్టుకొన్న దురదృష్టదేవడూ నవ్యాంధ్రసాహిత్యపరిషత్తుగాని, విశ్వవిద్యాలయంగాని, పాఠ్యగ్రంథనిర్ణాయకసంఘంగాని తెలుగుభాషను స్థిరీకరించగలమని పందెంకాచినప్పుడు విశ్వసించలేడు.

తెలుగు భాష తొమ్మిది వందల సంవత్సరాల పూర్వమే స్థిరీకరింపబడ్డదనీ, అప్పటినుంచీ మారలేదనీ, సులభంగా నమ్మేవా రెవ్వరు? పబ్లిక్ పరీక్షల నుంచి తెలుగువిద్యార్థులను పరీక్షించడానికి గ్రాంథిక కవిత్వంలోని పదపదానికీ ప్రచురింపబడుతున్న టీకలను గురించి, "గ్రాంథికాంధ్రభాషను" అర్థం చేసుకోలేని తెలుగు పట్టభద్రుడి అశక్తతను గురించీ, మనమేమని భావించాలి? తెలుగుభాష "తొమ్మిది శతాబ్దాల సుదీర్ఘకాలానికి మునుపే "స్థిరపడి" వున్నట్లయితే, సాహిత్యక భాషాశాస్త్ర వైషయిక బహిరంగచర్చలలోని "స్థిరభాష"ను తెలుగుపండితులెందుకు పరిహరిస్తున్నారు? ఇది తెలుగు మారిందని నిష్కర్షగా నిరూపిస్తున్నది; కాని ఆదర్శపురుషంమన్యులకొక నమస్కారం - ఆ పండితుడు తన భాషనే తనది కాదంటున్నాడు; తాను గణనీయులలో ఏకడు

---

* నవ్యాంధ్రసాహిత్యపరిషత్తువారు వారి అడుగుజాడలనే అనుసరిస్తారా?

కాగలందులకై, గ్రాంథిక వీరస్వర్గంలో తనకు ప్రవేశానుమతి లభించగలందులకై ఆతడు ఎప్పుడూ (జయప్రదంగా చేయలేకపోయినా) "ప్రామాణిక" కావ్యాలలోని పురాతనభాషను ప్రత్యుత్పత్తిచేయప్రయత్నిస్తున్నాడు. ఈ వాక్యమే గ్రాంథికభాష తెలుగు తొమ్మిదివందలసంవత్సరాలక్రితమే స్థిరపడిందన్న పండితప్రవచనానికి భాష్యం చెబుతుంది. నవ్యాంధ్రసాహిత్యపరిషన్నాయకులు, "పదివేలమంది తెలుగు పౌరులూ" ఆ వాదసామంజస్యానికి సాక్ష్యమిచ్చినా, అది అర్థరహితం, అబద్ధం కాకపోదు; యదార్థాలు దాన్ని అప్రమాణీకరిస్తాయి; భాషఅంటే ఏమిటో తెలిసినవా డెప్పుడూ ఎన్నటికీ దాన్ని నమ్మలేడు. ఏమైనా "సంప్రదాయాదర్శం" యదార్థ మాతృభాషను ఘోరంగా నిర్లక్ష్యం చేయడానికి దారితీసింది; సమాజానికి జ్ఞానసంపాదనసాధనాలను, సాహిత్యాభిరుచిని పెంపొందించుకునే మార్గాలు లేకుండా చేసింది. వంగభాషను గురించి చక్కని కరపత్రం ప్రచురించిన బాబూ శ్యామచరణ గంగూలీ "ఒక కులానికే జ్ఞానాన్ని పరిమితం చేయుటయే లక్ష్యమైతే, వ్యవహృతభాషకన్నా లిఖితభాష విపరీతంగా వేరుపడనివ్వటం కంటె తెలివిగల వుపాయం వుండజాలదు. ఆలాటి కుయుక్తి పాపపరిపక్వంగానే వుంటుంది" వాల్టర్‌ర్యాలీ శైలిని గురించిన వ్యాసంలో దీనికర్థ మేమిటో మనసుకు హత్తుకొనేలాగా విశదీకరించాడు.

"పరిణామమధ్యంలో స్థిరత్వం, ఏకత్వంలోనే అస్థిరత - ఇదే భాషకు సరైన అంచనా. పాండితిని ఒక బృహదాశ్రయంగా, సభ్యతకు శాశ్వతనివాసస్థానంగా పరిణమింపజేయ ప్రయత్నించటాన్ని బట్టి, లేక, మధ్యాగ్నామిస్వభావాన్ని తమకు ఆపాదింపజేసుకొని పరిణామశిఖరాలపై విహరించటాన్ని బట్టి రచయితలు "సాంప్రదాయిక కవులు, భావకవులు" అని విభజింపబడుతున్నారు. భావకవులు వ్యక్తివాదులు, స్వతంత్రులు; వారి ఉద్వేగమయమంత్రోచ్చాటన ధోరణులకు సురక్షితానురూపతలుగల మహానగరాలుద్భవించి నీరవతను పోగొట్టలేవేమో గాని వారి కంఠస్వరానికి ఆకర్షింపబడి నక్షత్రగోళాలు తమ కక్ష్యలనుంచి దూసుకొనివచ్చి భయంకరదృశ్యాలను కల్పించగలవు. జ్వలదాత్మనుంచి బహిర్గమించిన వెలుగులో వారికి, సంఘం న్యాయం పనికిమాలిన గంధర్వనగరాలుగా భాసిస్తాయి. ఆత్మవ్యక్తీకరణసాధనకై చేసే ప్రయత్నాలలో వారు దూరంగావుండి తమ జీవితాలను యమయాతనలు పెట్టారు, భాష యిచ్చే సర్వసాధనాలను, సర్వవిధానాలనూ వారు రంధితో స్వాధీనం చేసుకొంటారు; ఈవక్కలక్ష్యసాధనకై రూపొందిస్తారు; నూతనశాస్త్రిలలోని పదభండారాన్ని వారు దోచుకుంటారు - లేదా విచిత్రభ్రష్ట భాషలను సృష్టిస్తారు. భాషలో అట్టి పదాలు సరిపడకపోయినా,

తమ వాగ్యంత్రానికి సరిపడగలందులకై, వారు ప్రాతబడ్డ మాటలను అలంక
రిస్తారు; లేకపోతే నిర్లక్ష్యంగా కొత్తవాటిని కలిపికొట్టారు. సామాన్యావసరా
లకు సరిపడిన తమదేశపు నుడికారాలను అవగతం చేసుకోక, వాటిని అన్ని
దశలలోను వేటాడి స్వకీయాభిరుచికి తగినట్లుగా రూపాంతరీకరిస్తారు. సులభ
సాధ్యంకానిదేమైనా వైయక్తికత్వం తక్కువగావుండే లక్ష్యాలవైపు మెల్లగా
పురోగమించే సంప్రదాయవాదసమాజానికి, వృత్తిధర్మాన భిన్నమతావలంబు
లైన వీరు వ్యతిరేకులు. ఆధునిక విమర్శవల్ల సంప్రదాయాదర్శమనే యీఉదాత్త
తకు చాలీ చాలని న్యాయంజరిగింది. విశ్వవ్యాప్త నాగరకతకు సాహిత్యాన్ని
మకుటాయమానచిహ్నంగా తీర్చిదిద్దటం, సర్వకాలాలలోను ఉత్తములుగా
ఎన్నికైనవారిని ఏకత్రపరిచి వక మహోజ్జ్వలసభగా నిర్మించి గౌరవించటం,
ప్రశ్ననీయంకాని వక అవ్యాహత మర్యాదకు తలవొగ్గటం క్రమబద్ధత, తర్క
బద్ధతలకైన మానవజాతిచేసిన వేర్వేరు ప్రయత్నాలను కలిసికట్టుగా వక్క
త్రాటిపై నడిపి భిన్నభాషల గందరగోళాన్ని వినష్టంచేయటం-ఇవన్నీ నిశ్చ
యంగా శ్రమయోగ్యమైన త్యాగయోగ్యమైన లక్ష్యాలే. సంప్రదాయవ్యతిరేకుల
స్వయంవ్యంజకత్వం చాలామంది స్తుతిపాఠకులను సంపాదించుకొన్నది కాని,
నవ్యకవిత్వోద్యమపుపండితులు తమ దేశభక్తిని, చిన్ననాటి మాతృభాషను,
ప్రాచీనులతో పౌరసత్వసమభాగులం కావాలని, విద్యకు విశ్వాధికారులైనవారితో
కలిసిమెలిసి జీవించాలనీ. వదలుకొన్నప్పటికంటె ఇప్పుడు గమ్యానికి యింకా
దూరంగావున్న ఈ యితరకార్యంకోసమై బహిరమించిన ఆత్మధిక్కారాన్ని
ఎవరు సగర్వంగా చెప్పుకొన్నారు? సిసిరోకుటుంబంలోను, ఎర్జిల్ ధార్మికబృం
దంలోనులెక్కకువస్తే చాలునని, పండితులు, వ్యాకర్తలు. చమత్కారులు, కవులు
తమ విజ్ఞానజ్యోతిని, కష్టార్జితమైన స్వీయవిజయఫలితాలను మృతభాషా ముఖ
వస్త్రంలో కప్పిపుచ్చి తృప్తిపడ్డారు. విధికృతంగా పతనంకాదగిన ఉదాత్త
భ్రాంతి అది. భాషలోని బహుముఖీన మేధావంతులు వారి ఊహాప్రపంచపు
ఏకరూపతకు వ్యతిరేకంగా గర్జించారు. కాలం పరిపక్వమైనప్పుడు తమకుతామై
దేవత్వాన్నిపొంది పరివారదేవతాకోటిలో స్థానం సంపాదించినవారే, స్వప్న
జగత్తులోని అనిర్మితనగరాలలో నివసించపలసివున్నవారే, విప్లవకారుల
నాయకులవైపుకు చెల్లాచెదరుగా చేరుకున్నారు. ఆ మహాస్వప్నదర్శకుల
సమాధిమీది చరమశ్లోకం వ్యంగ్యశాసనంగా వుంచి 'సంప్రదాయ' కవి అనగా
"చనిపోయిన భావకవి" అని నిర్వచిస్తున్నది."

వాస్తవానికి భావకవులు సరియైనవారు; సంప్రదాయాదర్శంలోవున్న
స్వచ్ఛత పక్షవాతం మరణం అనేవాటిలోని స్వచ్ఛతవంటిది. పదాల వుపయో
గాన్ని గురించిన సర్వజనాంగీకారం భావవ్యక్తీకృతిని సులభం చేస్తుంది.
అయితే భాష భావబంధనంలో విపరీతంగా చిక్కుకపోతే, వ్యక్తీకరించడానికి

ఏమీ మిగలదు. సంప్రదాయపద్ధతియొక్క అడుగుజాడలలోనే భావశూన్యత పయనిస్తుంది. సుదీర్ఘ పతనావస్థద్వారా ప్రతిబింబప్రాయమైన మహిమలచేత భావశూన్యత అంతటా దాస్యమే చేస్తుంది. నిర్నిరోధమై అపూర్వవ్యక్తిగతానుభవంకూడా పాతచట్రంలో బిగించబడినందున వెలవెలబోతుంది. తన సర్వస్వాన్నీ బైబిలులోనో, షేక్స్పియర్ రచనలలోనో, మహాభారతంలోనో దర్శించాలని ఉద్ఘోషించేవ్యక్తి, అలాచేయకపోవడమే మంచిదనుకున్నాడు. అట్టివాడు తనసృష్టికర్త కాక ప్రతిబింబం, ఒకఛాయ; సృష్టికర్త కతడౌక విమూఢదూషణపత్రికా ప్రాయుడు. పునరుక్తి దోషానికతడు మొదటినుంచీ కట్టుబడి వుండనివాడు. "ఎంత నేర్పరియైనా వకసారి చూచిన వస్తువును మరోసారి చూడలేని ఒకసారి జరిగిన పని మరి పునరావృతంకాని ఈ పరిభ్రాంత విశ్వంలో, భాష వక్కటే స్థిరత్వానికి, చరమస్థితికి పనికివచ్చేదని భావించటమే సాంప్రదాయికతావాదులలోని దోషం." తన్ను ఆవిధంగా బంధితురాలిని చేయదలచిన వారిమీద ప్రకృతి పగదీర్చుకొంటుంది; వారి యదార్థాలు ఆభాసలుగా పతనం చెందుతాయి; వారు ప్రకృతికోసం నిర్మించిన హిమభవనాలలోనే వారి భావోద్వేగం చస్తుంది. శాశ్వతత్వం కొరకు వారుచేసే గవేషణలోనే వారు అయదార్థులు, అర్థశూన్యులు, నియమబద్ధులు, సాధారణీకరణ ప్రియులు, నిర్జీవకంకాళ పోషకులూ అవుతారు: వారి కళ శాస్త్రంగా మార్చబడుతుంది; వారిభాష శాస్త్రీయపదజాలంగా మారుతుంది। నిర్వికారతయే వారి ఆదర్శం. అది మృత్యుదేవత హస్తాలలోనే వారికి లభిస్తుంది. పదాలు జీవించాలంటే అవి మారాలి, మరి వకపదం వకసారి స్థిరీకరింపబడితే కళాప్రయోజనాలకు పనికిరాకుండా పోతుంది. సాంప్రదాయక రచనా పద్ధతి ఏలక్ష్యం వైపుకు మొగ్గుతుందో, దానితో పరిచయం సంపాదించ దలచినవారు శాస్త్రీయ పదజాలంలోనే ఆలక్ష్యాన్ని వెదకవలసి వుంటుంది. శాస్త్రంలో పదాలు స్థిరీకరింపబడి చచ్చి పడివున్నాయి. అది వక రంగూ వాసనాలేని ఎండబారిన విత్తనాలపోగు - నామవాచకాలనే మోడు బారినతోట. దానిలో ప్రతి వక్క సంజ్ఞా ఏదో వక లక్ష్యంతోనో భావంతోనో వలుపుతో కట్టబడ్డవే. ఎండిపోయిన పుల్లలకు లాటిన్ (లేక సంస్కృతపు) భాషలో చీట్లుకట్టటంతో సతమతమవుతున్న శ్రామికుడి ప్రశాంతిని చెరుస్తూ ఆ తోటలో గాలివీచదు; సూర్యుడు ప్రకాశించడు.

# ప్రజాసాహిత్యం (1)

ఆధునాతన నాగరకజీవితంయొక్క అత్యంతవిస్పష్టలక్షణం పుస్తకాల నుపయోగించటం. పెద్దా, చిన్నా - అన్ని తరగతుల వ్యక్తులూ ఎలా చదవాలో, ఎలా చదువును ప్రేమించాలో తెలిసినవాళ్ళు; వారికి చదువును ప్రేమించడానికి కొల్లలుగా పుస్తకాలున్నాయి. మాతృభాషా పఠనలేఖనా లిప్పుడు వకకులం లేక వృత్తివారికి చెందిన "రహస్య" కళలు కావు; పండితులు గుత్తకు పుచ్చుకున్న మహోదాత్తప్రజ్ఞలు కావు. ప్రస్తుతసమాజ స్థితిలో భాషలాగానే అవికూడా వదలుకోరానివి. ఇప్పుడు ప్రతిరోజూ ప్రజల సామాన్యభాషలో వ్రాయబడిన ప్రజారచనల సముచ్చయాలు ముద్రణాలయాలనుంచి వెలువడుతున్నాయి. ప్రపంచసాహిత్యాలలోని కాణాచి అంతా, అన్ని దేశాలలో అన్ని కాలాలలోని ప్రజలూ సేకరించిన విజ్ఞాన సర్వస్వం, యిప్పుడు పొలంలోని రైతుకు అందువాటులో వున్నాయి. అతడు కావాలనుకొంటే అవి ఆతడివే. తిండిలాగానే వార్తాపత్రికకూడా జీవితావసర పదార్థమే. పోస్టుజవాను దగ్గర అందరికీ వుత్తరాలున్నాయి.

ఇంగ్లండు, ఫ్రాంసు, జర్మనీ, అమెరికాలలోని సామాజికజీవితం యిలా వున్నది. మనకు ప్రేమాస్పదమైన తెలుగుదేశంలోని జీవితానికెంత విరుద్ధం! మనలో పదింట తొమ్మండుగురు సంతకం చేయలేకపోయినా, తెలుగువాళ్ళం మనం నిస్సందేహంగా "చదువుకున్న" ప్రజలమే. భగవత్కటాక్షం వల్ల మన భావాలను మన చుట్టుపక్కల వున్నవారికి పంపుకోగలం. రోడ్లూ, కాలువలూ, రైళ్లూ, ప్రయాణాలను సులభతరం చేస్తున్నవి. పండితుల అపభ్రంశ భాషలో మన పుస్తకాలలో ఏమేమి వ్రాయబడ్డదో, మన విద్వాంసులు మన సాధారణ భాషలో వివరిస్తున్నారు. పాతబడ్డ గ్రాంథికాంధ్ర సాహిత్యపుభాషలో తప్పించి ప్రజాసామాన్యానికి విద్యాబోధన చేయగోరటం దేశద్రోహ బుద్ధిగా, సంప్రదాయవ్యతిరేకతగా మన నాయకులు తృణీకరిస్తున్నారు. ప్రత్యేక వర్గము యొక్క స్వంతఆస్తియైన చతుర్వేదాలను వినకూడదని ప్రతిషేధింపబడ్డ తక్కువ తరగతుల స్త్రీ పురుషుల మీదగల ప్రేమానురాగాలతో వ్యాసుడు ప్రకటించిన పవిత్రగ్రంథమూ, పంచమవేదమూ, అయిన గ్రంథంలోని పవిత్రభాషను, ఇక్ష్వాకుల బారసాలకు మునుపే ఆంధ్రజాతి మేధాశక్తి సాధించిన పరమపరిపక్వదశకు చిహ్నమైన సంస్కృతమహాభారతం యొక్క ఆంధ్రానువాదాన్ని, తరువాతికాలంలోవచ్చిన కొన్ని (మీకుఇష్టమైతే -చాలా - అనండి)

ప్రతిబింబప్రాయరచనలనూ మనపండితులు అసాధారణగర్వంతో, గౌరవంతో, నిర్దేశిస్తున్నారు. అయితే ప్రపంచం మనవిశ్వవిద్యాలయాలకూ, పరిషత్తులకూ అందనంతవేగంతో పరిభ్రమిస్తున్నది. తెలుగుప్రజలు, సోదరప్రజలవలెనే, తమదేశాన్ని తాము పాలించుకోడానికి యోగ్యతను త్వరలో సంపాదించుకో వలసివున్నది. కనీసం ఓటుకాగితాలమీదవున్న పేర్లను చదవటమైనా వారు నేర్చుకోవలసి వున్నది. ఓటింగు నిబంధనలు పవిత్రభాషలో వ్రాయబడినా, అవి అప్రవిత్రమైన జీవద్భాషలోనే నోటిమాటలతో వివరింపబడవలసి వున్నవి.

తమకు సంక్రమించవలసినవాటికి తెలుగు ప్రజలు ఎంతకాలం దూరంగా వుంచబడతారు? తనకుగాని ఇతరులకుగాని హానిలేకుండా ఓటుచేయగలడన్న నమ్మకం గలగడానికి చాలాముందుగా నాగరకవ్యక్తి చదువుకోవలసివున్నది. నాగరకసమాజంల్లోని సామాన్యపౌరుడుకూడా ఏదిఏమిటో తనకు తెలుసుననుకో గలగడానికీ తనకోసం వ్రాయబడి తనకు చెప్పబడినదానిలో కొంతకు కొంతైనా గ్రహించగలగడానికీ, అన్నిరకాల ప్రయోజనకర విజ్ఞానమున్ను సులభంగా, క్లుప్తపరిమాణంలో పాఠ్యగ్రంథాలద్వారా, ప్రజాసాహిత్యంద్వారా, పంచిపెట్ట బడుతున్నది.

కళాశాలల్లోను, పరిషత్తులలోను వున్న పండితులు - మాకు తెలుసు - తమలోతాము సాహిత్యం, లలితకళలు, కవిత్వం గద్యం మొదలైన పారిభాషిక పదాలకు సంబంధించిన సాధారణధర్మాలపై యధేచ్ఛగా వాదోపవాదాలుచేస్తూ తాముభ్రమలో వుండి యితరులను భ్రమపెట్టుతున్నారు. నిర్ణీతకాలంలో నిర్ణీత ప్రజలభావాల వ్యక్తీకరణమే-అదిన్నీ ఆ దేశప్రజలలో వ్యాపించిన లౌకికభాషలో వ్యక్తీకరింపబడినప్పుడే - ఆ దేశప్రజాసాహిత్య మవుతుందని వారు గుర్తించ నంతకాలం,వారుచెప్పే"తెలుగు""తెలుగుసాహిత్యం","ఆంధ్రప్రజాసాహిత్యం" అన్నవాటి మంచిచెడ్డలను గురించి చర్చించడానికి మాకూవారికీ సమానంగా వున్న చర్చనీయాంశాలు లేవు.

వారు పేర్కొన్న ఆంధ్రసాహిత్యవృత్తాంతంలో,తెలుగుదనాన్ని, తెలుగు వారిజీవితాదర్శాలను మనకు పరిచితాలు కావించి, యింగ్లీషుగ్రంథాలవంటి తెలుగుగ్రంథం ఏదివున్నదో మొట్టమొదట తెలుసుకోవాలని మాకు కుతూ హలంగా వున్నది. గత నూరేళ్ళలో ఉన్నతపాఠశాలల్లోను, కళాశాల ల్లోను,పఠనీయాలుగా నిర్ణయింపబడిన గ్రంథాలలో, ఇంగ్లీషుపిల్లల "రాబిన్సన్ క్రూసో, గలివర్స్‌ట్రావెల్స్, టాంబ్రౌన్స్ స్కూల్‌డేస్, బైబిల్, పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్" లలాగా "ప్రజాసాహిత్యం" అని పిలువదగ్గ తెలుగు పుస్తకం ఏది వున్నది?

తెలుగువారు తమంతటతాము చదువుకోడానికి ఉత్సాహపడే, ప్రయోజన కరమని భావించే ఆంధ్రమహాకావ్యాలేవి? తెలుగు భారతం దేవాలయాల్లోనూ, దుకాణాలదగ్గరా కంఠోపాఠం చేయబడుతున్నదని మాకు చెప్పకండి. దానిని ఒక పండితుడు చదువుతుంటే, మరొకడు నేటి జీవద్భాషలో వివరిస్తున్నాడని మాకు తెలుసు. అది వేరే విషయం. ఇలాంటిది ప్రజాసాహిత్యంకాదు. బొబ్బిలియుద్ధం కథ చెప్పేవాడిచుట్టూ బ్రహ్మాండమైన గుంపులు చేరటం, మీరు చూడటం లేదా? ఆ కథకుడు నిరక్షరాస్యుడు; అతడి ప్రేక్షకులున్నూ నిరక్షరాస్యులు; ఈ గ్రామవినోదానికి దూరంగా నిలబడి ఆనందిస్తున్న పండితుడు కూడా వక డుండవచ్చు. అదీ నిజమైన ప్రజాసాహిత్యం. సంస్కృతం జీవద్భాషగా వున్నప్పుడు చదువురాని భట్రాజులచేత అదేవిధంగా వాల్మీకి సంస్కృత రామాయణం చదవబడ్డది.

" 'యుగ్లింగ్లా సాగా'లో "స్మిత్స్ ఆఫ్ సాంగ్" అని పిలువబడ్డ భట్రాజులు చరిత్రకందిన మొట్టమొదటి విద్యావంతులైన ఆంగ్లేయులు. వారు హార్పు మీద పాడుతూ, వీరగీతాలాలపిస్తూ సురాది పానీయాలను సేవిస్తూ తమవృత్తిలో ఘనమైన పారితోషికాలు పొందినవారు. విడ్‌సిత్‌లోని కథకుడు స్వకీయ కళాసాధనలో అభిరుచిగల అచ్చమైన బట్టు. రాజసభలోని భట్టు స్వయంగా వ్రాసిన పద్యాలను స్వయంగా "ప్రకటించు కొన్నాడు." వీరులు యుద్ధరంగానికి ఉరకలు పరుగులూ దీసే సమయంలో ఆటవికులూదిన బాకాలలోని ఉచ్చాటన గీతాలకు కొమ్ముగొట్టాల సంగీతము తరువాతికాలపు సైనికదళాల వాద్యసంగీతము క్రమబద్ధ వారసులు; నేటి నావికుల "ఉచ్చాటన గేయాలు" భూతాలతో యుద్ధాలు చేస్తున్నప్పటి నావికుల పాటల స్థానంలోనో, లేక ఒంటరి సముద్రాలలో జడప్రాయులై విశ్రాంతి పుచ్చుకొంటున్న నావికుల పాటల స్థానంలోనో నిలిచిపోయినవి" * క్రీస్తుకు పూర్వకాలంలో బేవుల్ఫ్ రచించిన కల్పితగాథ, చరిత్ర, లేక ఇతిహాసం అలాటిది.

క్రీస్తుశకం నాటి ఆంగ్లప్రజల తొట్టతొలి ప్రజాకావ్యం వక నిరక్షరాస్యుడైన నీచుడైన పసులకాపరి కాడ్‌మన్‌కు ఆపాదింపబడ్డది. తన రాజ్యంలో ప్రచారంలోవున్న మాండలికంలో అల్‌ఫ్రెడ్‌రాజు చాలా పుస్తకాలు రచించాడు. "తన ప్రజలు తమ స్వంతభాషలో భగవదాదేశాన్ని చదువుకో గలగడానికై" ఆయన తన శాసనాలను సాధారణ భాషలో ప్రకటించాడు. అల్‌ఫ్రెడ్ "శుభవార్త"కు ఆంగ్లభాషలో వ్రాసిన అనువాదగ్రంథం పదవ శతాబ్దపు ప్రజాసాహిత్యానికి ప్రతినిధి. ఇంకాఅనేక పదాలను, ఇతర పద్యగ్రంథాలను ఆయన వ్రాశాడు. సంధియుగపు తొలిరోజుల ఇంగ్లీషులో ఆర్మ్యులం, లేమన్‌వ్రాసిన

* "కేంబ్రిడ్జ్ హిస్టరీ ఆఫ్ ఇంగ్లీష్ లిటరేచర్" నుండి.

బర్ట్, ద ఓల్ అండ్ నైటింగేల్, ఆంక్రెన్ లివ్లే అన్నవి వున్నాయి. వాటిలో చివరది స్త్రీలకై వుద్దేశింపబడ్డది. "ప్రజావినోదార్థం" ఆర్థరు పిట్టకథలకు అక్షరాకారం యివ్వబడ్డది. మతాధికారాన్ని ధైర్యంగా ప్రతిఘటించి వైక్లిఫ్ "భగవంతుడి మాటలను ప్రజల సామాన్య భాషలో రచించడానికి కఠినశ్రమల కోర్చి క్రీ. శ. 1382 ప్రాంతాలకు "సాధారణంగా వ్యవహరింపబడుతున్న ఇంగ్లీషు భాషలోనికి యావత్తు బైబిలునూ పరివర్తింప గలిగాడు." బైబిలు అప్పటినుంచీ కేవలం మతాచార్యుల ఆస్తిగాని, ఆనాటి వేళ్ళమీద లెక్కకువచ్చే కొద్దిమంది పండితుల సొమ్ముగాని కాదు. అప్పటికది ప్రజల మాతృభాషలోనికి వచ్చివేసింది, నాగలి బట్టిన ప్రతిపాలేరూ బైబిలు చదవగలిగేటట్లు చేయాలని చాలామంది కన్న కలలు చక్కగా నెరవేరగల స్థితికూడా వచ్చింది."

ఆ కాలంలో ఇంగ్లండులోవున్న ప్రజాసమూహమంతా అక్షరాస్యులు కారన్నమాట నిజం. ఇంకా వైక్లిఫ్ వ్రాసిన బైబిలును ఇంగ్లండులోని ప్రతి పురుషుడూ, ప్రతిస్త్రీ చదివారని మేము చెప్పటమూ లేదు. ముద్రణయంత్రం ఆవిష్కరింపబడటానికిముందు పుస్తకాలు చాలా తక్కువ సంఖ్యలోవుండేవి. ధర చాలా అధికంగా వుండేది. అప్పట్లో వక బైబిలుప్రతి ఖరీదు అయిదు వందల రూపాయలకు మించివుండేది. ఇతర ప్రజా సాహిత్య గ్రంథాలలాగానే బైబిలుకూడా ప్రజలకు చదివి వినిపించబడేది; "తరుచుగా ప్రజా సమూహాలను ఒక్కచోటికి సమీకరించి వకరు చదివి అందరికీ వినిపించేవారు" అదేవిధంగా సమావిష్టులైన ఉన్నతవర్గాల స్త్రీ, పురుషులకు బహిరంగ గృహాలలో సమావేశమైన ప్రజలకూ ఛాసరుకథలు చదివి వినిపించబడేవి. తననాటి ప్రజాకవులందరిలాగానే ఛాసరుకూడా వాస్తవానికి, తన కావ్యాన్ని అందరూ "అప్పగించాలని" వుద్దేశించాడు. మనమిప్పుడు ముద్రణాలయంనుంచి వెలువడగానే, ప్రజలు చదవగానే వక పుస్తకం "ప్రచురించబడిం"దని అంటున్నాము. కాని ఛాసరు కాలంలో పఠనంవల్లకన్నా "అప్పగింత"వల్లనే "ప్రచురణ" అన్న అర్థం వచ్చేసింది. "ఈలాటిది ప్రజలు నిరక్షరాస్యులైనా అజ్ఞానులుగాని కాలంలో సంభావింపబడుతున్నది."

ఆచార్య లౌన్స్‌బరీ "స్టడీస్ ఇన్ ఛాసర్" అనే తన గ్రంథంలో ఛాసరు భాషనుగురించి ప్రస్తావిస్తూ అది "అమలిన ఆంగ్లభాషకు నిధి "అంటాడు. "ఛాసరు వాస్తవానికి తన కాలపు ఆంగ్లభాషలో - కాదు ఆంగ్లభాషలోనే-వ్రాశాడని చెప్పవలసిన ఆవశ్యకత వుండనేరాదు. తన తరువాతి వారిలో ఏఒక్కడికీ కలుగనట్లే భాషను నిర్మించటం - పునర్నిర్మించటం - అనేవూహ అతని పుర్రెలో పుట్టలేదు. ప్రతిభావంతుల కీమార్గం తొక్కటం ఏకాలంలోనూ సరిపడదు. కాని, ఏభాషలోనైనా పాఠకులు అల్పాల్పసంఖ్యలో వున్నప్పుడు,

విదేశ భాషాజ్ఞానం ఇంకా చాలా తక్కువమందికి పరిమితంగా వున్నప్పుడు, నిఘంటువులు లేనప్పుడు; తన గ్రంథాలు చదవబడకుండా చేసుకొనేందుకు రచయిత కనిపెట్టదగిన ఉత్తమ సాధనం అధికసంఖ్యలో అపరిచిత శబ్దాలను ప్రయోగించటం వక్కాణించినలాగా ఛాసరుకూడా ఈసత్యాన్ని బాగా ఎఱిగిన వాడే. అందుకు సందేహించవలసిన అవసరమే లేదు. అతడు కావాలనుకొన్నా అనేక విదేశ శబ్దాల ప్రయోగించగలిగి వుండేవాడు కాడు; ప్రయోగించ గలిగినా అలాచేసి వుండేవాడూ కాదు. అందరు రచయితల లాగానే అతని రచనలోని ప్రథమోద్దేశ్యం చదవబడాలనే. అతడూహించ గలిగింది ప్రతి ఒక్కడూ గ్రహించ గలిగిన భాషలో వ్రాయటమే. ఆమార్గాన్ని అతడు తప్పకుండా అనుసరించాడు. తన జీవితకాలంలో తాను ప్రజాకవి అయినాడు. ఈసత్యమే భాషపై అతడు ప్రసరించిన ప్రభావానికి హేతువు. అతడు తనకు బాగా పరిచితమైన తూర్పు మిడ్లాండ్ మాండలికంలో రచించాడు. అది అతని మాతృభాష. అది ఆంగ్ల సాహిత్యభాషగా పరిణమించింది. ఇంకో విధంగానైతే నశించిపోవలసిన చాలా పదాలను అతని కావ్యానికున్న విపరీత ప్రచారం కాపాడింది. అతని ప్రభావం అధికారిక పరిజ్ఞానమున్న ప్రతి గ్రంథకర్తయొక్క ప్రభావానికి ఏవిధంగానూ విరుద్ధంకానిది. కేవలం అతడు కాలంకంటె ముందు నడిచినందున ఆ ప్రభావం మరింత అధికంగా వున్నది." (2వ సంపుటం)

కాక్‌స్టన్ ఇంగ్లండులో ముద్రణకళను ప్రవేశపెట్టినప్పుడు తనకాలంలోని విద్యావంతుల వాడుకలోవున్న ఛాసరుశైలిని, పాకాన్నీ వుద్దేశ్యపూర్వకంగా అనుసరించాడు. శైలి ఫ్రెంచిపద్ధతిలోవున్నా నుడికారం పూర్తిగా ఇంగ్లీషు వారిది. అతడి స్నేహితులు కొందరు వాడుకచేయమని ప్రేరేపించిన పాత ఇంగ్లీషు మాటలు "అతడు స్వయంగా అర్థం చేసుకోలేనంత కఠినంగా, పెద్దవిగా వున్నాయి."

ఏమైతేనేమి, రెండువందల సంవత్సరాలలోగానే ఛాసరుఇంగ్లీషు, ప్రయోగదూరమై పండితులకే అర్థం కాకుండా పోయింది.

మిల్టన్ స్నేహితుడైన వాలర్ సహనభావంతో అంటాడు గదా :-

"ఛాసరు తన తెలివిని గురించి బడాయి కొట్టవలసిందేగాని అతడి కావ్యభాగాల మహిమలు పోయినవి. కాలం అతగాడి అనుపమరీతిని చెరిచింది. అయితే అతడు వృథాగా జీవించలేదు."

సర్ ఆస్టన్ కాక్నే, నేటి మన ఆంధ్రసాహిత్యపరిషన్నాయకులవలెనే పాతభాష ప్రయోగదూరం అయినదనీ, అర్థం కాజాలదనీ ఆక్షేపించిన వారిని కించపరిచి, అట్టివారు తమ "మాతృభాషే" తెలియనివారని పరిగణించినపుడు, ఆతడంటాడు గదా :-

"మన ప్రాచీనమహాపురుషుడు ఛాసరును కొందరు తృణీకరిస్తా రెందుకు? అతడ నాగరకంగా వ్రాస్తాడు కాబట్టి. అని వారంటారు. కాని (అజ్ఞానులారా) మిమ్ము మీరు నిందించుకోండి. ఎందుకంటే ఇప్పట్లో మీరు మీ మాతృభాష నెరుగరు."

పూర్వమాండలిక భాషాజ్ఞానం తనకు లేనందున; తనశైలిని ఛాసరు ధోరణులలో తయారించ ప్రయత్నించినప్పుడు ఛాసరుకూడా బెన్‌జాన్సన్ చెప్పినట్లు "పూర్వుల ననుసరించటంవల్ల అతడు భాషనే వ్రాయలేదు" అనదగి నంత మడ్డిగా వ్రాశాడు. అతడు ఛాసరునుంచి పదాలనేకాక వ్యాకరణాన్నికూడా నిర్నిబంధంగా, సంకరంగా, సంగ్రహించాడు. ఫలితంగా అతడి రచన క్లిష్టమై పోయింది. "అందుకు హేతువు అతడిపదాలు ప్రయోగదూరాలు కావడమేకాదు అవి ఎప్పుడూ ప్రయోగింపబడక పోవడమే. అవి అత్యంత కృత్రిమపదాలు. అందుచేతనే వాటిముఖాన నాశనం రాసిపెట్టి వున్నది. వాటివల్ల అతడి రచన లను చదవటం కష్టమై పోయింది. అందువల్లనే వాటిని కొద్దిమంది చదివారు." ఇలా వ్రాయటం కించ పరచటమే. కాని, ఎలిజబెత్‌రాణిచేత, ఆమె దర్బారు లోని కవిచేతా పొగడ్తలందుకొన్న గౌరవభావంతో సర్వకాలంలో ఇంగ్లీషు కవులచే ఆదరింపబడిన స్పెన్సర్ రచించిన సుప్రఖ్యాత కావ్యాన్ని ప్రస్తావించ టంలో దానికి సమస్తకావ్యయోగ్యతలున్నా అది ప్రజాకావ్యం కాలేదని ప్రద ర్శించటమే మా లక్ష్యం.

ఛాసరుభాషలాగానే వైక్లిఫ్‌భాషకూడా త్వరలో ప్రయోగదూరమయి పోయింది. కాంటర్బరీ కథలను చదివి వినిపించినప్పుడు అర్థం చేసుకోలేనం దుకు ప్రజలు లక్ష్యపెట్టకపోయినా, 'భగవద్వాక్యం' తమ తాతముత్తాతలకు అర్థ మైనంతగా నయినా తమకు అర్థంకాక పోయెనే అని ప్రజలు వ్యసనపడ్డారు. (1526 లో) టిండేల్ బైబిలును అనువదించ పూనుకున్నాడు; కాని అలా చేయ డానికి మతాధికారు లతడికి అనుమతి యివ్వలేదు; ఆ రోజులలో ఒక చట్ట మున్నది. అది "ఎవరైతే శ్రుతులను తమ మాతృభాషలో చదువుతారో వారు, వారి వారసులూ. తమ భూమిని, పశువులను, ప్రాణాలను, సామగ్రిని కోల్పో తార"ని శాసిస్తుంది. అందువల్ల టిండేలు జర్మనీకి పోవలసివచ్చింది. తరుచుగా తన ప్రశాంతికి భంగం కలిగినా, అతడక్కడ తనపని పూర్తిచేశాడు. బైబిలు ప్రతులను రహస్యంగా ఇంగ్లండును చేరవేశారు. దొరికిన ప్రతులన్నీ కొని లండను బిషప్పు తగుల బెట్టాడు. చిట్టచివరకు టిండేలును బాధించి గొంతు పిసికి చంపారు. అతడి మృతశరీరాన్ని కాల్చి బూడిదచేశారు. అతడినేరం భగవద్వాక్యాన్ని ఆంగ్లభాషలో చెప్పటమే. అప్పట్లో ఇంగ్లండులోనే బైబిలును

జనసమ్మతం చేయదలచిన వ్యక్తులు ప్రాణాలు కోల్పోవలసి వున్నదనటం మనకు యిప్పుడు విరుద్ధంగా కనిపిస్తుంది.

త్వరలోనే టిండేలు వ్రాసిన బైబిల్ ఇంగ్లండుదేశం అంతా చదివిన ఏకైక మహాగ్రంథమైనది. దాన్ని అన్నిరకాల ప్రదేశాలలో, అన్నిరకాల పరిస్థితులలో, అన్నిరకాల ప్రజలూ చదివారు. విశ్వవిద్యాలయాలలో, దానికి త్వరత్వరగా ఆశ్రయం లభించింది. వ్యాపారులు, శ్రామికులు, పాలేళ్లు దాన్ని చదివారు. విద్యాపీఠాలలో, దేవాలయాలలో, ఇంకా ప్రజల నివాస గృహాలలో ఆగ్రంథ మధురధ్వని శ్రుతి సుభగంగా వ్యాపించి అత్యాశ్చర్యకరమైన ప్రభావాన్ని ప్రసరింపజేసింది."

"ఆంగ్లసాహిత్యక వచనోన్మేషం" అనే గ్రంథంలో జార్జిఫిలిప్‌క్రాప్ అనేఅతడు టిండేల్ అనువాదవిజయాన్ని ప్రకటీకరించాలనుకొన్నాడు.

"టిండేల్ ముఖ్యంగా ఆలోచనాపరుడిలాగా భాషనుపయోగిస్తాడు. అతడి పట్టుదల అర్థం స్పష్టంగా వుండేటట్లు చేయాలనే. ఈ విధంగా అతడు వైవిధ్యం, భావవిస్తృతి అన్నవాటినికాక చిక్కదనాన్ని అభివృద్ధిపరిచాడు. మరోవిధంగా నైతే నగ్నసౌల భ్యంగా కనిపించేదానికి జీవాన్ని, శక్తినికలిగించగల తీవ్రభావోద్వేగం వున్నందువల్లనే కదాచిత్తుగా అతడు ధాటీగా వ్రాస్తాడు; టిండేల్ వాక్యాలు సాధారణంగా హ్రస్వమైనవి. కాని అల్లికజిగిబిగి వాటిలో బాగావుంటుంది. కేవలవ్యావహారికసంభాషణలలోని వాక్యాలకన్నా అవి ఏకొంచెమో ఎక్కువ నియమాలతోవున్నవి. అతడి నిష్కపట పదజాలంలో కర్కశత్వం, మెఱుగులు వాటిఛాయలులేవు. జాతీయపదగుంభనలోని స్వచ్ఛభావనవల్ల అతడిబైబిల్ అనువాదానికి వచ్చినగౌరవమే, అతడి ఇతరాంగ్ల రచనలలోకూడా కనిపిస్తుంది. స్పెన్సర్, షేక్స్పియర్ లేక ఎలిజబత్‌యుగం లోనిఏఇతర మహాకవి రచనల్లోనయినా కనిపించేదానికంటె తక్కువ తరుచుగానే, నేటిపాఠకుడు అపరిచితశబ్దం లేక సంభాషణ అన్నవాటివల్ల, నేటికి రమారమి నాలుగువందల సంవత్సరాలక్రితమే అతడి గ్రంథాలు రచింపబడినప్పటికీ, వక్కపర్యాయంకూడా కాస్సేపు ఆగిపోడు. టిండేల్‌రచనలు ఆంగ్లజాతీయపదాలలోని ఆధునికభావనల నభివృద్ధిపరచటంలో బలవత్తరశక్తులుకావటమే యిందుకు కొంతవరకు కారణం. తననాటినుంచీ ఆంగ్లేయజీవనంలోని మూల లక్షణాలను నిర్ణయిస్తున్నటువంటి, పండితులుగాని పామరులుగానీ కానటువంటి, వ్యక్తిగత నిజాయితీపై బలవదభినివేశంకలిగినటువంటి, సాహిత్యకాభిప్రాయాలవల్లగాని, నూతన సాహితీమర్యాదలవల్లగాని యితరులకంటె తక్కువగా స్పృశింపబడినటువంటి ఆంగ్లజాతీయతలోని మూలశక్తులతో టిండేలు, అందువల్ల అతనిభాష, అంతపూర్తిగా అవినాభావాన్ని ఏర్పరుచుకొన్నాడన్న

సత్యంలో దీనికి మరికొంత ప్రముఖమైన సమాధానం లభిస్తుంది. తన సందేశాన్ని తనకుతాను అర్థంచేసుకొన్నంత స్పష్టమైన లోతైన అర్థంలో ప్రసారం చేయగలిగిన పదజాలంలో రచించటమే అతని ప్రథమలక్ష్యం - ఏకైకలక్ష్యమున్నూ. ఈ లక్ష్యసాధన కుపయోగించజాలని సాహిత్యసాధనాలను అతడు విసర్జించాడు. వక్రృత్వాన్ని పరిహరించాడు. అతడు స్వీయ నిష్కపట ప్రయోజనాలనే విశ్వసించాడు, అతడు భాషవల్లకోరిందంతా, సులభంగా, స్పష్టంగా, తోటిఆంగ్లేయులపట్ల సహానుభూతితో తన భావాలను వ్యక్తీకరించటంలో సహాయపడటమే." (107 వ పుట)

ప్రామాణికపాఠంతోసహా తరువాతికాలాల బైబిల్ అనువాదాలన్నీ. కొద్దోగొప్పో టిండేలు రచనపై ఆధారపడ్డవే. ఇంగ్లీషుభాషపై అతడి పుస్తకం ఎంత ఎక్కువ ప్రభావాన్ని ప్రసరించిందంటే, ఆంగ్లప్రజలు మూడువందల సంవత్సరాలకు పైకాలంగా తమ యింగ్లీషు బైబిలును అర్థంచేసుకోవటంలో క్లేశపడలేదు, ఏమైతేనేమి, 1870 లో, అరవైఅయిదుగురు బ్రిటిషు పండితులు ముప్పైనలుగురు అమెరికన్ పండితులూ కలిసిన వక ప్రతినిధిసంఘం బైబిలుకు చివరిసారిగా ప్రామాణికపాఠాన్ని తయారుచేయబూనుకున్నది. అందుకు సమర్థనగా యిలా చెప్పబడ్డది. "అసలు పరిష్కృతపాఠమనేది ఎందుకు తయారుచేయబడాలని కొందరు ఆశ్చర్యపడ్డారు, వారు పాతపుస్తకం తరతరాలుగా సక్రమంగా ఉపయోగపడింది, కాబట్టి దానిమార్గాన దాన్ని సాగిపోనీకపోవడం ఎందుకంటారు. ఈ విధంగా చెప్పడాన్ని మేము బాగా అర్థంచేసుకోగలము. గడచిన రెండువందలయాభైసంవత్సరాల కాలంలో మన యింగ్లీషుభాషలో కలుగుతూ వున్న గొప్పమార్పులను గురించి ఆలోచించినట్లైతే, పవిత్రగ్రంథంలోని అనేక పదబంధాలను మార్చటం మంచిదని మనకు గోచరించితీరుతుంది. ఆ పదబంధాలుకొన్నిసందర్భాలలో పాఠకులకు సరైన అర్థాలను అందించలేవు."

# ప్రజాసాహిత్యం (2)

ఇంగ్లీషు బైబిలుయొక్క అన్ని ప్రతులలోనూ వున్నభాషగాని, శైలి గాని, అన్యతరజనసమ్మిత గ్రంథాలలోని భాషాశైలుల లాంటివే. అవి సాధారణ ప్రజల శక్తిసామర్థ్యాలకు సరిపడేటట్లు, శుభవార్తను నిరక్షరాస్యులకు గూడా అందజేయగలవని పరిగణింపబడినవి. ప్రతిపక్క జీవద్భాషలాగానే ఆంగ్లభాషకూడా మారుతూవున్నందున, అది ఏ ప్రయోజనంకోసం రచింపబడ్డదో అది విఫలంకాకుండా వుండేటందుకై బైబిలుభాష చాలాసందర్భాలలో ఆధునికీకరించబడ్డది.

ఇంగ్లండులోని సాహిత్యక సంప్రదాయం ఎన్నడూ ప్రవాహినీ భాష నుపయోగించటంతో కలిసిమెలిసి వున్నది. ఈ సంప్రదాయం ప్రజలలో విజ్ఞానాన్ని వెదజల్లడానికి వుద్దేశింపబడిన గ్రంథాలలో వుండితీరాలన్న పట్టుదల వున్నది. అందుచేత, ఏనాటి ప్రజావ్యవహారంలోవున్న సాధారణభాషలో ఆనాటి జనసమ్మిత గ్రంథాలన్నీ రచింపబడ్డవి. ఎవిలిన్ వంటి పండితంమన్యుడు- "ఈ పుస్తకాన్ని నేను కేవలం సాధారణ గ్రామీణులకోసంగాని అడివి మనుష్యులకోసంగాని, కట్టెలు కొట్టుకునేవారికోసంగాని రచింపలేదని గుర్తుపెట్టుకొందురుగాక. అయితే పెద్దమనుషుల గుణవజ్ఞుల ప్రయోజనోత్సాహాలకై రచించానని గ్రహింతురుగాక" అని పలికిన ప్రజ్ఞలు బహుశా అతడి కాలపు పండితుల అభినందనలు పొందవచ్చుగాని తర్వాతికాలపువారు తప్పకుండా అతణ్ణి మరిచిపోతారు.

ఇప్పుడే మేము సాహిత్యక సంప్రదాయాన్ని గురించి చెప్పినవాటికి వుపపత్తులను చూపడానికి, ఆంగ్లంలో 'జనసమ్మతం' అన్నమాట ఏ భావంతో ప్రయుక్తమైనదో ఆభావంలో జనసమ్మతమైన గ్రంథం ఒక్కటైనా తెలుగు పండితులూ మద్రాసు విశ్వవిద్యాలయంవారూ గుర్తించిన ఆంధ్ర సాహిత్యంలో లేదన్న మా వాదాన్ని స్థాపించడానికీ, అత్యంత ప్రజాసమ్మితాంగ్లభాషా గ్రంథాలలో కొన్నింటి భాషాశైలులను, స్వాభావిక లక్షణాలనూ క్లుప్తంగా వర్ణించ ప్రయత్నిస్తాము.

"గ్రాంథికమైన" ఆంగ్లభాష జీవద్భాషగా, సాధారణ శిష్టవ్యవహారానికి యించుమించు సరిపడివుండగా, 'గ్రాంథికాంధ్రభాష' పూర్తిగా కృత్రిమంగా చదువుకున్న పండితులలో కూడా ఎక్కడా వినిపించకుండా, ఉదాహరణకు

సంస్కృతంలాగా అధ్యాపకులదగ్గర చదువుకొన్న వాళ్ళకుమాత్రమే బోధపడే టట్లుండి పుస్తకాలలో మాత్రమే ప్రయుక్తమవుతున్నది. పుస్తకాలద్వారా కాక దైనందిన జీవితంలో సమాజంలోని యితర సభ్యులతోటి సంపర్కంద్వారా నేర్చుకోబడ్డ ప్రామాణికాంగ్లభాషలో, ఇంగ్లండులోని శిష్టసమాజంలోని సాధారణ సభ్యుడు వ్రాయడమేగాక మాట్లాడనూ గలుగుతున్నాడు. ఇతరులకేదైనా చెప్పవలసివున్న ఏ ఆంగ్లేయ పురుషుడైనా, స్త్రీయైనా సహజధోరణిలో, ప్రయత్న నిరపేక్షంగా, ఆత్మచైతన్య నిరపేక్షంగా మాట్లాడగలరు; సమాజంలోని యితరసభ్యు లొకరు చెప్పినదాన్ని తక్షణం అర్థంచేసుకోగలరు; మాట్లాడిన భాషనే వ్రాసినా ముద్రించినా వ్యత్యాసం కనిపించదు; అదంతా ప్రకేపక భాష. వ్యాఖ్యానాలూ వివరణలూ అవసరం కావచ్చు. అలా అవుతాయికూడా. కాని, అట్టివి భాషను వ్యాఖ్యానించడానికి కాక అపరిచితకల్పనలను, భావాలనూ స్పష్టం చేయడానికే.

అందుకు విపరీతంగా, లిఖితాంధ్రానికి వ్యవహృతాంధ్రం సమస్తాంధ్ర ప్రజలకున్నూ ఆంధ్రసాహిత్య పరిషన్నాయకుల తెలుగు వుపన్యాసాలు ఇంగ్లీషు ప్రజలకు ఇంగ్లీషు ఉపన్యాసాలున్నంత సుబోధంగా వున్నప్పటికిన్నీ. వాటిని ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో ప్రచురించడానికై గ్రాంథికభాష అని చెప్పబడే మూసలో పోసినప్పుడు పండిత సహాయంగాని, నిఘంటు సహాయంగాని తప్పకుండా అపేక్షణీయమైనంత సంబంధ రహితంగా వుంటున్నది. వక్తృముఖంలో నుంచి బహిర్గమించిన "గ్రామ్యరూపం"లోనే ప్రచురిత భాషగూడా వుంటే ఆ పత్రికా గౌరవానికేగాక వక్తృగౌరవానికి కూడా భంగకరంగా వుంటుందని భావించటమే అందుకు హేతువు. ఒకనాడు వాడుకలోవున్న వ్యావహారిక భాష కన్నా ఆనాటి గ్రాంథికభాష వీలయినంత దూరంగా వుండాలన్న తప్పుడువూహ యొక్క ప్రభావంలో పడిపోయిన రచయితలు, గడిచిన యాభై సంవత్సరాలలో ముద్రింపబడ్డ ప్రతి తెలుగు పుస్తకాన్నీ కావాలని వక కృత్రిమభాషలోకి మార్చి వేశారని అందరికీ తెలిసిందే.

ఇపుడింక జనసమ్మిత గ్రంథాలు వ్రాయబడిన ఆంగ్లభాష లక్షణాలను పరిశీలించడానికి ఉపక్రమిద్దాం. అత్యంత జనసమ్మిత గ్రంథాలలో కొన్నింటిని గురించిమాత్రమే మనం చర్చిద్దాం. మొట్టమొదట మెలోరీవ్రాసిన 'మోర్టే డి ఆర్థర్' తీసుకొందాం. మెలోరీ సేనాధిపతేగాని 'పండితుడు' కాదని గుర్తించవలసివుంటుంది. "మెలోరీ వ్రాసిన వచనం స్తవనీయమైనది. కృత్రిమచమత్కారాలవల్ల అది చెడిపోలేదు, దానిలక్ష్యం గ్రంథకర్తృభావాలను ప్రతిఫలించటంలో తన కర్తవ్యాన్ని ప్రతిఫలించటమే. నుడికారాలతో నిండిన దాని స్వభావమే దాని ప్రత్యేకతను ప్రముఖంగా ప్రదర్శిస్తున్నది. తన మాతృభాష నుపయోగించ

టంలో మెలోరీ చక్కని సహజజ్ఞానాన్ని ప్రదర్శిస్తాడు. పదహారో శతాబ్దంలో మోర్టే డి ఆర్థర్‌కన్న అధిక జనసమ్మతమైన గ్రంథం లేనందున అతడు ఎన్నిక చేసిన పదజాలం అతడి మాతృభాషలో ఎల్లప్పుడూ ఒకభాగంగా వుండిపోయింది. అతడి ఎన్నిక నిస్సందేహంగా ఆపదజాలం ఆవిధంగా వుండిపోగల అవకాశాన్ని అభివృద్ధి పరిచినప్పటికీ, అలాంటి పదజాలాన్ని ఎన్నిక చేయడానికి ఆతడికి ఈ సున్నితభావం ఏవిధంగా మార్గదర్శకమైనదో చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది." వాస్తవంగా, ఈమాటలు, సాహిత్యపు సనాతన ప్రభావాన్ని చిత్రిస్తున్నవి; కాని, నిర్దిష్ట జనసమ్మత గ్రంథం అనుపయుక్తమైపోయినప్పుడూ కొన్ని పాతబడిన పుస్తకాలలో కనిపిస్తున్నవన్న కేవలాధారాన్ని బట్టి కొందరు తెలుగు పట్టభద్రులు ప్రయోగ దూరమైన శబ్దాల ప్రయోగాన్ని సమర్థించినప్పుడూ మాత్రమే ఆ ప్రభావం ప్రసరిస్తుంది.

తరువాతి కాలానికి చెందిన మరొక ప్రజారచయితను చూద్దాం. తన గ్రంథజాలంవల్ల అమరత్వాన్ని పొందిన ప్రఖ్యాత లోహకారుడు బన్యన్. ఆతని "యాత్రిక పురోగమనం" అన్న రచనను గురించి మెకాలే అంటాడు. "మనసాహిత్యంలో నిష్కళంకమైన ఆంగ్లభాషా ప్రతిష్ఠపై ఇంతఅవ్యవహితంగా పందెం కాయదగిన మరో పుస్తకంలేదు....చక్కని ఆంగ్లభాష మాట్లాడదలచిన వ్యక్తి తన సహవాసార్థం బైబిలు ప్రామాణిక ప్రతిని, బన్యన్ వ్రాసిన 'యాత్రిక పురోగమనా'న్ని తీసుకొనితీరాలి. బన్యన్ ఇంగ్లీషు చర్చియింగ్లీషు మొగవాడి యింగ్లీషు, ఆడదాని యింగ్లీషు; ఈగడ్డలో పుట్టిన జాతీయ బాలికలు ఎక్కడ బట్టితే అక్కడ మాట్లాడే యింగ్లీషు." లెనబిల్స్ అంటాడు. "అతడు (బన్యన్) చెప్పదగినట్టిదేదో కొంత తాను చెప్పవలసివున్నందునను, తన హృదయంనుంచి వచ్చినందున యితరుల హృదయాలకు బాగా హత్తుకోగల విధంగా ముక్కుసూటిగావుండే స్వచ్ఛందత తేటదనంగల భాషను మించి మరేమీ అపేక్షించని యితరుల వుత్తమాభిరుచులకు సంతృప్తికరంగా వుండే సందేశాన్ని యివ్వవలసివున్నందునను, రచించాడు. అతడు తాను మాట్లాడినట్లే వ్రాశాడు. ఎందుచేతనంటే, తాను వదిలించుకోడానికి సాహసించలేని అవసరం వక్కటి ఆతడికి వున్నది. "లౌకికాంగ్లభాషాప్రవాహిని"అని "సమకాలికమాతృభాష" అని సభే, బన్యన్‌భాషను వర్ణిస్తాడు.

డిఫోవ్రాసిన "రాబిన్సన్ క్రూసో"కుపరిచయవాక్యాలక్కరలేదు.అదిసర్వోత్కృష్టమైన జనసమ్మత గ్రంథం; యిప్పటికీ ప్రతిబాలుడూ దాన్ని చదువుతున్నాడు. కసాయివాడికొడుకైన ఆ గ్రంథకర్త మాధ్యమిక పాఠశాలనుగాని, కళాశాలనుగాని ఎరగనే ఎరగడు. తనస్వయంకృషిచే విద్యావంతుడైనవ్యక్తి. అతడు లెక్కలేనన్ని కరపత్రాలనేగాక 254 పుస్తకాలనుకూడా వ్రాశాడు;

అతడు తానెంత సులభంగా మాట్లాడేవాడో అంతసులభంగానే మాతృభాషను వ్రాయగలిగాడు. అతడూ మహాచైతన్యవంతుడూ, మహాసూక్ష్మబుద్ధీ అయిన రాజకీయవేత్త. రాబిన్సన్ క్రూసో 'మొదటిభాగం 1719 ఏప్రిల్ 25 న ప్రచురిత మైనది. అయిదు నెలలలో నాలుగు ప్రచురణలు అమ్ముడుపోయాయి. ప్రతి ముసలమ్మా ఆ పుస్తకప్రతిని కొంటూ వుండేదని, 'యాత్రికపురోగమనం'తో బాటు ఈ ప్రతినిగూడా తనకుటుంబానికి వారసత్వపుటాస్తిగా యిచ్చిపోతుండేదనీ చెప్తారు. మింటో అంటాడుగదా - "డిఫోశైలిలోని అత్యుత్తమ విశిష్టలక్షణం గృహవ్యవహారభాషాప్రయోగం. 'రాబిన్సన్ క్రూసో' యొక్క అవిచ్ఛిన్న ప్రచారానికి గల రహస్యహేతువులలో ఇది ఒక్కటి. కఠినగౌరవంతో ప్రస్తావింపబడే విషయాలలో చాలా సంసారపక్షపుభాషను అన్వర్తింపజేయటంలో ఆతడి చమత్కారం ఇమిడివున్నది. డిఫోను "ప్రజలవ్యక్తి; స్వచ్ఛమై శక్తిమంతమై నిరలంకృతమైన ఆంగ్లభాషారచయిత"అనీ, "అతడు నిరంతరాయంగా బజారులలో వాడే పరిచితజాతీయాలను నిరంతరంవాడుతుంటా"డని టకర్‌మన్ పేర్కొంటాడు.

"గలివర్‌యాత్రలు", వ్రాసిన డీన్‌స్విఫ్ట్, బన్యన్‌వలె, లోహకారుడుగాని, డిఫోవలె కసాయివాడికొడుకుగాని కాడు. సాంఘికంగా అట్టిరచయితలకంటె స్విఫ్ట్ చాలా పై అంతస్థువాడు. అయినప్పటికీ, అతను వారివలెనే, స్వచ్ఛమైన సుపరిచితమైన వాడుక పదాలనే ప్రయోగించాడు. అందరికన్నా ఎక్కువ అవిద్యావంతుడైనవాడు అర్థంచేసుకోలేడని, దేవతాపురుషులు ప్రజ్ఞావత్తములకు చెప్పడానికి ఏమీలేదు" అన్నసిద్ధాంతాన్ని అతడు ఏర్పరచుకొని, అనుసరించేవాడని చెప్తారు. అతడు అన్యదేశ్యశబ్దాలను ద్వేషించేవాడు; అలాంటి శబ్దాలను ప్రవేశపెట్టి భాషను 'కళంకపరిచిన' వారిని దూషించాడు. స్విఫ్ట్ భాషను, అతడి శైలినీగురించి చెప్పినట్లుగా డాక్టర్ జాన్సన్ ఈ విధంగా చెప్పటంగమనించదగ్గది: "ఆతడు (స్విఫ్ట్) ఎప్పుడూ తన్నుతానర్థంచేసుకుంటాడు; అతడి పాఠకులున్నూ అతణ్ణిని అర్థంచేసుకొంటారు. స్విఫ్ట్‌ను చదివేవాడికి అల్పాల్పమైన పూర్వపరిజ్ఞానంచాలును; సాధారణపదాలతోను సామాన్య విషయాలతోను పరిచయం వుంటే పఠితకు చాలు....."టేల్ఆఫ్ టబ్"లోని మహత్తరయోగ్యత దానిగ్రంథకర్తకు అన్నిరకాల సామాన్యపదాలతో నుడికారాలతో వున్న పరిచయంలో కనిపిస్తుంది. పనికత్తెనడిగి ఆమె అభిప్రాయం ప్రకారం ఆపదాన్ని స్వీకరించడమో తిరస్కరించడమో నిర్ణయించుకోవడంఅన్న ప్రయోగాత్మక పరీక్షద్వారా ఒకపదానికిగల అర్థస్పష్టతను కనుగొనేవాడని చెప్తారు.

సుపరిచిత కారణాలవల్ల మా పరిశీలన నింతవరకే పరిమితం చేసుకొన్నా, ఇవిమాత్రమే ఆంగ్లంలోవున్న జనసమ్మిత గ్రంథాలు కావు. ఇప్పుడు

ప్రజాసాహిత్యం అపరిమితమైనది. ప్రామాణిక భాషావ్యాప్తి, అనేక మాండలీ కాల అంతర్ధానం, విద్యాభివృద్ధి, విదేశాల ఇంగ్లీషుభాషా వ్యవసాయం అన్నవి సర్వశక్తులతో ప్రజాసాహిత్యంమీద పనిచేస్తున్నాయి. ప్రజాస్వామిక భావాల ప్రభావం చెప్పనేఅక్కరలేదు. పై తరగతులవారి ప్రత్యేకాధికారం అంతరిస్తున్నది. మధ్యతరగతివారు, తక్కువ తరగతులవారు త్వరత్వరగా ఉన్నత ప్రమాణాలను అందుకుంటున్నారు. అవశ్యంగా ఇంగ్లండులోని సాహిత్యం జనసమ్మితం కాకతప్పదు. కొత్తది, పాత దాని స్థానాన్ని దత్తంచేయడాన్ని ఆరంభించడానికి ముందే చాలామంది ఆంగ్లవిద్యావంతులు సమాజంలోని అట్టడుగు తరగతులలోనుంచి పైకివచ్చారని గుర్తించాలి. బన్యన్ లోహకారుడు; ఫాక్సు చర్మకారుడు; జాన్‌స్టౌ దర్జీవాడు; బర్న్స్ పాలేరు; థామస్ లాడ్జి విత్తనాలమ్మేవాడికొడుకు; హ్యూమిల్లర్ తాపీమేస్త్రీ; డిఫో కసాయివాడి కొడుకు; ఐజాక్ బర్రో, వాల్టన్, సఫేలు లినెన్‌నారవర్తకులు; టిల్లట్సన్ గుడ్డలమ్మేవాడు; విలియం క్యాబెట్ రైతుబిడ్డ. విద్యావంతులందరూ మిల్టన్, సర్ థామస్‌మూరులవంటి పండితులు కారు. ల్యాటిన్ గ్రీకులు రానివారిముందు మాతృభాషను శిక్షామాధ్యమంగా వుపయోగించటంలో సాంప్రదాయిక పండితులు తరుచుగా పరాజితులైనారు. కొందరు పిచ్చిపండితులు కృత్రిమపరిచినా ల్యాటిన్ భాషామయమైన ఆంగ్లభాష ఎప్పుడూ ఆదర్శభాషగా అంగీకరింపబడలేదు. ఇంగ్లీషును అర్థం చేసుకోడానికై ల్యాటిన్ నేర్చుకొమ్మంటే పఠితృలోకం నిరాకరించింది. ఒకప్పుడు కొందరు రచయితలు కావాలని పూర్వప్రయోగాలకై మోజుపడినా, ఆపద్ధతి వెంటనే దూషింపబడ్డది ఈ తాత్కాలిక ప్రమాణదూరకార్యాలను మినహాయిస్తే, నాగరిక సమాజంలో ప్రతిస్త్రీకి, పురుషునికీ అందరికీ పరిచితమైన భాషలో సోదర ప్రజలతో వ్యవహరించడానికిగల జన్మహక్కు పూర్తిగా గుర్తింపబడ్డది: కాదు; అలాచేయటం వక బాధ్యతగా విధింపబడ్డది; అపరిచిత శబ్దప్రయోగం - అది ప్రయోగదూరాంగ్లపదమైనా, పురాతనాంగ్లపదమైనా, సంప్రదాయ బద్ధమైనా, అన్యదేశ్యమైనా - తగు మనిషికి తగదని విధింపబడ్డది,

# ప్రజాసాహిత్యం (3)

ఈ వ్యాసంలోని ఒకటి రెండు భాగాలలో 'ఆంగ్లసాహిత్యం' లో ప్రామాణిక గ్రంథాలుగా పరిగణింపబడుతున్న అతిముఖ్య 'జనసమ్మత' గ్రంథాలలో కొన్నింటికి సంబంధించిన 'ప్రజాసాహిత్యాన్ని' గురించిన మా అభిప్రాయాలను సూచింప ప్రయత్నించాము. ఆ గ్రంథాలలో చాలావాటిని వ్రాసినవాళ్ళు జన్మచేతగాని విద్యచేతగాని ఖ్యాతికెక్కినవారు కారు. సమకాలిక విద్వాంసులు, గ్రంథకర్తనూ అతడి గ్రంథాన్నీ తృణీకరించినా, 'బన్యన్' బైబిలులోని పరిచిత కల్పనలకూ, అంతకన్నా పరిచితమైన ఆంగ్లేయ గ్రామీణ జీవిత సంఘటనలకూ. తన స్వకపోల కల్పిత దృశ్యాలను మేళవించి తనకు పరిచితమైన భాషలో 'యాత్రిక పురోగమన' కథను చెప్పివున్నాడు. "అతడి కల్పనలోని సున్నితత్వం, అతడి సులభ జాతీయ పదగుంఫితాంగ్లభాషలోని శక్తి సౌందర్యాలూ. అనుభూతం కావడానికి. అనుకరింపబడటానికి మధ్య చాలా స్వల్పవ్యవధి మాత్రమే వుండేది." లోహకారుడైన బన్యన్ తన గ్రంథంవల్ల శాశ్వతత్వం పొందాడు. ప్రతివొక్క రచయితయొక్క లక్షణమున్నూ పఠితృ హృదయంలో నాటుకోవడమే అతడి మాటలు వాటికాధారమైన భావాల వైపుకు తిప్పబడవలెనేగాని తమవైపుకు పఠితల నాకర్షించనేరాదు. వ్యవహార మాధ్యమం పూర్తిగా స్వచ్ఛమైనది. క్లార్ లీవీప్రకారం బన్యన్ 'యాత్రిక పురోగమనము,' డిఫో 'రాబిన్సన్ క్రూసో' లనుంచి పరిణమించిన నవల" కనీసం మనం చదువుతున్నప్పుడయినా - ప్రతినిత్యం మన కళ్ళముందు జరిగే విషయాలకూ మనస్నేతుడికిగాని మనకుగాని అనుభవంలో వుండదగిన విషయాలకూ వక పరిచితసంబంధాన్ని కల్పిస్తుంది. ప్రతిదృశ్యాన్ని స్వభావసులభపద్ధతిలో ప్రతిఫలించి ఆ కథలోని వ్యక్తుల సుఖదుఃఖాలు మనస్వంతమైనట్లుగా భావించగలిగేటంతవరకూ ఆదృశ్యమంతా నిజమేనన్న నమ్మకంపొందేటట్లు భ్రమపుట్టించగలినంత సంభవనీయంగా కనిపించేటట్లు చేయటంలోనే నవలయొక్క పరిణతత్వంవున్నది."

వ్యాఖ్యల వివరణలసహాయంతో నిమిత్తంలేకుండానే ప్రతివక్కరూ అర్థంచేసుకోగలందులకై ఇంగ్లీషు బైబిలులోని భాష అప్పుడప్పుడు పునర్విమర్శింపబడి 'ఆధునికం' చేయబడుతున్నది.

విద్వాంసులుకూడా "తత్వశాస్త్రాన్ని మారుమూల కొంపలలోనుంచి, గ్రంథాలయాలలోనుంచి పాఠశాలా కళాశాలలనుంచి బహిర్గతంచేసి క్లబ్బులలో

సభలలో టీబల్లలదగ్గిర కాఫీహోటళ్ళలోనూ వుండేటట్లు చేయాలని" ఆతురత పడుతున్నారు. శాస్త్రజ్ఞులుకూడా - వారిలో చాలామంది దరిద్రాణ సాధారణ ప్రజానీకంలోనుంచి వచ్చినవారు - తమ ఆవిష్కరణలను తమకు పరిచితమైన భాషలోనే ప్రకటిస్తున్నారు. శ్రామికుడు, దేశదిమ్మరిని శాస్త్రజ్ఞానాన్ని ప్రేమించేటట్లు చేయడానికి శాస్త్రాన్ని "గ్రామ్యం" కావించటమిప్పుడు భారతీయ విద్యా ప్రణాళికలో భాగంగా గుర్తించబడ్డది.

ప్రజాస్వామికంలో ప్రతిసంస్థా కాలక్రమాన 'జనసమ్మితం' కావడం పెక్కుకు మొగ్గుతుంది; కులాల వర్గాల ప్రత్యేకాధికారాలు కాలరాచబడతాయి. ప్రజాప్రభుత్వ ప్రజావిద్యావిధానాలు ఏకముఖంగా వుంటాయి; ప్రజావిద్యావిధానం "ప్రజా" సాహిత్య "ప్రజా" తత్వశాస్త్ర, "ప్రజా" శాస్త్రాలపై ఆధారపడ్డది. "ప్రజా" భాష బోధనాభ్యసనాలకు సాధారణ మాధ్యమంగా వుంటుంది.

ఇంగ్లండులో వలెనే ఫ్రాన్సు అమెరికాలలోని గ్రాంథికభాష అక్షరాస్య వ్యవహారంలో వున్నభాషతో సన్నిహితం చేయబడ్డది.

కాని భారతదేశంలో తమకు పరిచితమైన స్వభాషలో జ్ఞానసంపాదన చేయడమన్న ప్రజల జన్మహక్కు పూర్తిగా గుర్తించబడలేదు. ఫలితంగా ప్రాంతీయభాషలు బాగా అభివృద్ధికాలేదు. ప్రజలు చాలాకాలంగా నిరక్షరాస్యులైనారు. బ్రాహ్మణుల ప్రతేకతాభావం యిందుకుబాధ్యత వహిస్తుంది. చదువుకున్నవారు వేదాంత జ్ఞానానికి రూపమిచ్చిన దేవభాష (సంస్కృతాన్ని ఇలా పిలుస్తారు) ఈశ్వరకల్పితమన్నగౌరవభావాన్ని చాలాకాలంగా నిలబెట్టినందువల్ల విద్యార్జనను తమ గుత్తసొమ్ముగా నిలుపుకున్నారు. విశాలహృదయుడైన గౌతమ బుద్ధుడు తన పరిజ్ఞానాన్ని అంతటినీ ప్రజలకు వారి మాతృభాషలో విడమర్చి చెప్పాడు; ఆయనశిష్యులున్నూ బ్రాహ్మణమతగురువులలాగా కాక, తాము సమార్జించిన జ్ఞానాన్ని అంతటినీ ప్రజాభాషలోనే గ్రంథస్థంచేశారు. ఆ బుద్ధుడిచే బోధింపబడిన ఉత్కృష్టసత్యాలను, అందరికీ అర్థమయ్యే భాషలో వ్రాయించిన ప్రకటనలనూ, పదిమంది తరుచుగా చేరే ప్రదేశాలలో తుడవడానికి వీలులేని విధంగా రాళ్ళమీద చెక్కించిన ప్రకటనల ద్వారా బౌద్ధచక్రవర్తి అశోకుడు దేశవ్యాప్తంచేశాడు. బౌద్ధుల జైనుల ఉదారభావాల దయవల్లనే ప్రాంతీయభాషలు సాహిత్యభాషల స్థాయికి పెరిగాయి. అయితే, ఈ ప్రజామతాల పతనాన్ని ప్రాంతీయభాషలను నిర్లక్ష్యంచేయటం అనుగమించింది. ఒకటవ లేక రెండవ శతాబ్దంలో బ్రాహ్మణుడైన గుణాఢ్యుడు పైశాచిక మాండలికలో బృహత్కథను నిర్మించాడు; అది హీనకులాల భాష. కానీ, ఆతడి రచనను సోదరసంస్కృత విద్వాంసులు అసహ్యభావంతో నిరసించాడు.

ఎల్లప్పుడూ బ్రాహ్మణుల మతగ్రంథాలు ప్రజలకు అందని బ్రామిపళ్ళే. మతగ్రంథాన్ని దేశభాషలోకి అనువదించడానికి చేసిన ప్రతిప్రయత్నాన్నీ సనాతనులు మతద్రోహంగా పరిగణించి నిందించారు. బ్రిటిషువాళ్ళ ప్రభావం మన దేశంలో ప్రవేశించడానికి చాలాముందే, మహమ్మదీయుల దక్షిణ దిగ్విజయం కంటెకూడా ముందే, దేవగిరి యాదవరాజుల పరిపాలనలో ధ్యానదేవ్ అనే పవిత్రవ్యక్తి వుండేవాడు. అతణ్ని మహారాష్ట్ర దేశంలో ప్రథమ మహర్షిగా ప్రవక్తగా గౌరవించేవారు. అతడు భగవద్గీతకు దేశభాషలో ప్రసిద్ధవ్యాఖ్యానం వ్రాశాడు. కీర్తిశేషుడు న్యాయమూర్తి రణడే మరాఠీ సాహిత్య నిర్మాతలైన మహారచయిత లనేకుల పేర్ల సుదీర్ఘ పట్టికను వ్రాస్తూ, ఇలా అభిప్రాయపడుతాడు. "ఇది భారతదేశంలోని ఏ యితర భాషలోనూ కనిపించటం కష్టమయ్యే ప్రకాశవంతమైన నామనక్షత్రమాల. ఈ కాణాచిని సంస్కృత కవిత్వానికి ప్రతిబింబంమాత్రమేనని చెప్పి దానివిలువను తగ్గించబూనటం, మరాఠీ సాహిత్యంలోని ఈ విభాగపు స్వభావసిద్ధలక్షణాన్ని ఎరగమని అంగీకరించటమే. సంస్కృతంలోని ప్రాచీన పురాణేతిహాస సాహిత్యంనుంచి తమకు భావావేశాన్ని కూడగట్టుకోవడమే పనిగా పెట్టుకొన్న కవులు యీపట్టికలో ఆరుగురుమాత్రమే. ఒక దృష్టితోచూస్తే యితరకవుల రచనలన్నీ సనాతనత్వానికి నిరంతరాయంగా జరిగిన వ్యతిరేకతలే. చాలామంది కవులూ, సాధువులూ, సంస్కృత పరిజ్ఞానం లేనివారే; వారు పాత ఆదర్శాలమీద తమకున్న కేవల తిరస్కారభావాన్ని దాచుకోదలుచుకోలేదు. వారు పండితుల కోసంకాక, ప్రజాసమూహాలకోసం వ్రాశారు. వారి రచనలలో చాలావాటిలో, పేరుమోసిన బ్రాహ్మణ విద్వత్కవుల కృతులల్లో కొన్నింటిలో వున్నదానికన్నా ఎక్కువ స్వచ్ఛమైన కవిత్వమే వున్నది. నామదేవ్, తుకారామ్, ఏకనాథ్, రామదాస్, మహీపతి, ముకుందరాజ్, మీరాబాయ్, జనాబాయ్, రామజోషి, నిలోబా, పుభాకర్, రంగనాథస్వాములను ఇతరులనూ ప్రస్తావించటం మాత్రమే చాలు. ఆధునిక భారతోదయంతో మహారాష్ట్ర ప్రభుశక్త్యున్మేషాలతో ఆరంభించిన మూడు శతాబ్దాల సంస్కరణకాలంలో నవీన భావాలు అభివృద్ధి పొందినందున, వీరు అవశ్యం వాటికి ప్రాతినిధ్యం వహించిన నవ్యకవులే అవుతున్నారు. "పౌదా"లను "లవణీ"లను రచించినవాళ్ళు పూర్తిగా సంస్కృత సంపర్కంలేని గ్రంథాలువ్రాసినవాళ్లే. మహారాష్ట్రదేశపు మతగురువులలో ఉదారభావాలుగల బ్రాహ్మణులేగాక, మహారథులు, కుంభీలు, దర్జీలు, తోటమాలీలు, కుమ్మరులు, కంసాలులు, అస్పృశ్యులైన మహరులతోబాటు వానిసస్త్రీలు, పశ్చాత్తప్త పతితులుకూడా వున్నారని" మహారాష్ట్ర ప్రభుశక్త్యుదయము" అన్న తన చరిత్రగ్రంథంలో ఈ గ్రంథకర్తే మనకు చెబుతున్నాడు.

"ఈవిధంగా సాంప్రదాయిక సంస్కృతానికీ దేశభాషలకూ మధ్య స్వాధ్యాధికారానికై జరిగిన సంఘర్షణ పాత తగాదాయే; దాని పర్యవసానం చాలాపూర్వకాలంలోనే జీవద్భాషల కనుకూలంగా నిర్ణయింపబడ్డది. పండితులూ సనాతనవాదులూ ఇందుకు విరుద్ధంగా ఏమని ప్రేరేపణలు చేసినా వాళ్ళ ప్రశ్నలకు ఏకైక సమాధానం మాత్రమే వుండగలదు. సంస్కృతాన్ని పక్కకు నెట్టివేసి మహర్షులూ ప్రవక్తలూ తమతమ మాతృభాషా పోషణాభివృద్ధులకై తమ శక్తులన్నీ యేనాడు ధారపోశారో ఆనాడే దానికి సమాధానం వచ్చింది. నవీన దేశభాషల అభివృద్ధి కేవలం ఈ సాధువుల పరిశ్రమల ఫలితమేనని చెప్పవచ్చు. సంస్కరణ విషయంలో పూర్తిగా నిర్దిష్ట ప్రక్రియలను ప్రదర్శించినరాష్ట్రాలే, వాటి ప్రాంతీయ భాషాసాహిత్యాలలో చాలా ఆరోగ్యకరాభివృద్ధులను చూపినవి."

సర్ జార్జి గ్రియర్సన్ అంటాడు- "పూనాకు చుట్టూతా 'మాట్లాడబడుతున్న' భాషల కేవల ప్రామాణికరూపమే దేశీ మరాఠీభాష. మరాఠీకి "మహత్తర జనసమ్మిత"మైన సాహిత్యం విస్తారంగావుంది. కవులు తమదేశపు నిజమైన ప్రాంతీయభాషను, స్వచ్ఛమైన తద్భవాలతో అత్యధికంగా సంఘటితమైన పదజాలాన్నీవాడారు. 13వ శతాబ్దపు చివరిరోజులలో జీవించిన నామదేవ, ధ్యానోబాలు, అతిప్రాచీన లబ్ధసారస్వత నిర్మాతలు. వారు తొలికాలపు వైష్ణవసంస్కర్తలనుంచి భావావేశాలను స్వీకరించారు. 17వ శతాబ్ది ప్రథమార్థంలో రచించిన శివాజీ సమకాలికుడు తుకారాం వారందరిలోనూ సర్వాధికుడు. అతడు వ్రాసిన "అబంగాలు" లేక విఠోబాదేవ గౌరవార్థం విడివిడిగా వ్రాసిన కీర్తనలూ, మహారాష్ట్రదేశంలో "ఇంటిమాటలు." తుకారాం వారసులలో సర్వశ్రేష్ఠ కీర్తిశాలి మోరోపంత్ (1720 క్రీ. శ.) కొన్ని విభిన్నవిషయాల చరిత్రగ్రంథాలుగా వచనంలో వున్నప్పటికీ, భారతదేశంలోని యితర ప్రాంతీయభాషల విషయంలో వలెనే పూర్వకాలపు రచనలలో యించుమించు అన్నీ పద్యగ్రంథాలే.

ఈవిధంగా మరాఠీ సాహిత్యం మహారాష్ట్రుల జీవితాన్ని ప్రతిబింబిస్తున్నది; వారి విద్వాంసులలో అన్నికులాల అన్నివృత్తులవారి ప్రతినిధులున్నారు. పైగా పుస్తకాలలో వ్రాయబడిన మరాఠీభాష వ్యవహారంలోని భాషకు సన్నిహితంగా వుంచబడింది. రణడే చెప్పినట్లు. సాధువులూ ప్రవక్తలూ, ప్రజల కోసమేగాని పండితులకోసం వ్రాయలేదు. వారు ప్రజాకవులు; వారిరచనలు ప్రజా సాహిత్యం.

భారతదేశపు ప్రాంతీయభాషలో హిందీ అధిక సంఖ్యాకులు భాషించేది. తులసీదాసు రామాయణం ఇప్పట్లో 9 కోట్లమందికి వేదగ్రంథం వంటిదంటారు. ఈప్రఖ్యాత గ్రంథానికి తానుచేసిన అనువాదం పీఠికలో గ్రౌజ్ చెప్పినట్లుగా "కోర్టునుంచి పొలంవరకు ఇది అందరి చేతులలోనూ వున్నది. హిందూ సమా

జంలోని ప్రతికులములోనూ - పై తరగతి వారైనా క్రింది తరగతివారైనా, పెద్దలైనా చిన్నలైనా, రాజులైనా పేదలైనా, ఒకేవిధంగా చదువుతున్నారు, వింటున్నారు, ఆనందిస్తున్నారు". దాని ప్రభావం నిరక్షరాస్య ప్రజానీకం మీదనేగాక, అతడి తర్వాతికాలపు వేలాది రచయితలమీద కూడా ప్రసరించింది. ఇదే ప్రజా సాహిత్యానికి వుత్తమోత్త మోదాహరణం.

బంగాళీలూ వారి సాహిత్యమూ యిప్పుడు తెలుగువారి మనస్సులమీద చెప్పుకోదగినంత ప్రభావాన్ని ప్రసరిస్తున్నారు. వంగసాహిత్య సత్వరాభివృద్ధికి చాలామటుకు పాశ్చాత్య సాహిత్య ప్రోత్సాహమే హేతువు. 1924 జనవరినాటి 'కలకత్తారివ్యూ' పత్రికలో వక రచయిత "ఈ పునరుజ్జీవనం భారతీయ మనస్సును తన స్వంతభాషలోని కవితాభండారం వైపుకు చాలా పూర్తిగా మళ్ళించింది, ఆంగ్లభాషతోను, ఆంగ్లభాషద్వారా లభించే ప్రతివక్క విషయంతోనూ కలిగిన ప్రథమ పరిచయావస్థలో అవశ్యకంగావుండే కేవలానుకరణదశ వంగదేశంలో పూర్తి అయిందని చెప్పుతున్నారు. మరో నూతనదశకు చేరటంలో రవీంద్రనాథ ఠాకూర్ మహత్తరశక్తులలో వకటిగా వున్నాడు. అతడు అభిజాతుడు, యువకుడు, వయస్సుకు మించిన జ్ఞానం కలవాడు. వైయక్తిక ప్రవర్తనకు సంబంధించి మహాధాకర్షణశక్తి కలవాడూ అనేక దైవదత్త సృజనాత్మశక్తులను సులభంగా వినియోగిస్తున్నవాడూ అయినందున నవ్యకవిత్వ మహోద్యమాసక్తి కోరిన కథానాయకుడైనా డతడు. సాహిత్యంలో యించుమించు యిదేమోస్తరు వ్యక్తిఅయిన రాబర్ట్‌లూయీ స్టీవెన్సన్‌లాగా అతడు తనచుట్టూ స్తుతిపాఠకులను- ఎవరైనా భక్తులని చెప్పనూవచ్చు- ఆకర్షించి తిప్పుకొనేవాడని చిత్రిస్తారు. పాతకాలపు "స్వచ్ఛభాష"యొక్క నిష్ఠుర గౌరవాలకు కట్టుబడిన సనాతన రీతివాదులకు ఆగ్రహకారణమైన అతని గురించిన పొగడ్త ఒకవిధమైన ఆరాధనగా మారింది. ప్రజాభాషను తన మహాసాహసిక కల్పనలకు సాధనంగా ఎన్నుకొన్నప్పుడు డాంటే ప్రదర్శించిన ధైర్యంవంటి ధైర్యంతో, రవీంద్రనాథ ఠాకుర్ నిరక్షరాస్యులు గూడా గ్రహించగలిగిన పదాలను "వంగదేశంకోసం పాడినాడు; వ్రాసినాడు. 'కొత్తజీవితం అంటే కొత్తరూపాలనీ'. 'కొత్తవూహలను కొత్తమాటలలోనే చెప్పితీరాలనీ" నమ్మి ప్రాచీనతాగౌరవం పొందిన నిర్బంధాలు తన భావవ్యక్తీకృతిని బాధించినప్పుడు వాటిని దూరంగా నెట్టివేశాడు. 'యాస'కంటె ఏమాత్రమూ మెరుగుకానంత వ్యావహారికాన్ని ఉపయోగించినందుకతనిని కొందరు నిందించారు. "ఠాకుర్ ప్రజల కవి."

వంగదేశంలో మనకళ్ళముందే నూతన ప్రజాసాహిత్యావిర్భావాన్ని చూస్తాము. ప్రజలకు వారి మాతృభాషలో తన సందేశాన్నందిస్తున్న నిర్భీకవీర మూర్తి మనకళ్ళముందు కనిపిస్తున్నాడు. ప్రజలకోసం ప్రజల భాషలో వ్రాసిన

ధ్యానదేవుడు మరి యితరులను మహారాష్ట్ర పండితులు పరిహసించినట్లే, వంగదేశపు పండితంమన్యులు అతణ్ని నిరసిస్తారు. ఇంగ్లండులోని సామాన్య ప్రజల ప్రయోజనంకోసం ఆంగ్లభాషలోకి బైబిలును అనువదించ ప్రయత్నించినందుకు టండేలు క్రూరంగా శిక్షింపబడ్డాడు; చివరకాతని గొంతు పిసికి చంపారు. ఆంగ్ల పండితుల అవహేళనల మధ్య బన్యన్ తన అమరగ్రంథాలను వ్రాశాడు. "రవిబాబు" (వంగీయులు తమకవిని ఇలా పిలుస్తారు) వర్డ్సువర్త్‌వలె నిజమైన ప్రజాభాషకు తనభాషను తానెందుకు సన్నిహితం చేయాలని సంకల్పించాడో ప్రజలకు వివరిస్తూ జీవద్భాషా ప్రయోజనాన్ని బహిరంగంగా నిరూపించాడు. "శక్తినైనంతవరకు ప్రజల నిజభాషను అనుకరించి ఉపయోగించటమే" తన లక్ష్యమని ప్రకటించాడు. అదృష్టవశాత్తూ "వంగదేశపు ప్రజాకవి" మహారాష్ట్రీయ నామదేవ్‌లాగా దర్జీవాడుగాని, ఇంగ్లండుదేశపు బన్యన్‌లాగా లోహకారుడుగాని, నిరక్షరాస్యుడైన శ్రామికుడుగాని" కాడు. పండితంమన్యులలో ఏ వక్కడికన్నా బాగానే ఆతడు గొప్ప సంస్కృత విద్వాంసుడు; "గ్రాంథికవంగభాష" ఎరిగినవాడు. అలాంటివ్యక్తి కావాలని సంప్రదాయాన్నీ, ఆచారాన్నీధిక్కరించి ప్రజల జీవద్భాషను తన భావాలకు పూర్తిగా తగిన సాధనమని ఎన్నిక చేశాడంటే, అందుకు చాలాఘట్టివిశ్వాసమే వుండివుండాలి.

ఇదేవిధంగా ప్రజాసాహిత్యపు టవసరాన్ని నొక్కిచెప్పేవారు వంగ పండితులలో ఇతరు లనేకులున్నారు. 1877 అక్టోబర్‌నాటి 'కలకత్తా రివ్యూ'లో ప్రచురింపబడ్డ తన విశిష్టవ్యాసంలో బాబూ శ్యామచరణ గంగూలీ జీవద్భాషా ప్రయోగాన్ని ఘట్టిగా నొక్కిచెప్పాడు; మహాకవి మధుసూదన్ ప్రయోగదూర వ్యాకరణబద్ధ రూపాలను వేటినీ తన నాటకాలలో ఉపయోగించలేదని చెప్తారు.

ఆంగ్లం, మరాఠీ, హిందీ, బెంగాళీల లోని 'ప్రజాసాహిత్య'మని చెప్పబడే వాటినిగురించి మేము సేకరించిన విషయాలనుబట్టి తెలుగులో ఆలాటిసాహిత్యమేమైనా వున్నదేమో తరువాతి భాగంలో మేము పరిశీలించా లనుకుంటున్నాము.

# ఉపోద్ఘాతము *

గ్రంథప్రకాశకులు కోరినందున ఈ గ్రంథమునకు ఉపోద్ఘాతము నేను వ్రాసినాను. కొత్తగ్రంథము చదివేటప్పుడు ప్రతివారికిన్ని ఒకవిధమైన కౌతుకముంటుంది. ఎవరిమట్టుకువారు గ్రంథము చదివి, దానిలోని గుణదోషములు ఏర్పరించుకోవడము పాఠకుల కుచితమయినపని. ఉపోద్ఘాతము వ్రాసేవారు గ్రంథములోని విషయములు సంగ్రహించి ముందుగానే తెలియజేస్తే, చదివేవారి కౌతుకము తగ్గిపోతుంది; గనుక అట్టిపని చేయగూడదని నా అభిప్రాయము. అయితే, కౌతుకభంగము కలుగకుండా గ్రంథము చదువుట కభిలాష పుట్టేటట్టు గ్రంథములోని విశేషములు ఉపోద్ఘాతమందు సూచించవచ్చు ననుకుందాము.

ఈనాటకము నేను సావధానముగా చదివి, నామిత్రుల కొందరిచేత చదివించి, వారితో దానిలోని గుణదోషములు చర్చించినాను. వీరిలో సంస్కృత పండితులు, బి. ఏ. లు, ఎం. ఏ. లు ఉన్నారు. 'లోకోభిన్నరుచిః' అన్నమాట ఈవిషయమందు సార్థకమయినది. నాటకము శాస్త్రవిరుద్ధమని, భాష గ్రామ్యమని, అంతా రసాభాసగా ఉన్నదని మాశాస్త్రిలవారు గ్రంథమును దూషించినారు. "మీశాస్త్రము గ్రంథకర్తగారికి ప్రమాణము కాదయ్యా, ఆయనకులోకము ప్రమాణము" అని ఎం. ఏ. గారు సమాధానము చెప్పినారు. గ్రంథములోని భావములూ, వాటికంటె ఎక్కువగా భాషాను, అనేకమంది వింతగాను, వక్రముగాను, (హేయముగా కూడాను) ఉంటవేమో అని కొందరన్నారు, "ఉంటే ఉండవచ్చును; అది నాకు వింతకాదు. చిన్నప్పటినుండిన్నీ వింటూ ఉన్న పాత ధర్మాలు ఎవరూ ఆచరించకపోయినా, కొత్తపుస్తకములో, వచ్చీరానీ పాతమాటలతో, తెలిసీ తెలియనట్లు, సనాతనధర్మాలని నూరోమారు ఉపన్యసిస్తే, అక్షరాలు కూడబలికి చదువుకొంటూ కాలక్షేపముచేసి పుణ్యము సంపాదించేవారికి ఈనాటకము హేయముగానే ఉంటుంది" అన్నారు మరిఒకరు. శైలి సాపుగాను నాజూకుగాను లేదని మాలో శిల్పివేత్తలు ఆక్షేపించినారు. అందుకు- "వాడుకమాటలతో వాక్యాలు రచించడము కొత్తపద్ధతి; అరంభదశలో ఉన్నది. దానికి అందరూ అంగీకరించిన తోవా తెన్నూ ఇంకా ఏర్పడలేదు. ఎవరితోవ వారిదై ఉన్నది. గ్రాంథికభాషయెడలగల వ్యామోహమువల్ల వాడుకభాషలో రచితమైన గ్రంథాలలో ఉన్నపాటి సుగుణమైనా కనబడదు. కొందరు తెల్లవారికి నల్లవారిలోని

---

* "చలం"గారి చిత్రాంగి నాటకానికి గిడుగువారి పీఠిక.

మంచి కనబడదు. ఏమిచేయను? ఇప్పుడు గ్రంథకర్తగారి ప్రయత్నము వారు ఉద్దేశించినట్లు సాగినదా? లేదా? అది చూడండి; మీఆదర్శము ప్రమాణంగా వారి కృతి విమర్శించ కూడదు;" అని మరిఒకరు సమాధానము చెప్పినారు.

గ్రంథకర్తగారి ఉద్దేశమేమిటి? నవనాగరికు లయిన పాశ్చాత్య విద్వాంసులు కొందరు నవీనమానవధర్మములు లోకానికి నచ్చేటట్టుగా ఉపదేశించడమునకు పాతకట్టుబాట్లవల్ల కలుగుతూ ఉన్నకీడున్ను ప్రవృత్తిలో ప్రత్యక్షమయే లాగున వర్తమానవ్యావహారిక భాషలో నాటకములు నవలలు రచిస్తున్నారు. ఈ నూతనమానవధర్మములు పాశ్చాత్యులలోనే అనేకమందికి నింద్యముగా మొదట తోచినవి. పూర్వాచారపరులు హేయమైన అధర్మము లని ఇప్పటికీ వాటిని దూషిస్తూనే ఉన్నారు. అయితే కొందరు మాత్రము సాహసించి పాతకట్లు తెంపుకొని స్వతంత్రులై ప్రవర్తిస్తూ, అఖిలలోకోపకారమయిన కార్యములుచేసి ఉత్తము లనిపించుకొంటున్నారు. వారిజీవితము కొందరికి ఆదర్శ మవుతున్నది. సామయికధర్మములు దేశకాలోచితములుగా మారుతూ ఉండకపోవడమువల్ల జీవనము దుర్భరమయి, జనులు ధర్మశాస్త్రములను ఉల్లంఘిస్తూనే ఉన్నారు - కొందరు తెగించి బహిరంగముగాను, అనేకమంది రహస్యముగాను. ధర్మాధికారులు రహస్యోల్లంఘనము చూచీచూడనట్లు ఉపేక్షిస్తున్నారు; బహిరంగముగా తమ్మెదిరించినవారిని దండిస్తున్నారు. అధికారులు వివేకము గలవారయితే, ప్రజల సౌఖ్యమునకు ప్రతికూలమయిన నిర్బంధములు తొలగించి, తమ గౌరవమును అధికారమును నిలబెట్టుకొంటున్నారు. అవివేకులయితే, పరాభూతులయి ప్రలయకారకులు అవుతున్నారు. మనుష్యసంఘము పసువులమంద కాదు. గొడ్లవాడు తనయిష్టము చొప్పున పశువులను తోలినట్లు రాజుగాని రాజ్యాధికార్లుగాని నిరంకుశముగా జనులను ఈ కాలములో పాలించలేరు. ఇతరుల స్వేచ్ఛాస్వాతంత్ర్యములకు భంగము కలుగకుండా ప్రతివాడున్ను స్వేచ్ఛాస్వాతంత్ర్యములు కలిగి తనసౌఖ్యమునకు అనుకూలముగా తాను ప్రవర్తించుటకు హక్కుగలదన్న అభిప్రాయము నవనాగరికులలో వ్యాపిస్తున్నది. ఏవ్యవస్థఅయినా సంఘములోనివారికి హితమయ్యేటట్టు సంఘముగాని అధికార్లుగాని మార్చకుంటే, దానిని అతిక్రమించి, ఎవరికి ఏఆచారము ఉచితమని తోస్తే ఆ ఆచారమే అవలంబించవచ్చుననే అభిప్రాయము ఇందులో అంతర్భూత మయినదే. దీనికి దృష్టాంతముగా ఆ దేశములందు వివాహవిధానములో కలుగుతూ ఉన్నమార్పు పేర్కొంటే చాలును. దాంపత్యసిద్ధికి అవశ్యమైనది స్త్రీపురుషుల పరస్పరప్రేమానుబంధమే కాని ఆచార్యుల మంత్రతంత్రయుక్తమైన విధానము కాదని వాదము పుట్టినప్పుడు అక్కడి పెద్దలకుకూడా మొదట వింతగాను వక్రముగాను హేయముగానున్ను తోచినది. అంతకంతకు ఆ వాదము వ్యాపిస్తున్నది. ఇట్లే

అన్ని వ్యవస్థలను గురించిన్ని, అన్ని సంస్థలలోనున్న పాశ్చాత్యుల అభిప్రాయములలో అద్భుతమయిన పరివర్తనము కలుగుతున్నది. ఇందుకు కొత్తనాటకములు కొత్తనవలలు చాలా ఉపచరిస్తున్నవి. అవి జనరంజకమయిన సారస్వతముగా ఎన్నిక గన్నవి. అట్టినాటకములు ప్రస్తుత నాటకమునకు ఆదర్శము. మన హిందూసంఘములోని స్త్రీ పురుషులకు ప్రాచీనాచారముల యెడలగౌరవము ఇంకా అపరిమితముగా ఉన్నది. అస్పృశ్యత విషయమై జరుగుతున్న మహోద్యమమే ఇందుకు ప్రబల నిదర్శనము, విధవావివాహములు, రజస్వలావివాహములు, సంఘమువారు ఇంకా అంగీకరించడము లేదు బ్రహ్మసమాజమువారు బహిష్కృతులు. బ్రాహ్మణకన్య శూద్రుని పెండ్లాడినదని విన సహించగలరా ?- బ్రాహ్మలే కాదు; శూద్రులయినాను? పాశ్చాత్యస్త్రీలవలెనే ఒక స్త్రీ వివాహము అక్కరలేదని పట్టుపడితే స్త్రీలయినా హర్షిస్తారా ? ఇట్టి స్థితిలోఉన్న హిందూసంఘమువారికి ప్రస్తుత నాటకములోని చిత్రాంగిచర్య వింతగాను వక్రముగాను హేయముగాను ఉంటుందని ఆక్షేపిస్తే, అలాగున ఉంటుందని తెలిసే సంఘమునకు సుపరిచితమైన చిత్రాంగిని విచిత్రముగా మార్చి సంఘముయొక్క గౌరవమునకు అర్హురాలుగా ఉండేటట్టు ఈకొత్త నాటకములో మన కొత్తకవిగారు వర్ణించినారు. కొత్తచిత్రాంగి పాతచిత్రాంగి వంటిది కాదు. మునపటి చిత్రాంగి అశోకుని చిన్నభార్యా తిష్యరక్షితవలెనే మనోవల్లభుని మీద పగతీర్చుకున్నది. ఈచిత్రాంగి సహగమనము చేసిన సతి. పరమపతివ్రత అని ఆమెను పుట్టించిన వారి నమ్మకము. అత్యద్భుతమైన ఉదారభావములు గల దానినిగా తర్ఛీతు చేసినారు. పాశ్చాత్య నవనాగరికల దాంపత్యభావములు సంస్కృతప్రబంధముల ద్వారానే కవిగారు ఆమెకు నేర్పినారు. ప్రబంధములలోని ఉద్యానవిహారములు ప్రేమావేశములు శృంగార సల్లాపములు అలుకలు అసాధారణముగా ఉన్నవి. సావిత్రి చిత్రాంగికి ఆదర్శము. సత్యవంతుని విడిచి వేరొకవరుని వెదకిరమ్మని ఉపదేశించిన తండ్రికి సత్యవతి, "వినుము మనోవాక్కాయములన్ మూఁడు దెఱంగులందు నంతఃకరణం బనఘ ప్రధానము గావున, మనమున గైకొన్న భర్తమానం దగునే?" (అరణ్య VII-182) అని జవాబు చెప్పినదిగదా. అట్లే చిత్రాంగి సారంగధరులు ఒకరినొకరు 'మనమునఁ గైకొన్న' దంపతులు. రాజరాజనరేంద్రుడు బ్రాహ్మలచేత చదివించిన మంత్రాలు తనను చిత్రాంగిని భార్యగా చేయగలశక్తి గలవే: అయితే చిత్రాంగికి అతనియెడల అనురాగము పుట్టించవలసి ఉండెను; అని చిత్రాంగి వాదిస్తుంది. అట్టిశక్తి వాటికి లేదు; గనుక వాటివల్ల రాజరాజనరేంద్రునికీ చిత్రాంగికీ దాంపత్యము కలుగలేదట. సారంగధరుడు రాజభక్తి పితృభక్తి గలవాడు; పరుపుప్రతిష్ఠలు కావలసిన వాడు. లోలోపల దుఃఖపడే వాఁడు; గాని, తండ్రిని ఎదిరించేవాడు కాడు. తనకోసమని

తెప్పించిన గుర్రాన్నిగానీ, పీతాంబరముగానీ తండ్రివాడుకొంటే పోనీ అని ఊరుకొన్నట్టు తానుప్రేమించిన చిత్రాంగిని పెళ్లాడితే ఊరుకోవలసినదేనా? చిత్రాంగి ఆలాగున ఊరుకోలేదు. సావిత్రి కోరికకు అశ్వపతి ప్రతిఘటించి ఉంటే, అమెకు కర్తవ్యమేమిటి? యథావిధిగా తండ్రి కన్యాదానము చేయలేదు గనుక పెండ్లి చేసుకోనని సత్యవంతుడు నిరాకరిస్తే, సత్యవతి ఏమి చేయవలెను? సంఘము చేసినవ్యవస్థ చొప్పున వీరు చేయవలసినదేమిటి? ఇట్టి ప్రశ్నలకు మాశాస్త్రిలుగారు శాశ్వత బ్రహ్మచర్యమో అది చేతకాకపోతే ఆత్మహత్యో ఉపదేశించినారు. అంబ అవలంబించిన ప్రతిక్రియ ఒకరు ఉద్ఘాటించినారు. తాం చెప్పిన భర్తృనిర్వచనము మరి ఒకరికి జ్ఞప్తికివచ్చినది. గురుచంద్రులు తారకోసము కయ్యమాడినప్పుడు దేవతలు చేసిన రాజీనామా ఒకరుదహరించినారు. ఇవి విన్నప్పుడు మనపూర్వులు ధర్మశాస్త్రములలోను. పురాణములలోన్ను, దాంపత్య ధర్మమునుగురించి చర్చించినప్పుడు మనకంటె ఎక్కువగా భూతదయ ఉదారబుద్ధిగలిగి ఉండినట్టు నాకుతోచినది, ఇప్పటి మనసంఘములోని చిత్రాంగులున్ను సారంగధరులున్ను దాంపత్యధర్మమునుగురించి చేసే ప్రశ్నలకు తగిన సమాధానము చెప్పుటకు ఇప్పటి పెద్దలు ప్రయత్నిస్తేనేకాని ఇప్పటి రాజరాజుల నిరంకుశాధికారమువల్ల హిందూసంఘమునకు గొప్పవిపత్తు కలుగుతుందని హెచ్చరించుటకు కవిగారు ఈ నాటకము రచించినట్టు నాకు తోస్తున్నది. వారి సద్భావము మెచ్చుకోదగినదికాదా?

ఇకను గ్రంథకర్తగారు వాడిన భాషను గురించి నా అభిప్రాయము చెప్పవలెను. కవిత కళావిశేషము. భాష భావమునకు వాహనము వంటిది, ఒకరి హృదయమందున్న భావము మరిఒకరి హృదయమును చేరవలెను. ఇందుకు భాషారూప మయిన వాహనము భావమునకు ఆవశ్యమయినది. గాలిని పాటించకుండా గాలి మోసుకొనితెచ్చిన పరిమళమును ఆఘ్రాణించి జనులు సంతోషించినట్లు, శబ్దములమీద మనస్సు నుంచనక్కరలేకుండా వాటి అర్థమును గ్రహిస్తారు. రచనాకౌశలము కూడా అట్లే ఉండవలెను కళాభిజ్ఞుల పనివానితనము అద్దానికి వెనకతట్టు కళాయి పూసినట్టు కంటికి కనబడకుండా ఉంటేనే ప్రశంసార్హ మవుతుంది. ఇంగ్లాండులోను, అంతకన్న విశేషముగా ఫ్రాన్సుదేశములోను, చదువు మెరుగులుగల స్త్రీపురుషులందరున్ను చిన్నప్పటి నుండిన్ని తమ సంభాషణము నాజూకుగా ఉండేటట్టు అభ్యాసము చేసుకొంటారు. తమపిల్లలనుకూడా అట్లే తర్ఫీదు చేస్తారు. సంభాషణములోని నాజూకుతనమున్ను సాపున్ను వ్రాతలోకూడా ప్రతిబింబమై మరింత రమణీయముగా వారి రచన ఉండవచ్చును. వారిభాష వారి సంఘములో సామాన్యమైన వ్యావహారిక భాష, అది చిన్నతనములోనే శిష్టజనుల సహవాసమువల్ల అలవడది

గనుక వారికి సాజముగానే ఉంటుంది; గాని తెచ్చిపెట్టుకున్న వేషము వలె ఉండదు. అసాధారణ వ్యత్యాసములు పిల్లల అవ్యక్త భాషణములలో గాని, సుశిక్షితులు కాని పెద్దవారి సంభాషణలో గాని కనబడ్డప్పుడు ఏదో విధముగా దిద్దడము జరుగుతూ ఉంటుంది. ఇట్టినాజూకు భాష వ్యావహారిక భాషగా గల సంఘములో నిరక్షరులు ఒకరైనా లేనప్పుడు అట్టిభాషలో రచించిన గ్రంథాలు-విషయము సుబోధమైతే-అందరూ చదవగలరని వేరే చెప్ప నక్కరలేదు. కళాకౌశలము మాత్రము సంపాదించగలిగితే చాలును, ఎవరైనా గ్రంథము రచించడము దుష్కరము కాదు. గ్రంథములో వాడదగిన భాష, వ్యావహారిక భాషకు భిన్నమైనది వేరే ఒకటి విశేషించి అభ్యసించ నక్కర లేదు. అయితే కళాకౌశలము గల వారిలో 'ప్రతిభాశాలుల రచన సరిఅయిన పాకమునపడి అందరి రుచులకున్నూ సంప్రీతికరముగా ఉంటుంది. అట్టివారే ఎన్నికకు వస్తారు.

ఇప్పటి మనతెలుగుభాష అట్టిదికాదు. మనపూర్వులు సర్వజన సామాన్యమైన సారస్వతములో తమ వ్యావహారిక భాషను ప్రయోగించినా ప్రబంధములలో మాత్రము తద్భిన్నమైన కావ్యభాషను వాడేవారు. ఈ అరవై యేండ్లలో కొన్ని కారణములవల్ల తెలుగువారి వ్యావహారిక భాషయొక్క హక్కులను పోగొట్టి, దానిని తొలగించి, కృతకభాష దానిస్థలము ఆక్రమించుకొన్నది. శిశుబోధలు మొదలుగా బడిపుస్తకములన్నీ ఈభాషలో రచితమవుటవల్ల ఈరెండు తరముల వారున్ను తమ వ్యావహారిక భాషయెడల గౌరవము లేకుండా కృతక భాషయెడల వ్యామోహము గలవారయి పెరిగినారు. అయితే ఈకృతక భాష వాడుకలోలేని సంస్కృతాంధ్రభాషా శబ్దములతో పండితులు ప్రయత్న పూర్వకముగా నిర్మించినదవుటవల్ల పండితులకేసాధ్యము గాని సామాన్యులకు కాదు. పండితులలోనైన నిర్దుష్టముగా ఆభాషలో గ్రంథములు రచించగలవారు అరుదు. నూటికి తొంభై మంది చొప్పున ఓనమాలైనా రానివారు మన తెలుగువారిలో ఉన్నప్పుడు వాడుక మాటలలో వ్రాసిన ఉత్తరమైనా చదువగలవారు అట్టే ఉండరుగదా; కావ్య భాషలో రచించిన గ్రంథము చదివి విమర్శించి గుణదోషములు ఏర్పరచగలవా రెందరుంటారు! ఇట్టి దిక్కుమాలిన స్థితిలో మన దేశభాష ఉన్నప్పుడు పెద్దలు ప్రయత్నించి దానిని ఉద్ధరించవలసి ఉండెను. అందుకు మారుగా దానిని మరింత నిష్ప్రయోజనముగా చేసి రూపుమాపుటకు పందేరింగ్లయి అంధ్ర సాహిత్యపరిషత్తు వారు పంతగించి యావచ్ఛక్తి వినియోగించినారు. అయితే, మరికొందరు దానిప్రయోజనములు అపరచితమయిన పని తెలుసుకొని, నానావిధరచనలయందు ప్రయోగించి, దానియందు అందరికి అనురాగమూ అభిమానమూ కలిగేటట్టు చేస్తున్నారు. కొందరు గ్రంథములు రచిస్తు

న్నారు. సభలలో నాజూకుగా దేశభాషనే అన్ని విషయములున్ను ఉపన్యసించ డము వక్తలకు అలవాటు అవుతూ ఉన్నది; మునుపు ఇంగ్లీషులోనే కాని మాటాడనేరనివారు తేటతెలుగున ఇప్పుడు వాదిస్తున్నారు. భారతి మొద లయిన పత్రికలలో సంపాదకులు పక్షపాతము లేకుండా ఉదారబుద్ధితో నానావిధ రచనలకున్ను అనుకూలమయిన ఏర్పాట్లు చేస్తున్నారు. జంకులేకుండా ఎవరిచేతనైనట్టువారు మాతృభాషలో తమమనోభావములు తెలియజేయుటకు ప్రయత్నిస్తున్నారు. ఆంధ్రసాహిత్య పరిషత్తువారు కూడా గత మాసము (13-10-1924) లో వ్యావహారిక భాషాబహిష్కారము రద్దుచేసి మాతృభాషా గౌరవమున్ను తమగౌరవమున్ను నిలబెట్టుకొన్నారు. ఇకను అందరూ కలిసి దేశభాషారచన వృద్ధిపొందేటట్టు ఉద్యమిస్తే మన తరములో కాకపోయినా మన పిల్లల తరములోనైనా ఇంగ్లీషువలె కాదేమోకాని, గుజరాతీ మరాఠీ భాషలవలె సామాన్యులకు సాధ్యము కావచ్చును. ప్రజలలో విద్య వ్యాపించుటకు తగినసాధన మేర్పడుతుంది; తక్కినవారికంటె మనము భాషా విషయమున చాలా వెనకబడి ఉన్నాము. నిరంతరకృషి అవశ్యము.

ఇట్టి సమయములో విద్యావంతులు వివేకముతో పనిచేస్తూ ఇతరులకు మార్గదర్శులుగా ఉండవలెను. యమనియమములు లేని స్వేచ్ఛాస్వాతంత్ర్యముల వల్ల కీడుకలుగుతుం దన్నమాట నిజమే కాని స్వాతంత్ర్యాభిలాష గలవారికి ఆత్మనిగ్రహ ముండకపోదు. పారతంత్ర్యమువల్ల కలిగిన నిర్బంధము అనుభ వించినవారు కొందరు అది తొలగిన వెంటనే, బడినుంచి వెడలివచ్చిన పిల్లల వలె, కొంచెముసేపు విచ్చలవిడిగా క్రీడించడము సాజమే. దానివల్ల సారస్వత మునకు గాని సంఘమునకుగాని హాని కలుగదు సరేగదా అది వినోదకరముగా ఉంటుంది. ఎవరికి ఏలాగున మాట్లాడడము అలవాటయినదో అలాగుననే పిల్ల లతోనే కాక పెద్దలతోనూ సంభాషించేవారు కొందరుంటారు. వారిభాష కొంద రికి ఇంపుగానే ఉంటుంది. మనకవిగారి సంకల్పము అట్టిది. వారిభాషలో అసా ధారణమైన వ్యత్యాసములు కొన్ని ఉన్నవి; ఉంటేనేమి? వారు వ్రాసినా అలా గుననే వ్రాయకమానరు. కృతకభాషవల్ల కలిగే కీడు అట్టి భాషవల్ల కలగదని నా అభిప్రాయము. సర్వజన సామాన్యమైనభాష ఇంకా ఏర్పడినప్పుడు, ఎవరికి ఎట్లు ఉచితమని తోచునో అట్లు సంభాషించడమునకూ వ్రాయడమునకూ స్వేచ్ఛ ఉండవలెనని అంగీకరించక తప్పదు. ఔచిత్యానౌచిత్య వివేకము ఉచితమైన రచనావిధానము వ్యాపించిన పిమ్మటగాని, ముందుగా ఏర్పడదు. ఏ వ్యవస్థలో నైనా సక్రమముగా ఈలాగుననే పరివర్తనము కలుగుతుంది. కృతకగ్రాంథిక భాష అపరిచితము గనుక, దానిలో రచించిన గ్రంథము లందుగలవైవిధ్యము, వైరుధ్యము, వైషమ్యము, వ్యత్యాసములు, దోషములు వాడుక భాషలో రచిం

చిన గ్రంథములను కనబడేటంత స్పష్టముగా అందరికీ గోచరించవు; గనుక. దానియందుగల వ్యామోహము విడవడము కొందరికి కష్టముగా ఉంటుంది. "ఉత్తిబిసేసేసో కబ్వోభాసాజాహూ ఇసాహోదు" (=కవులయుక్తి విశేషమే కావ్యమగును. భాషఏదైన నదియె కావచ్చుఁ జువ్వె) అన్నాడు రాజశేఖరుడు.

పర్లాకిమిడి
రక్తాక్షి సం॥ కార్తిక బ ౧. } గిడుగు వేంకటరామమూర్తి.

# చిన్నయసూరి నీతిచంద్రిక

## ప్రస్తావన

1920 వ సం. మెట్రిక్యులేషన్, స్కూల్ లీవిజ్ సర్టిఫికిట్ పరీక్షలకు బడులలో తెలుగు పిల్లలచేత చదివించవలసినదని యూనివర్సిటీ వారు నిర్ణయించిన తెలుగు గ్రంథము మాయింట నొకపిల్లవాని చేతిలో ఉండగా చూచి, నేను ఆపుస్తకము తీసికొని, పత్రములు తిరుగవేసినప్పుడు. చిన్నయసూరిగారు రచించిన మిత్రభేద మందులో కనబడినది. నా కంటికి ముందుగా 71 వ పుటలో నున్న "ఆ కాననమందుఁ బింగళకమను సింహము గలదు. అది, పుండరీకముల ఖండించుచు సలుగుల నలుగు లంపడఁజేయుచుఁ గాసరముల మీసరముగాఁ జించుచు" ఇత్యాది వాక్యములు గోచరించినవి. " 'అందు'కు పరముగా అరసు న్నెందుకు? 'కాసరముల మీసరముగాఁ జించుట' ఏమిటి?" అని నాలోనే ననుకొని, ఆ పిల్లవానిని అడిగినాను— "శాస్త్రిలుగారు 'మీసరముగాఁ జించుచు' అన్నమాటలకు ఏ మర్థము చెప్పినారు?" అని. "ఏమని చెప్పినారో మరచి పోయినాను" అన్నాడు వాడు. నేను వెంటనే శబ్దరత్నాకరము తీసి చూడగా, 'మీసరము=దే. విణ శ్రేష్ఠము.' శశాంక. లోని ప్రయోగ మొకటి అందులో కనబడినది. బ్రౌణ్య నిఘంటువులోని ఆరు ప్రయోగములలో ఈ శబ్దమున కిట్లే అర్థమున్నది. మర్నాడు శాస్త్రిలుగారితో నేను ఈ శబ్దమును గురించి మాట్లాడినప్పుడు, దానికి స్పష్టముగా అర్థము తెలియలేదని వారు చెప్పినారు. మరికొన్ని దినము లయినపిమ్మట బరంపురములో శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిలుగారు అధ్యక్షులుగా పండితసభ ఒకటి జరిగినది; అక్కడికి నేను వెళ్లి తెలుగు పండితులను అనేకులను కలుసుకొని, ఈ శబ్దముతో పాటు మిత్రభేదములోని మరి కొన్ని శబ్దములు వారికి చూపించి, వాటి అర్థము మొదలయిన విషయములు పర్యాలోచించగా, ఈ గ్రంథము బడిపిల్లలచేత చదివించిన తెలుగుపండితులు సావధానులయి వాటిని విమర్శించినట్టు నాకు తోచినది. బరంపురమునుండి విజయనగరము వెళ్ళి, అక్కడ అప్పుడు కాలేజి ప్రిన్సిపల్‌గా ఉన్న కీ. శే. శ్రీ. కిడాంబి రామానుజాచార్యుల వారి దర్శనము చేసి నా జిజ్ఞాస వారికి విన్నవించినాను. ఆ విద్యానగరమందున్న పండితుల నందరినీ వారు తమ యింటికి రావించి, నా సంశయములు తీర్చవలసిన దని వారిని కోరినారు, గాని ఎవ్వరును ఇదమిత్థ మని నిశ్చయించ లేదు. "మీసరము"కు అర్థము ఎవరికి తోచినట్లు వారు చెప్పినారు గాని ప్రమాణము

చూపించలేదు; వాక్యములో తప్పులున్నవా? అని నేను సాహసించి అడిగినాను చిన్నయసూరిగారు భాషితము వేదవాక్యము; తప్పనరాదుగదా! విజయనగరమందున్న పండితులలో ఆంధ్రభాషాలక్షణము లెస్సగా తెలిసినవారు శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రులుగారు నాకు మిత్రులు, చన విచ్చిన వారు అవుట చేత వారితో నా సంశయములను గురించి అరమర లేకుండ మాట్లాడినాను. అప్పుడు తమవద్ద నున్న నీతిచంద్రిక (1909 వ సం. 18 వ కూర్పుది) తెచ్చి, దానిలోని పాఠము చూచినారు. యూనివర్సిటీవారు ప్రకటించిన గ్రంథములోని పాఠము వలె లేదు; "కాసరముల మీసరము గాసించుచు" అని ఉన్నది. యూనివర్సిటీవారి గ్రంథము పరిష్కరించిన పండితులు, 'గా' తుమర్థక మనుకొని, దాని పరమందు అరసున్న దూర్చి, రెండవ శబ్దము 'చించు' అని భ్రమపడి, ద్రుతమునకు పరమందు 'చ' కు 'జ' ఆ దేశము రావలెనని ఎరిగినవారు గనుక పూర్వగ్రంథమందున్న పాఠము 'మీసరముగాఁ జించు' అని దిద్ది పరిష్కరించినారు" అని మేము అనుకొన్నాము; ఆశ్చర్యపడ్డాము. మరి కొన్ని వాక్యములు రెండు గ్రంథములలోను చదివి చూడగా మరికొన్ని భేదములు కనబడినవి. సమగ్రముగా రెండు గ్రంథములున్ను చూచి వ్యత్యాసము ఎంత ఉన్నదో తెలుసుకోవలెనని బుద్ధిపుట్టి, శాస్త్రులుగారి పుస్తకము వారిని అడిగి పుచ్చుకొని, ఇంటికి వచ్చినాను. నేనొకపుస్తకము, నాకొమారు డొకపుస్తకము, పట్టుకొని మొదటనుండి కొసవరకు చదివిచూడగా, అపరిమితముగా యూనివర్సిటీవారి గ్రంథములో మార్పులు కనబడినవి. మరికొన్నిదినములకు నామిత్రుడొకడు 1868 వ సం. ముద్రితమైన 5 వ కూర్పు పుస్తక మొకటి నాకు పంపినాడు. దానిలోని గ్రంథమునకున్ను నావద్దనున్న పుస్తకములలోని గ్రంథమునకున్ను గల విపర్యాసము పరిపరివిధములుగా ఊహాపోహములకు కారణమైనది. సూరిగారు రచించిన గ్రంథము, వారు సజీవులయి ఉన్నప్పుడు ముద్రితమయిన మొట్టమొదటి కూర్పులో ఏలాగున ఉన్నదో చూచికాని గ్రంథములలోని విపర్యస్త పాఠములకు మూలము నిరూపించుటకు వల్లపడదని, దానికోసము అన్వేషించగా, అప్పుడు చెన్నపట్టణమందున్న ఆంధ్రసాహిత్యపరిషత్తువారి గ్రంథభాండాగారములో రెండవకూర్పుప్రతి పుస్తక మొకటి దొరికినది, అది 1856 వ సం॥లో ముద్రితమైనది. చిన్నయసూరిగారు 1862 వ సం॥లోనట కాలముచేసినారు; గనుక రెండవకూర్పు గ్రంథము స్వయముగా వారు ప్రకటించినదే. మరి ఒకమారు నేను చెన్నపట్టణము వెళ్ళినప్పుడు దైవయోగముచేత మొదటి కూర్పుదే ఒక పుస్తకము పరిషత్తువారు సంపాదించినారని తెలిసి, వెంటనేవెళ్లి ఆ పుస్తకము చూచినాను. గ్రంథకర్త స్వయముగా ప్రూవులు దిద్ది 1853 వ సం. న అచ్చువేయించి, తప్పొప్పులపట్టిక చేర్చి ప్రకటించినట్లు కనబడినది.

ఇది 80 సంవత్సరములయి బడులలో పిల్లలు చదువుటకు నిర్ణీతమయి నది; రానురాను అనేకమయిన కూర్పులలో అనేకమయిన మార్పులు పొంది ఇప్పుడు విపర్యస్తమయి వికృతరూపముతో ఉన్న ఈ గ్రంథమునకు మూల మింతకాలమునకు లభించినదిగదా అని మిక్కిలి సంతోషించినాను. నేను చెన్న పట్టణమందుండి మూలములోని పాఠములు స్వయముగా ఎత్తి వ్రాసుకొనుటకు అవకాశము చాలనందున, నా మిత్రులు కీ. శే. వంగూరి సుబ్బారావుగారు ఆ పనికి పూనుకొన్నారు. ఆనందముద్రణాలయమువారు ప్రకటించిన నీతిచంద్రిక ప్రతులు రెండుకొని వాటితో పాఠభేదములు వ్రాసి నాకు వారే పంపినారు. వాటిని పట్టి ఇప్పు డీగ్రంథము పరిష్కృతమయి మూలమం దున్నట్టు ముద్రితమైనది. ప్రూఫులు నేను స్వయముగా దిద్దుటకు వీలు లేకపోవుట కారణముగా అనేక స్ఖలితములు సంభవించినవి. కనుక మరిఒకమారు సావధానముగా ఆంధ్ర సాహిత్య పరిషత్తువారివద్ద నున్న పుస్తకములుచూచి, తప్పొప్పుల పట్టిక చేర్చ వలసివచ్చినది. సవిమర్శముగా ఈగ్రంథము చదువదలచినవారు ముందుగా అచ్చుతప్పులు దిద్దవలెను.

సుహృదయులయిన ఆ. సా. పరిషత్ కార్యదర్శుల అనుగ్రహమువల్లను సౌజన్యమువల్లను నాకోరిక ఇన్నాళ్ళకు సఫలమైనది; వారి ఉపకృతి చిరస్మరణీయము.

నీతిచంద్రిక రెండవకూర్పు పుస్తకము ముఖపత్రమం దున్నట్టు, "మదరాసు యూనివర్సిటీయను శాస్త్ర పాఠశాలయందు నాంధ్రంబునకుఁ బ్రధానోపాధ్యాయత్వమువహించు పరవస్తు చిన్నయసూరిచే రచింపఁబడినది." సూరిగారు స్వయముగా ఏడెనిమిది సంవత్సరములు ఆ పాఠశాలలో విద్యార్థులచేత ఈపుస్తకము చదివించి ఆంధ్రభాషాభ్యాసము చేయించినారు. గ్రంథకర్త చనిపోయిన పిమ్మట అచ్చుపడ్డ కూర్పులలో రానురాను మూలగ్రంథము అనేక స్థలములలో విపర్యస్తమయినది — వందలకొలదిగా ఉన్నవి అట్టి విపర్యాసములు. ఏ మార్పులు ఎవరు చేసినారో, ఎందుకు చేసినారో తెలియశక్యముకాదు; యూనివర్సిటీవారుగాని విద్యాశాఖాధికారులుగాని ఈ మార్పులు చేయించినట్టు తోచదు; గాని వారే ఇందుకు ఉత్తరవాదులు కావలెను.

నీతిచంద్రికతోపాటు బాలవ్యాకరణము సూరిగారే విద్యార్థులకోసము రచించినారు. దాని పీఠికలో 'వచన రచనసేయు కౌశలము చిరకాలము బహులక్ష్యములందుఁ బరిశ్రమము చేయక రానేరదు. భాషాసమష్టికి లక్షణగ్రంథము కుదిరిన పక్షమం దంతశ్రమపడఁ బనిలేదు' అని తమ ఉద్దేశము తెలియజేసినారు.

ఈ వ్యాకరణమందు సూరిగారు పూర్వవైయాకరుణుల మతము కొన్ని చోట్ల నిరాకరించినారు. అట్లే సూరిగారి మతము నిరాకరించినవా రున్నారు; వారిలో ఒకరు శ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులుగారు సూరిగారి బాలవ్యాకరణమునకు గుప్తార్థ ప్రకాశిక అని పేరుపెట్టి వ్యాఖ్యాన మొకటి రచించినారు. సూరిగారి 'తప్పులు' ఎత్తి ఉద్ఘాటించినారుగాని వ్యాఖ్యాతలు మూలగ్రంథము దిద్దలేదు; బా. వ్యా. ప్రకీ. సూ. ౧౦ లో 'పూను పొదవుల కాదిలోపం బొకండు వచియించెనది యవిచారమూలకంబు' అని ఉండగా, సూరిగారి మతము తప్పు అని ప్రయోగములు కొన్ని ఉదాహరించి, 'ఇట్టు లసామాన్యకవి ప్రయోగంబు లుండఁగాఁ బరిశీలింపక కవిబ్రహ్మవాక్యాన కెదురాడిన చిన్నయసూరి వచనంబు చిన్న యసూరి వచనంబుగాఁ జెల్లందగు'నని వ్యాఖ్యానమందు అధిక్షేపించి వ్రాసినారు. ఇట్లే సూరిగా రుదాహరించిన శబ్దములలో దోషములు కనబడినప్పుడు, వ్యాఖ్యానములో ఆ తప్పులు ఎత్తి చూపించినారుగాని గ్రంథము దిద్దలేదు. బా. వ్యా. కృద. సూ. ౯ లో 'కఱుచు - కాటు' అనిన్ని సూ. ౨౧ లో 'ఒఱుగు' అనిన్ని సూరిగా రుదాహరించిన శబ్దములను గురించి 'ఉకారమధ్యము ప్రామాదికము' అని దోషము నిరూపించి సాధురూపము చెప్పినారు, గాని గ్రంథము సవరింపలేదు. బా. వ్యా. కృద. ౧౫ లో 'త్రోము - త్రోమకము' అని ఉదాహరణ ముండగా, క్రొవిడి తప్పని చెప్పినారు.

త్రిలింగలక్షణశేషము, శబ్దరత్నాకరము రచించిన శ్రీ. బి. సీతారామాచార్యులవారు సూరిగారితప్పులు (బాలవ్యాకరణములోనివి, నీతి చంద్రికలోనివి) ఎత్తి చూపించినారు. బా. వ్యా. సంజ్ఞా, సూ. ౧౮ లో 'శకటరేఫము తత్సమ తద్భవములందు లేదు' అని సూరిగారు చెప్పినారు; వారి మతమునకు విరుద్ధముగా త్రిలింగలక్షణ శేషమందు సంజ్ఞా. సూ. ౯ లో 'తద్భవములందును నలఘు రేఫము గలదు' అనిన్ని, శబ్దరత్నాకరమందు (చూ. పెఱ) "ఇట్లు పెఱ చెఱ ఇత్యాద్యనేక శబ్దములయందు శకటరేఫము కనఁబడుచుండఁగా చిన్నయసూరి గారు 'శకటరేఫము తత్సమ తద్భవములందు లేదు'అని చెప్పుటకు అభిప్రాయ మేమో తెలిసినదికాదు" అనిన్ని వ్రాసినారు. సూరిగారు నీతిచంద్రికలో 'పెఱలు' ప్రయోగించినారు (చూ. పుట 116, పంక్తి 1; పుట 117, పంక్తి 13). నీతిచంద్రిక మొదటిపుటలోని మంగళమందు మూడవపద్యములో 'ఒక మేల' అనిఉండగా. శబ్దరత్నాకరమందు (చూ. మేను) "మెయి, మై, మే, మేను శబ్దములే గ్రంథములయందు పార్శ్వార్థకములుగా కనఁబడుచున్నవి గాని మేల అని యొకశబ్దము ఆయర్థము కలదిగా కనఁబడలేదు. అట్లుండ నీతిచంద్రికయందు 'ఒకమేల' అని ప్రయోగింపఁబడి ఉన్నది. దానికి ఆకరమేమో తెలిసినదికాదు." అని ఆక్షేపోపన్యాసము ఆచార్యులవారు చేసినారు. బాల. వ్యా.

ప్రకీ; సూ 10 లో చెప్పిన సూరిగారి మతమునుగురించి (చూ. శ. ర. పూను.) "అప్పకవి, పూనె నెగసె....అని సామాన్యముగా విధించిన విధికి చిన్నయ సూరిగారు వ్యవస్థ యేర్పఱుపక 'పూను పొదవుల కాదిలోపం బొకానొకండు వచియించె నది యవిచారమూలకంబు' అని వ్రాయుటకు కారణమేమో తెలిసినది కాదు" అని ఆచార్యులవారి ఆక్షేపము శబ్దరత్నాకరమందున్నది. వదిశబ్దమును గురించి (చూ. శ. ర.) 'ఇది యొకానొకచో మాటునకు పర్యాయముగాఁ బ్రయోగింపఁబడి యున్నది. అది విచార్యము' అని ఆచార్యులవారు వ్రాసిన ఆక్షేపము సూరిగారి ప్రయోగము మనసునం దుంచుకొని వ్రాసినదే. (చూ. నీతి చంద్రిక. పుట 32, పంక్తి 17).

ఇట్లే కీ. శే. శ్రీవేదము వేంకటరాయశాస్త్రిులుగారు తాము రచించిన వ్యాఖ్యానములలో ఇతరులమతము నిరాకరించినట్లె సూరిగారి మతమున్ను నిరాకరించినారు. బా, వ్యా. తత్స. సూ. ౧౬ లో 'భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబు లేదు' అని ఉండగా శాస్త్రిులుగారు తమ నైషధవ్యాఖ్యలో (చూ. పు. 569,) 'సత్తు=ఉన్నట్టిది (శతరంతము, తెనుఁగునకు రాదని బా. వ్యా. తత్స. 87;) ఐనను ఇది వచ్చినది.' అని ఆక్షేపించినారు. బా. వ్యా. క్రి. సూ ౧౧౪ లో, 'ధాతంబున లజీకి లిడంతంబగు నగుధాతు వను ప్రయుక్తంబగు' నని ఉదాహరణసహితము సూరిగారు అనుశాసించి, వర్తమానమున నిషేధము సూచించక పోయినను, శాస్త్రిులుగారు అట్టి నిషేధము సూరిగారు చెప్పినారని భ్రమపడి, కీ. శే. శ్రీ కొక్కొండ వెంకటరత్నముపంతులువారి ఆంధ్రీకృత ప్రసన్నరాఘవము విమర్శించినప్పుడు, దానిలో 'లేఁడయ్యెడున్' అని పంతులుగారు ప్రయోగించినందుకు అతినిష్ఠురముగా ఉపాలంభముచేసినారు. సూరిగారు పరిచూచిన ఆదిపర్వములో నమ్మనేర నయ్యెదను అనే ప్రయోగమున్నదిగాని ఉపేక్షించినారు. (చూ. ఆంధ్రప్రసన్న రాఘవ విమర్శము పుటలు 39, 61. నైషధవ్యాఖ్య. పుట 573). నా "తెలుగు" పత్రికలో ఈ విషయము విమర్శించి ఉన్నాను (చూ. I vii, viii, పుటలు 49-56).

సూరిగారు నీతిచంద్రికలో ప్రయోగించిన శబ్దములకయినను అన్నింటికిని బాలవ్యాకరణములో అనుశాసనము చేసి ఉండనందున, పండితులే భ్రమప్రమాదములకు లోనైనారు. 'వల్ల' శబ్దము రెండుచోట్ల నీతిచంద్రికలో ప్రయుక్తమయి ఉన్నది (చూ. పు. 8, పంక్తి 17, పు. 9, పంక్తి 6). ఈ శబ్దము ఆంధ్రీకృతప్రసన్నరాఘవములో కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు ప్రయోగించినందులకు వేదము వేంకటరాయశాస్త్రిులుగారు సోపహాసముగా ఆక్షేపించినారు. (చూ. ఆంధ్రీకృతప్రసన్నరాఘవవిమర్శము - అనుబంధము పు. 4.) 'తెలుగు' పత్రికలో నేను ఈశబ్దము సాధువని ప్రమాణ

ములు చూపించినాను. దానికి వ్యాకరణమందు అనుశాసనము లేనందున అస్సా ధువని శాస్త్రులవారు ఒకసభలో వాదించినారు. కొన్నివ్యాకరణములలో ఉన్నది గాని లేకపోలేదు; అది నేను చూపించినాను;

ఇట్లే 'అందఱికి' (చూ. పు. 18, పంక్తి 23), 'అందఱి కార్యంబులు, (చూ. పు. 113, పం. 17), 'నలుగురిలో' (చూ. పు. 61, పం. 6) మొదలయిన శబ్దములు సూరిగారు నీతిచంద్రికలో ప్రయోగించినట్టు నిదర్శనముండగా, బాలవ్యాకరణమందు అనుశాసనములు లేనందున సూరిగారికి అవి అనిష్టములని గుప్తార్థప్రకాశికలో వ్యాఖ్యానము చేసినవారు వ్రాసినారు. (చూ పు. 124.) సూరిగారు రచించిన హిందూధర్మశాస్త్రసంగ్రహమందు 'ఇద్దఱి', 'అందఱి', 'ఎందఱి', 'కొందఱి' మొదలయిన శబ్దములు ప్రయోగించినారు. (చూ. రెండవ కూర్పు, పేరాలు 170, 185, 205, 313, 319, 387.)

నేడు వాడుకలో లేని ప్రాచీనాంధ్రభాషలో, చిన్నయసూరిగారు చెప్పినట్లు "వచనరచన సేయుకౌశలము చిరకాలము బహులక్ష్యములందుఁ బరిశ్రమము చేయక రానేరదు." ఆయన ఈభాష మిక్కిలి శ్రమపడి చిరకాలము అభ్యసించి, పెక్కులక్ష్యములు వలుమాఱు సావధానముగాఁ బరిశీలించి, రచనా ప్రణాళిక నిర్ణయించుకొని బాలవ్యాకరణముతో పాటు నీతిచంద్రిక రచించుటకు పూనుకొని, పూర్వార్ధముమాత్రము 1853 వ సం॥న ప్రకటించినారు. పిమ్మట ఏడెనిమిదిసంవత్సరములు సజీవులయి యున్నను ఉత్తరార్ధము, ఏమికారణమో కాని, రచించలేదు. ఆయన ఆంధ్రభాష అభ్యసించినప్పుడు (అనగా నూరేండ్ల క్రిందట) ఆంధ్రభారతముయినను అచ్చుపడలేదు. తాటాకులమీఁద వ్రాసిన పుస్తకములే ఆయన చదివి ఉండవలెను. అట్టి పుస్తకములలోని పాఠములు దోషభూయిష్టములని వాటిని చూచినవా రందఱును ఎఱుగుదురు. ప్రతిపుస్తకములు అనేకములు పరిశీలించి పాఠములు లెస్సగా పర్యాలోచించి సాధువులని తోచిన పాఠములు ఎత్తుకొని, "మూలగ్రంథము" నిరూపించవలెను. ఆంధ్రభారతములోని ఆదిపర్వము ప్రత్యేకించి అచ్చువేయించినవారు చిన్నయసూరిగారే కాబోలును. "కాంచీపురము పచ్చయప్ప మొదలారిగారి విద్యాశాలయందాంధ్రగీర్వాణ ప్రధానోపాధ్యాయులయిన వైయాకరణ రామానుజాచార్యులవారిచేత లేఖక ప్రమాదాది దోషంబులు లేకఁ బరిశోధింపఁబడి, హానరేబిల్ కంపినీవారి యూనివర్సిటీ యను శాస్త్రపాఠశాలయం దాంధ్రోపాధ్యాయులయిన ప. చిన్నయగారిచేత సరిచూడఁబడి, దీనికి శాస్త్రనిబంధనములను మెండుగా నుంచక పై. రామానుజాచార్యులవారిచేతనే భారతవచనంబను పేరుగలదిగాఁ జేయఁబడిన ఛాయావ్యాఖ్యానము * తోడ శాలివాహనశకవర్షంబులలో ౧౭౬౯ వది యగు ప్లవంగనామ సంవత్సరాధిక జ్యేష్ఠశుద్ధ 3 సోమ

వారంబునందు అచ్చువేయఁబడియె" అని ముఖపత్రమునం దున్నది. ఇంతకు పూర్వమే శాలివాహనశకవర్షంబులు ౧౭౭౪ పరీధావినామ సం॥ పుష్య శు ౧ సోమవారమున మొదటి అయిదు పర్వములు 'మా. వెంకటకృష్ణమాచార్యులు, రా. వెంకటకృష్ణశాస్త్రి, తో. విజయరాఘవకవి- ఈ ముువ్వురిచే లేఖకప్రమాద జనితదోషంబులు వారింపఁబడి,' 'దూర్వాసుల జగన్నాధసుబ్బారావు ప్రభృతి సమూహము వారివలన ప్రకటింపఁబడియె.' అని ముఖపత్రమం దున్నది. ఈ రెండు పుస్తకములలోను ప్రాచీనాంధ్రలక్షణమునకు విరుద్ధములయిన శబ్దములు గణనాతీతముగా ఉన్నవి. రాను రాను క్రొత్తకూర్పులలో కొన్ని తొలగి పోయినవి; గాని నేటికైనను నన్నయ తిక్కనల మూలగ్రంథము శుద్ధమయినది కుదిరినట్టు కనబడదు.

చిన్నయ్యగారు సరిచూచి ప్రకటించిన ఆదిపర్వములోని శబ్దములు కొన్ని వారు రచించిన నీతిచంద్రికలో ఉన్నవి. ఆదిపర్వము అధునాతనులు ప్రకటించినప్పుడు వ్రాతపుస్తకములోని పాఠములనుపట్టి మాటిమాటికి సవరించుట దోషము కాదు; గాని చిన్నయసూరిగారి నీతిచంద్రిక అలాగున ఎవరికి తోచినట్లు వారు దిద్దుట అయుక్తము. నన్నయగారు తాటాకులమీద వ్రాసి ఉంచిన భారతము మనకు దొరకలేదు; దానికి ప్రతిపుస్తకములు రానురాను లేఖకుల ప్రమాదమువల్ల కలిగిన తప్పులతో లోకమందున్నని. నన్నయగారు రచించిన ప్రశస్తిగల దానశాసనము రాగిపట్టాలమీద ఉన్నది. దానిని ప్రకటించినవారు గ్రంథము మార్చలేదు. చిన్నయసూరిగారి గ్రంథము స్వయముగా అచ్చొత్తించి వారే ప్రకటించినది. అచ్చుతప్పులు దిద్ది ఒప్పులు ఒక పట్టికలో చేర్చి వారే అచ్చువేయించినారు. ఆయన స్వతంత్రుడు. అట్టిగ్రంథము గ్రంథకర్త కాలముచేసినపిమ్మట అచ్చువేయించినవారు గ్రంథములో తమకు తప్పులుగా తోచిన శబ్దములు తొలగించి దిద్దకూడదు; గ్రంథము ఉన్నదున్నట్లేఉంచి పుట అడుగునగాని పుస్తకము చివరనుగాని వ్యాఖ్యలో దోషనిరూపణముచేయవలెను. అన్ని దేశములలోను పూర్వగ్రంథముల వ్యాఖ్యాతలకు పరిష్కర్తలకు ఇది విహితధర్మము. సంస్కృతకావ్యములకు వ్యాఖ్యానము రచించినవారు కవుల దోషములు వ్యాఖ్యానమందే ఎగ్గించి ఊరకొన్నారుగాని గ్రంథము మార్చలేదు. వ్యాఖ్యాతలు భ్రమప్రమాదములకు లోనుగారా? చిన్నయసూరిగారి నీతిచంద్రికలోని కొన్నిశబ్దములు ప్రాచీనాంధ్రభాషాలక్షణము తెలిసినవారి దృష్టికి తప్పులు కావనను; గాని 1920 వ సం. మెట్రిక్యులేషన్ పరీక్షకు చదువవలసినదిగా నిర్ణయించి, యూనివర్సిటీవారు ప్రకటించిన మిత్రభేదములో పరిష్కర్తచేసిన సవరణలు, 'కాసరముల మీసరముగాఁ జించుచు'—వంటివి కొన్ని ఉన్నవి. మఱికొన్ని నేడు పరిష్కర్తకు తెలిసిన లక్షణజ్ఞానమునుపట్టి

చేసినవి. మాటకు, 'తోఁచు' సబిందుకముగా సర్వత్ర సూరిగారు వ్రాసినారు. ఒకచోట అచ్చులో అరసున్న స్ఖలితమయినందున తప్పొప్పులపట్టికలో సబిందుక మని తెలియచేసినారు. ముద్రితగ్రంథములలో అట్లే ఉన్నది. ఈ పరిష్కర్త ఎవరో నే నెరుగను గాని, నిన్నటివరకు అట్లే వాడి నేడు బిందువు విడిచినవా రున్నారని విన్నాను. అందుకు తగిన ప్రమాణము వారికి నేడు దొరకినది; చిన్నయసూరిగారికి అది దొరకలేదు. వారికి కనబడిన లక్ష్యములను పట్టి వారు లక్షణము కుదుర్చుకొన్నారు. మనకు ఇప్పుడు దొరకిన లక్ష్యములు శుద్ధమైనవని నమ్మి, వాటినిపట్టి వారు కుదిర్చిన లక్షణము దుష్టమని త్యజించి, కొత్త లక్షణము నిరూపించినాము. ఐతే 'తోఁచు' సబిందుకముగా నీతిచంద్రిక లోనేకాక బాలవ్యాకరణమందున్ను ఉన్నదే. (చూ. క్రి. సూ. ౮౫. తోఁపక; సూ. ౧౧౦. తోఁచు; సూ. ౧౧౨, తోఁచు- తోఁతెంచు.) ఇట్లు సూరిగారు చెప్పిన లక్షణముచొప్పున ఈ శబ్దమందు అరసున్న ఉండక తప్పదని నమ్మి ప్రాచీనగ్రంథములు పరిష్కరించినవారు ప్రతిపుస్తకములోను ఈ శబ్దము బిందువుతో లేకున్నను బిందువు చూర్చి అచ్చొత్తించినారు. ఇటుపయిని ప్రాచీనప్రబంధములు పరిష్కరించినప్పుడు ఈ శబ్దము 'తోచు' అని దిద్దుట దోషము కాదు. పండితులు తాము గ్రంథాలు వ్రాసినప్పుడు తోఁచులోని అరసున్న విడుచుట ఉచితమే. కాని సూరిగారి గ్రంథము మార్చుట అయుక్తము.

మరి ఒకమాట. "ఆ దుష్టమృగంబుం గానుపింపుము. దండధరు వీటికి మసలక పుత్తెంచెద" అని సూరిగారు వ్రాసినారు (చూ. పు. 83 పం. 10). యూనివర్సిటీవారు పరిష్కరింపించి ప్రకటించిన గ్రంథమందు 'గానుపింపుము' -'గానిపింపుము'గా మారినది. 'పుత్తెంచెద' మాత్రము అట్లే ఉన్నది, 'కాను పించు' తప్పనుటకు కారణము కనబడదు. నీతిచంద్రికలో ఆరుచోట్ల 'కాను పించు' ప్రయుక్తమైఉన్నది (చూ. పు. 66, పం. 3,79, పం. 11; పు. 83; పం. 10, 13; పు. 127, పం. 14.) ఇట్లే 'వినుపించు', 'నిగుడించు', 'పిలుపించు'; 'ఎఱుంగించు' అని ఉకారముతో సూరిగారికి సాధువులుగా తోచినందున ప్రయోగించినారు; ఆదిపర్వమందు నన్నయగారి భాషితములుగాను చూపించినారు. తాటాకుపుస్తకములు చూచినవారు ఇవి తప్పులుగా ఎంచరు. హరివంశమందు 'పగుల్చి' లోని 'గు' యతిస్థానమందున్నదని ఎరిగినవారి దృష్టికి ఈశబ్దములు సాధువులే. అయితే మీదనుదాహరించిన వాక్యమందు 'పుత్తెంచెద' ప్రకరణమునుబట్టి అసాధువు. సూరిగారు ఆదిపర్వమందు (చూ. ఆ vi 48 వ.) 'ధృతరాష్ట్రునకుం జెప్పి పుత్తెంచిన' అని ఇచ్చిన పాఠము ఆనందముద్రణమందు 'చెప్పిపుచ్చిన'గా సవరణ అయినది (చూ. ఆ.

vi. 167) సూరిగారికి అది తప్పని తెలియక ఆదిపర్వమునందు అట్లే ఉంచినారు; నీతిచంద్రికలోను ప్రయోగించినారు.

ఇట్లు తప్పులు ఒప్పులుగాను ఒప్పులు తప్పులుగాను వ్యత్యస్తమయి ప్రాచీనాంధ్రగ్రంథములు 'పరిష్కృత' మయినవి. చిన్నయసూరిగారు నీతిచంద్రికకున్ను అట్టి గతిపట్టినది. 'యుద్యన్మేషమధ్యంబు' (చూ. పుట. 70, పంక్తి 11) అని సూరిగారు ప్రయోగించిన అపశబ్దము అన్నికూర్పులలోనున్ను అట్టే నిలిచిఉన్నది; యూనివర్సిటీవారి గ్రంథమందైనను మారలేదు. 'సహజధార్మికుఁడు' (చూ. పు. 25, పం. 6) సాధువుగా ప్రక్రియ పండితులు చెప్పగలరేమో కాని (నిర్ణయసాగర) సంస్కృతగ్రంథమందు 'మంథరాభిధానః కచ్ఛపో ధార్మికః ప్రతివసతి' అని ఉన్నది. (మరిన్ని చూ. హితోపదేశః, పునాపురే ఉపాఖ్య వాలాచార్యాత్మజ వాసుదేవా చార్యేణ సంశోధ్య పాఠాన్తరైః సంయోజ్య....ప్రకాశితః, పత్ర - 25) కాని తెలుగక్షరములతో ముద్రించిన ఒక గ్రంథమందు 'సహజధార్మికః' అని ఉన్నది. సాధువా ?

ఇట్లే సూరిగారు ప్రయోగించిన సంస్కృత శబ్దములు, తెలుగుశబ్దములు సాధువులో అసాధువులో నిర్ణయించవలసినవి అనేకముగా ఉన్నవి. శబ్దములలో అరసున్న, శకట రేఫము, క్రావడి, అచ్చులు, హల్లులు; సంధి, ఆదేశములు, ఆగమములు,ఔపవిభక్తికములు,ద్రుతప్రకృతికములు,కళలు,తిజన్తములు, సుబన్తములు, ణిజర్థకములు, కారకము - ఇట్టివాటిలో సూరిగారి గ్రంథమందే విపర్యాసములున్నవి; వ్యవస్థ ఏర్పడలేదు. సూరిగారి రచన అనుకరించినవారు సూరిగారి వలెనే, ఒకచోట 'వాలెను' ఇంకొకచోట 'వ్రాలెను' అని, ఒకచోట 'అనుభవింపక తీఱునా', ఇంకొకచోట 'అనుభవింప తీరదు' అని, ఒకచోట 'నడుచు' ఇంకొకచోట 'నడచు' అని, ఒకచోట 'ప్రొద్దుపుచ్చు' మరిఒకచోట 'పొద్దుఁబుచ్చు' ఇంకొకచోట 'ప్రొద్దువోయె' అని, ఒకచోట 'సుగ్గి' ఇంకొకచోట 'సురింగి' అని, ఒకచోట 'ఎక్కడనుంచి' ఇంకొకచోట 'ఎక్కడినుండి అని, ఒకచోట 'మ్రాఁకు మీఁద' ఇంకొకచోట 'మ్రాని మీఁద' అని వ్రాయుట పరిపాటి అయినది. కొన్నిశబ్దములు ద్విరూపములుగాను బహురూపములుగాను ఉన్నవని విద్యార్థులకు బోధించుటకు 'నమ్మిగ', 'నమ్మకము'; 'తొడుకొని', 'తోడుకొని'; ప్రయోగించినట్లు భావించవలెను. అయితే, అనుశాసించని రూపాంతరము సాధువు అవునోకాదో నేటి లౌకికవ్యవహారమునుపట్టి నిర్ణయించగూడదు గదా. అందుకు ప్రాచీనకవిప్రయోగమే లక్ష్యముగా ఉండవలెను అని నియమమున్నప్పుడు విద్యార్థుల సంశయములు తీరవు. శబ్దరత్నాకరమందు 'చెఱచు' శబ్దమును గురించి 'ఇ ట్లకారమధ్యముగా ప్రయోగము కొందఱమతము' అని, 'చెఱుచు' శబ్దమును గురించి 'ఇ ట్లుకారమధ్యముగా ప్రయోగము కొందఱ

మతము' అని తగిన ప్రమాణము దొరకనప్పుడు వ్యవస్థ యేర్పర్చక కోశ నిర్మాతలు ఊరకున్నారు. వారు కొన్నిశబ్దములను గురించి చేసిన నిర్ణయము హాస్యాస్పదముగాను అగ్రాహ్యముగాను ఉన్నది. (చూ. ఎగచు, ఎగుచు) "లోఁగిలి. ద్వ. వి. లోఁగలియొక్క రూపాంతరము. (వాడుకయం దిట్లు కనఁబడుచున్నది కాని దీనికిఁ దగిన ప్రయోగము చిక్కినది కాదు)" అని, "లోఁగలి. ద్వ.వి. (లోను + కలను) గృహాంతర్భాగము. చ.... వేశ్యలిండ్లలోఁగటను... భల్లా 3 ఆ" అని, ఇట్లు ఆధునికుడయిన వాలేశ్వరకవి రచించిన భల్లాణచరిత్రమందు 'లోఁగట'ను అని 'గ' యతిస్థాన మందున్నందున 'లోఁగలి' శబ్దమ్ము సాధువుగా గ్రహించి, వ్యాకరణప్రక్రియ కల్పించి 'లోఁగిలి' శబ్దము వ్యుత్పత్తిలేని పామరభాషితముగా నిశ్చయించినారు. 'గి' యతిస్థానమందుంచి పూర్వకవులు ఎవరయినను ప్రయోగించినట్లు కనఁబడినయెడల, 'లోఁగిలి' శబ్దము సాధువే అని అంగీకరించక తప్పదు; కనఁబడని యెడల అది అధోగతి పాలుగాక తప్పదు; వాలేశ్వరుని 'లోఁగలి' శబ్దమే ప్రామాణికులకు గ్రాహ్యము. ఐతే హరివంశము పూర్వభాగములో 6 వ ఆశ్వాసమందు 141 వ పద్యములో సీ. పా. "అంతఁ బోవక యవి యా గోపముఖ్యు లోఁగిటిలోని కుటికి యక్లేశలీల-" అని నాకు ఒక ప్రయోగము కనబడినది. దీనినిపట్టి శబ్దరత్నాకరకారుని అనుశాసనము తప్పుకాక తప్పదు; చిన్నయసూరిగారి ఆదిపర్వములో 2 వ ఆశ్వాసమందు 'కార్చిచ్చువంటిశాపంబు' అని పాఠమున్నందున గాబోలును, వంటి శబ్దము నన్నయభాషలోనిదని నమ్మి, త్రిలింగలక్షణశేషములో (చూ.సమాస.సూ.४३) అనుశాసనముచేసి, ఈపాఠమే ప్రమాణముగా ఆచార్యులవారు ఉదాహరించినారు. ఇది అపపాఠము; ప్రాచీనాంధ్రమందు 'వంటి' కనబడలేదు. సూరిగారు కాలముచేసిన తర్వాత అచ్చుపడ్డ భారతములోనికి 'కార్చిచ్చు నట్టిశాపంబు' అని పాఠము వచ్చినది; అదే అరుతాటాకు పుస్తకములలో నాకు కనబడినది; సాధువు. బాలవ్యాకరణమందు (క్రి.సూ. ౨౬, ౨౮) ఎడు త వర్ణంబులు ఆశీరర్థకములని అనుశాసించుటచేత, ఇప్పుడచ్చుపడ్డ ప్రాచీనాంధ్రగ్రంథములన్నిటిలోను "నీకు మేలు కలిగెడు మనియె" ఇత్యాదిప్రయోగములే కనబడునుగాని తాటాకు పుస్తకములో ఉన్న "ఎడ" వర్ణసహితమైన శబ్దములు కనబడవు, యతిస్థానమందు 'డు' వర్ణముగల ప్రయోగము ఎక్కడనూ ఎవరికిన్నీ కనబడలేదు. సూరిగారు అనుశాసనమే దానికి ఆధారము. అయితే, నిజాము రాష్ట్రమందు ఓరుగంటి జిల్లాలోని ఉపర్పల్లిలో ఒక దేవాలయము స్తంభము మీద నాలుగు ప్రక్కలను చెక్కిఉన్న శిలాశాసనములో అనేక పద్యములున్నవి వాటిలో ఒకటి ఇట్లున్నది. "హరి దళ్వుండజాచ్యుత శంకరమూర్తిద్రయీమయుండు గమలాప్తుండు భాస్కరుండు

దయం గాచుచుండెడం గరుణారసపూర్ణ హృదయుం గాటయుం బ్రీతిని."
ఈశాసనము కాకతెరాజు గణపతిదేవుని కాలమునాటిది; 1236 వ సం. జనవరి తే 21 ది గురువారమున చెక్కినది. ఇట్టిశాసనములలోని భాష గ్రంథకర్త రచించినట్టి 'శిలాక్షరములుగా' నిలిచి ఉన్నది; గనుక దీనిలోని ప్రయోగములు పరమప్రమాణములుగా అంగీకరింపక తప్పదు; కేతనకూడా ఆంధ్రభాషా భూషణమందు 'దీవన కెడమయుం గాత ము' అని లక్షణము చెప్పినాడు. వ్రాత పుస్తకములలో అట్లున్నది. అచ్చులో మారిపోయినది.

గ్రాంథికాంధ్రభాష అనగా ప్రాచీనాంధ్రకావ్యములలోని భాష. కావ్యము లలో కవులు వాడినభాష పరిమితము; దేశభాష సర్వాంగ సంపన్నము; అపరి మితము. ప్రాంచీనాంధ్రగ్రంథములు ఎన్నో నశించినవి; ఉన్నవి ప్రతిపుస్త కములు; లేఖకప్రమాదజనితదోష భూయిష్ఠములు, అవిఅన్నియు అచ్చుపడలేదు; అచ్చుపడ్డవి అయినను శుద్ధములు కావు; పరిష్కర్తల భ్రమప్రమాదములు కార ణముగా అనేక స్థలములలో (ముఖ్యముగా వివాదాస్పదములయిన ప్రయోగము లలో) మూలగ్రంథము విపర్యస్తమయినది. లక్షణము సంపూర్ణముగా లేదు; ఉన్నది వివిధముగా ఉన్నది. కోశములలో లోపములు దోషములు మెండుగా ఉన్నవి. ఇట్టి అవస్థపొంది ఉన్న గ్రాంథికాంధ్రభాషలో "వచనరచన సేయు కౌశలము" బడిపిల్లలు అలవర్చు కొనుటకు సాధనముగాను ఆదర్శముగాను చిన్నయసూరిగారు రచించిన నీతిచంద్రిక 80 సంవత్సరములయి నిరంతర ముగా బడులలో చదివించవలసినదని యూనివర్సిటీ వారిచేతను గవర్నమెంటు వారి విద్యాధికారులచేతను నిర్ణీతమయి ఉన్నప్పుడు శబ్దలక్షణము, శబ్దార్థము, శబ్దప్రయోగము నిస్సంశయముగా బోధించగల విపుల వ్యాఖ్యానము పుట్టవలసి యుండెను. ప్రబంధములు బోధించినట్లె నీతిచంద్రికకు పదచ్ఛేదముచేసి ప్రతి పదార్థము చెప్పుట బడులలో వాడుకగా ఉన్నది; అవి చాలదు. ఈగ్రంథమందు సందేహాస్పదములయినవి, వివాదాస్పదములయినవి ప్రయోగములు అనేకము లున్నవి. కనుక సవిమర్శముగా పిల్లలచేత చదివించవలసినది. అట్టి చదువు వల్లనే పిల్లలకు ప్రాచీనాంధ్ర భాషాజ్ఞానము కలుగ గలదు. 'వ్యవస్థ' అనగా నేమో అది యెట్లు యేర్పర్చవలెనో విద్యార్థులకు పట్టుపడేటట్లు చేయవలెను. వ్యవస్థ లేనప్పుడు భాషావ్యవహారమే కాదు. ఏ వ్యవహార మయినను సాగదు. ఎవరికయినను మతిభ్రమ కలుగక మానదు. అవ్యవస్థితచిత్తస్య ప్రసాదోఽపి భయంకరః.

ఇట్టి వ్యాఖ్యానములు రచించుటకు సమర్థులు యూనివర్సిటీవారు నియో గించిన పండితులే. 'మదరాసు యూనివర్సిటీ యను శాస్త్రపాఠశాలయందు నాంధ్రంబునకుం బ్రధానోపాధ్యాయత్వము వహించు పరవస్తు చిన్నయసూరిచే

1853 వ సం॥న రచియింపబడిన' ఈ గ్రంథమునకు వ్యాఖ్యానము చేయుటకు 'మదరాసు యూనివర్శిటీ ప్రాచ్యపరిశోధనాలయమందున్న తెలుఁగు రీడరు'పూను కొనుట సమంజసము, సంగతము అని లోకము అంగీకరించక మానదు. ఆంధ్రవిశ్వవిద్యాలయమువా రయినను తమ పండితులచేత ఈపని చేయించుట యుక్తమే. ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలయిన దేశములలో ఇట్టి గ్రంథములకు యూనివర్సిటీల పండితబృందములే వ్యాఖ్యానములు రచించుట సాంప్రదాయిక మయి ఉన్నది. ఇట్లు విన్నవింప సాహసించినందుకు పండితులు నన్ను క్షమింతురుగాక, అని వినయపూర్వకముగా వేడుకొంటున్నాను.

వ్యావహారిక భాష తల్లివలె నాకు ప్రేమపాత్రము; ప్రాచీనాంధ్రభాష మూలపుటమ్మవలె నాకు పూజ్యురాలు.

పర్లాకిమిడి
1932 వ సం. జూలై తే 20 ది.

గిడుగు వేంకటరామమూర్తి.

141

# పీఠిక

శ్రీ ఉమమళ్ళ కామేశ్వరరావు పంతులుగారు "భారతి" 13 వ సంపుట ములో "వ్యావహారిక రచనకు కొన్ని నియమాలు" అనే శీర్షికతో రెండు వ్యాసాలు ప్రకటించినారు. అవే ఇప్పుడు కొంచెము సవరించి పుస్తకముగా అచ్చువేయించినారు. తాము ఏ ఉద్దేశముతో, ఈ గ్రంథము రచించినారో 'ఉపక్రమణిక' లో తెలియజేసినారు. వ్యావహారికభాషలో వ్రాస్తున్న కొందరి వ్రాతలలో "ఏకత" లేదనిన్ని, "ఏకత" లేకపోవడము ఆ భాషలో గొప్ప దోషమనిన్ని. ఆ దోషము తొలగించడమునకు కొన్ని నియమాలు చేయవలసి ఉన్నదనిన్ని కొందరు అన్నమాటలు వీరికి నచ్చినవి. వీరికి వ్యావహారిక భాష మీద అభిమానము మెండుగా ఉన్నది. ఆ భాషలో రచితమయిన కథలూ, నవ లలూ, నాటకాలూ, వ్యాసాలూ- అన్నీ వీరు చదువుతారు. ఆ భాషలోనే స్వయంగా నాటకాలూ కథలూ వ్యాసాలు వ్రాస్తున్నారు. "ఏకత" కలిగేలాగున రచన చేయవలెనని సంకల్పించి, అభ్యసిస్తున్నట్టు కనబడుతున్నది. "ఏకత"కు ఆదర్శముగా ప్రవీణులయిన కొందరి రచనలు వీరు స్వీకరించి, వాటిలో తమకు కనబడ్డ "నియమాలు" ప్రమాణముగా గ్రహించి ఏకతలేని రచనలలో లోపాలుగాను 'దోషాలు'గా తమకు తోచినవి దిద్దడమునకు ప్రయత్నించినారు. కొందర కిది అతి సాహసమువలె తోచునేమో; గాని చిత్తశుద్ధితో చేసినపని అని గ్రంథమంతా చదివేవారికి తెలియకపోదు. తమవలె వ్యావహారిక భాషా రచన అభ్యసిస్తూ ఉన్నవారితో సమాలోచన చేయ నుద్దేశించినట్లు కామేశ్వర రావుగారు తమ అభిప్రాయములు వ్యక్తపర్చినారు; ఆరంభదశలో ఉన్నవారు ఇవి ఉపదేశములుగా అంగీకరించవలెనని వీరి కోరిక అయిఉంటుంది. "ఇది మనము వాడవద్దు; దీనివల్ల 'ఏకత'కు భంగము కలుగుతుంది; అది మనము వాడవలెను; దానివల్ల 'ఏకత' కలుగుతుంది." అని తమ బుద్ధికి తోచినట్లు శబ్దముల ఔచిత్యము నిరూపించినారు; గాని "ఇది అసాధువు"."ఇది సాధువు" అని నిషేధించలేదు. వ్యావహారికభాషకు ఇట్టి అనుశాసనము ఆవశ్యకమని కొందరంటున్నారని నే నెరుగుదును. భారతి 11 వ సంపుటములో నామిత్రులు శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రులుగారు "ఆంధ్రభాష"ను గురించి రెండు వ్యాసములు రచించి ప్రకటించినారు. ఇంగ్లీషు భాషలో ఉన్నట్టు 'ప్రమాణము' (Standard) తెలుగు భాషకు కూడా నియమించవలసి ఉన్న దని శాస్త్రులుగారు వాటిలో నిరూపించినారు. వారు చేసిన చర్చలోని ముఖ్యాం శము లివి:—

"భాషలో ఏకత కావలెను; అట్టి ఏకత కావ్యభాషలో కలదు" అన్నారు గ్రాంథికవాదులు. * "భాషకు జీవము కావలెను; అట్టి జీవము వ్యావహారిక భాషలో కలదు" అన్నారు వ్యావహారిక భాషావాదులు. భాషితిలోని రీతులలో ఏకతలేని లోపముకనబడ్డది. మధ్యమార్గమొకటి యవసరమైనట్లు కనబడినది. జీవము, ఏకత ఈ రెండును కలసి యుండవలెను.

ఆధునికభాషలో మాధుర్యము కలదుగాని ఏకతలేదు. ఏకత కలిగించినచో వ్యావహారికభాష రాజభాష (King's Telugu) కాగలదు. ఈ యుద్దేశముతో భాషను విభజింపగా అది నాలుగు తరగతులుగా కనబడినది.

(1) 1. Archaic–ఉ. నేను చేయవలతును. నాకు చేయవలయును
2 Classical–ఉ. నేను చేయవలయును
3. Standard–ఉ. నేను చేయవలెను
4. Dialectal–ఉ. నేను చేయాలి.—చేయాలె.— చేయాల మొ.

(2) 1. Archaic–వలవదు
2. Classical–వలదు

---

* ఏకత ఉన్నా జీవం ఉండదు. ఏకత కల్పితము, వాస్తవికంకాదు.

In many countries men of letters, poets or story tellers formed a caste apart, with tradition, customs, and privileges of their own, their language therefore had all the characterstics of a special language, necessitating imitation and imposing an apprenticeship to the craft It might even happen that the role of the poet was partly religious and certain literary languages are, at the same time, religious languages. In Greece the peculiarities of the great lyric poems were no doubt due to the fact that they were based on such religious languages. Even apart from all religious influences there arose in many countries literary languages which were limited to certain very definite uses. The language of the Greek epic is a type of such literary languages which took shape in the hands of all the poets and became fixed once for all. Whoever in Greece sought inspiration from the Epic Muse used a language corresponding in no way to any spoken tongue.

(Vendreys)

3. Standard—వద్దు
4. Dialectal—ఒద్దు

Archaic, Classical ప్రాచీనాంధ్రము; Standard వర్తమానాంధ్రము; Dialect అభినవాంధ్రము. కడపటిది వ్యాపిస్తున్నది. కొంత గట్టుకట్టుట అవసరము అని శాస్త్రిలుగారికి తోచినది.

ఈ గట్టు నన్ను కట్టమన్నారు. అది నాకేకాదు ఎవరికైనా అసాధ్యమే. ఇంగ్లీషుభాష మారి పాడైపోతూ ఉన్నదని పూర్వపు భాషాతత్వము తెలియని కాలములో, ప్రతి తరమువారు తమకాలపు భాషనుగురించి మొర్రపెట్టేవారు. జాన్సన్ తన కాలపు భాష మారకుండా కట్టుకట్టి నిఘంటువులో బంధించడానికి ప్రయత్నించినాడు. నిఘంటువు పూర్తిగా రచించేసరికి అతనిభ్రమ వదలిపోయినది. జీవద్భాషను మారకుండా బంధించడం అసాధ్యమని ప్రకటించినాడు. *

భాషకు మారేస్వభావము ఉన్నది గనుకనే మనుష్యుని జ్ఞానములోను భావములలోను కలిగే వికాసమును బోధించే సాధనముగా ఉపచరిస్తున్నది. కొత్తమాటలు పాతప్రకృతులలో నుండి ఆవిర్భవిస్తూ ఉంటవి.

పార్వతీశ్వరశాస్త్రులుగారు చేసిన భాషావిభజన కాక, ఇంగ్లీషులో Poetic language అని, the language of prose అని, the language of higher, imaginative prose అని, liturgical language అని

* Dr. Johnson in the plan of his dictionary issued in 1747, declared that one end of his undertaking was, 'to fix the English language'. But a man could not compile a vocabulary of the tongue without learning something of the nature of speech. By the time he finished his work, he had been cured of this particular error. It seemed impossible for most men of the past-the impossibility continues for most men of the present-to comprehened the elementary principle that in order to have a language become fixed, it is first necessary that those who speak it should become dead-dead, at least intellectually, if not physically. Then indeed it can undergo no change for there is no one to change it. But so long as it lives in the mouths of men and not merely in the pages of books, it must constantly...

(Lounsbury. The standard of usage.)

కూడా కొందరు భాష విభజించి ఆయా భాగములలో ఎట్టి శబ్దములలో ప్రయుక్తమవుతూ ఉన్నదో చూపిస్తారు.

శాస్త్రులుగారు తెలుగుభాషను అనుశాసించవలసినదని నన్ను నియోగించినారు. గాని ఆ పని నేను పూనుకోగలనా? శాస్త్రులుగారివంటివారు నూరుగురు సహాయులు అన్నిమండలములలోనూ పదిసంవత్సరాలు శ్రద్ధతో పనిచేస్తే కొంతమట్టుకు ఆంధ్రభాష అనుశాసించవచ్చును. సంస్కృతమనే భాషకు అనుశాసనము చేసినవారు పాణినికి పూర్వులు అనేకులున్నారు. వారుచేసిన పని తాను స్వీకరించి కొంతపని పాణిని చేస్తే, కాత్యాయనుడు మొదలయినవారు, దానిలో పదివేల "లోపాలు""దోషాలు,"కనిపెట్టి దిద్దినారు. ఇంకా లోపాలుంటే పతంజలిమహర్షి మరికొన్ని సవరణలు చేసినారు. ఈ వ్యాకరణములో ధాతుపాఠాలు, గణపాఠాలు, ఉన్నవి. ఎన్నో భాష్యాలు, వాటికి టీకలు ఉన్నవి. ఇన్ని ఉన్నా, గొప్ప వైయాకరణులు తగవులాడుతూనే ఉంటారు. సంస్కృతము వాడుకభాషగా ఉన్నప్పుడే దానికి అనుశాసనము పుట్టినది. అనుశాసించినవారు, ప్రమాణముగా స్వీకరించినది గ్రంథస్థభాషకాదు, శిష్టవ్యవహారమందుండినభాష. ఆభాషకు పేరు "లౌకికభాష"; గ్రంథస్థభాషకు "వైదికభాష" అనిపేరు అనుశాసనములో ఉన్నది. ఏశబ్దము ఏలాగున శిష్టులు ఉచ్చరిస్తారో ఆలాగుననే ఎత్తుకుని ప్రకృతి ప్రత్యయ విభాగముచేసి సంస్కరించినారు పాణిన్యాదులు. "సంస్కారము" అనగా దిద్దడముకాదు. లోపాగమ ప్రత్యయాదులు నిరూపించడమే "సంస్కార" మనిపించుకొంటుంది. ఒక పొల్లయినా లోకుల వాడుకలోఉన్నది తీసివేయకూడదు ; లేనిది చేర్చకూడదు. వైవిధ్యము ఎంత ఉన్నా ఉపేక్షింపకూడదు, అది అంతా అనుశాసనములో చేరవలెను. ఒకటి రెండు ఉదాహరణములు చూడండి. ప్రదత్త, ఆదత్త, దేవదత్త, మొదలయిన శబ్దములలో ధాతువుయొక్క అంశము "ద" ఉన్నది. అదే లోపించి, ప్రత్త, ఆత్త, దేవత్త మొదలయిన రూపాంతరములుపొంది శిష్టుల వాడుకలో ఉన్నందున, అవి సాధుశబ్దములుగా అంగీకరించి వాటిని అనుశాసించినారు. వృషోదరాది శబ్దాలకు సూత్రాలు కల్పించలేకపోయినా, సాధువులే అన్నారు.

దండి చెప్పిన శబ్దహీనత్వదోషము నిరూపిస్తూ వ్యాఖ్యాత వ్రాసిన వాక్యము ఒకటి ఉదాహరిస్తాను. "శిష్టానాముక్తౌ సూత్రాణా మభావే అనుశాసనకారిణఏవ దండనీయాః" శిష్టులు వాడిన మాటలకు అనుశాసనము లేకపోతే, తప్పు అనుశాసనము చేసినవారిదేకాని వాడినవారిది కాదు.

అయితే ఒకానొక సందర్భములో ఒకశబ్దము ఉచితమా అనుచితమా అనే విషయము కళాకోవిదులు చర్చించవలసినదే. కాని, భాషానుశాసకులు దాని ఊసు ఎత్తుకోరు. భాషారచన ఒక కళ. ఇంగ్లీషులో ఈ రచనలోని భేదాలను

బట్టి Poetic diction అని, Prose diction అని, అందులో ఇంకా Higher imaginative prose diction అని, Oratorical Style అని, Conversational style అని అనేకవిధాల గ్రంథకర్తల భాష విభజిస్తారు. అట్టి విభాగములు సారస్వతము, సాహిత్యము బాగా వృద్ధిపొంది అనేకులు అనేకగ్రంథములు, అనేక విధములైనవి రచించినపిమ్మట, వాటినిబట్టి లక్షణము నిరూపించేవారు నియమాలు చేసినారు. ముందుగా ఆంధ్రశబ్దచింతామణి రచించి, దానికి అనురూపముగా నన్నయగారు భారతము రచించినారని వాదించడము హాస్యాస్పదము కాదా? ముందుగా నియమాలు చేసి, వాటి ప్రకారం లోకులచేత భాషావ్యవహారము చేయించడమునకు ప్రయత్నించడము అట్టిదే—యూరప్ ఖండములోని భాష లన్నిటిలో ఫ్రెంచి మిక్కిలి మెరుగెక్కినదనిన్ని ఫ్రెంచి సాహిత్యపరిషత్తువారు చేసిన వ్యవస్థలచొప్పున గ్రంథకర్తలు భాషారచన చేస్తారనిన్ని అందువల్ల అది ఏకరూపముతో విలసిల్లుతూ ఉంటుందనిన్ని 18వ శతాబ్దిలో పేరు పొందినది. అయితే అట్టిభాషలో గ్రంథాలు రచించేవారు క్షీణిస్తున్నారుండే. ఫ్రెంచిభాషకు ఇప్పుడు నియంతలు పండితులు కారు, ప్రజలు; * తమభాషే దేశభాష అంటారుప్రజలు. అనేక వార్తాపత్రికలలో (మన ప్రజామిత్ర, ప్రజాబంధు, వాహిని, గృహలక్ష్మి మొదలయినవాటిలో వలెనే) వ్యావహారికభాష వాడుతున్నారు. "శిష్టభాష" లో సంపాదకీయ వ్యాసములు రచించేవారు ఇంకా ఉన్నారుగాని, పండితసభలలో నయినా ఆ భాష వినబడదు. అందుచేత ఆ భాషకు కాలము ఆసన్నమయినది అన్నారు Vendreys గారు*. అంతేకాక ఆ భాషలో చక్కగా రచనచేయగలవారి సంఖ్య తగ్గిపోతూ ఉన్నది. కావ్యరచన కళగా అభ్యసించేవారు చాలాకాలము గురుశుశ్రూష చేస్తేనేకాని "కావ్య" భాషరాదు. ఆ భాష లోకములో అప్రయుక్తము కావడమువల్ల సదా కావ్యరచన చేస్తూ ఉన్నవారికేగాని అది వ్యావహారిక భాషవలె, "స్వాయత్తము" కాదు. కత్తులమీద నాట్యం చేయడము వంటిది అట్టి భాషలో రచనచేయడము. ప్రమాదముచేత అపశబ్దము ప్రయుక్తమైతే పత్రికలలో ఎగతాళిచేస్తారు. అందు

---

* The peuple est souverain en matiere de langage. (The people is sovereign in matters of language.)

* " In any case, it can be foreseen that the fate of this literary French will be that of Latin. It will be preserved as a dead language, with its rules and vocabularies fixed once for all. The living language will continue to develop independently of it."

చేత ప్రజలభాషలోనే నానావిధమయిన కావ్యాలు రచించడమువకు నవ్యసాహిత్య ప్రియులు పూనుకొని కృషి చేస్తున్నారు. +

ఏకరూపమయిన Standard భాష లేకపోవడం గొప్పలోపముగా పార్వతీశ్వరశాస్త్రులుగారు, కామేశ్వరరావుగారు ఇంకా అనేకులు భావిస్తున్నట్టు కనబడుతున్నది. ఆంధ్రదేశములో అన్నిమండములవారికీ పరస్పరసంబంధం అన్నివిధాలా ఎప్పుడు ఏర్పడుతుందో; ప్రజలకు, నూటికి తొంభయిమంది చొప్పున అయినా, 'చదువు ఎప్పుడు వస్తుందో అప్పుడు ఆంధ్ర భాషకు Standard దానంతట అదే ఏర్పడుతుంది. అదైనా కేవలమూ ఏకరూపమున ఉండదు సుమండీ. పరమైకతగల భాష లోకములో ఎక్కడాలేదు. * సృష్టిలో ఏరెండు వస్తువులూ అన్నివిధాలా ఒక్కలాగున ఉండవు. Standard కోసము మనము పరితపించనక్కరలేదు. పండితుల ప్రయత్నంవల్ల అది ఏర్పడదు.

కథలూ, నాటకాలూ, పాటలూ ఇంకా ఇటువంటి రసవద్రచనలు చేసే వారు, ప్రతిభావంతులయితే, పురాణపద్ధతులు అవలంబించరు. వారి రచనలలో 'వ్యక్తిత్వ' ముంటుంది. అద్దెచీట్లు, క్రయచీట్లు, ఒడంబడికలు ప్రభుత్వము వారి శాసనాలూ, ప్రకటనలూ ఇటువంటివి Standard భాషలో ఉంటవి. కావ్యాలలో కవులు తమ ఔచిత్యజ్ఞానమును అనుసరించి శబ్దాలు ప్రయోగిస్తారు. ఇతరుల నియమాలు పాటించరు. అలంకారశాస్త్రమందు గ్రామ్యమన్న 'గల్ల' శబ్దము భవభూతి వాడినాడు. ఆంధ్రవ్యాకరణాలలో అసాధువులన్నమాటలు ఆంధ్రభారతములోనే ఉన్నవి. కామేశ్వరరావుగారు కొన్ని 'కుదింపులు' ఉచిత ములంటారు; కొన్ని అనుచితములంటారు. ఔచిత్యానుచిత్యములకు ప్రమాణ మేమిటి? కేవలము ఇష్టత అనిష్టత ప్రమాణములు కావు. వర్ణలోపముగానీ

---

+ గ్రాంథికాంధ్రములో సంపాదకీయ వ్యాసాలూ పుస్తకాలూ రచిస్తూ ఉన్నవారుచేసే తప్పులు ఈలాగునచూపిస్తూ ఉంటే ఈదంభాలు అంతమవుతవి.

* Standard English like standard French, is now more a class dialect than a local dialect. It is the language of the educated all over Great Britain. But it is not yet perfectly uniform. It is still liable to be influencd by the local dialects in grammar and vocabulary and still more in pronunciation.

Again English, like all other living languages, changes from generation to generation Pronunciations which are vulgar in one century may become fashionable in the next...

A spoken language is, therefore, necessarily a vague and floating entity. And English is no exception to the rule...*A standard spoken language is, strickly speaking an abstraction* No two speakers *of standard English pronounce exactly alike''* Encyc. *Britanica–Phonetics.*)

ఆగమముకానీ, ఆదేశముకానీ, శిష్టవ్యవహారమందున్నది అసాధువు కాదు. ఇంతేకాక ఉత్సర్గాపవాదములుగా అనుశాసనము చేయవలెను గాని ప్రతిపద పాఠము కూడదు; అది అసాధ్యము. బృహస్పతివంటి గురువు ఇంద్రునివంటి శిష్యునిచేత శబ్దపారాయణము చేయిస్తే, వెయ్యి దివ్యవర్షాలైనా అంతం కాలేదట!

పార్వతీశ్వరశాస్త్రిగారు "చేయాలె" అనే శబ్దము Standard కాదు; dialectal అంటారు. 'చేయవలెను' 'చేయవలె' అయినది. పిమ్మట 'వ'కారము లోపించి, పూర్వాచ్చుకు దీర్ఘము వచ్చినది. ఇట్టిమార్పు తిక్కన కాలములోనే కనబడుతున్నది. 'పోయినవాఁడు' = 'పోయినాఁడు', 'మాయలవాఁడు' = 'మాయలాఁడు'—ఇట్టివి నన్నయ గ్రంథములో లేవుగాని తిక్కన గ్రంథములో ఉన్నవి. ఈ మార్పు క్రమంగా వ్యాపించినందున 'చేయవలె' 'చేయాలె' అయినది. అందరూ వాడుతూఉన్న శబ్దము Standard కాదా? Standard అంటే అట్టిదే. వ్రాతలో వైవిధ్యము ముద్రణాలయములో తొలగించవచ్చును. 'ఉన్నాయి,' 'ఉన్నయి,' 'ఉన్నై,' 'ఉన్నాయ్,' 'ఉన్నయ్' అనే రూపములు పత్రికలలోను, పుస్తకాలలోను కనబడుతున్నవి. శిలాశాసనములలో వర్ణక్రమము వ్యత్యస్తముగా ఉన్నది. తెలుగుభాష మాతృభాషగా కాట్లాడేవారిని ఈ వైవిధ్యము బాధించదు; తెలుగుభాష నేర్చుకొనే విదేశీయులకు భ్రాంతిజనకముగా ఉండవచ్చును. Caxton అచ్చుయంత్రము ఇంగ్లండులో స్థాపించి గ్రంథాలు అచ్చువేయడమునకు మొదలు పెట్టినప్పుడు, వ్రాతప్రతులలోని శబ్దరూపములు (Spelling) బహువిధాలుగా కనబడ్డవి. ఎవరిపద్ధతి వారిది. నోటిని ఉచ్చరించినట్లు కాగితముమీద వ్రాయడానికి నియమాలు అప్పుడులేవు. క్రమంగా ఏర్పడ్డవి. ఇప్పుడు కూడా (Centre, Contre అని) అనేక శబ్దాలు వివిధముగా ఇంగ్లీషువారు వ్రాస్తున్నారు. అమెరికావారు Spelling లో కొన్నిమార్పులు చేసినారు. ఇందులో ఎంతవైషమ్యమున్నా ఇంగ్లాండులోనివారు అమెరికావారి పుస్తకాలు చదువుకోగలరు; అట్లే అమెరికావారు ఇంగ్లండులోనివారి పుస్తకాలు చదువుకోగలరు. ఇంగ్లండులో అనేక 'మాండలీయక' భాషలున్నవి. వాటికి Spelling నియమాలు ఏర్పడలేదు. నవలలలోను నాటకాలలోను అట్టి భాషలు పాత్రోచితముగా ప్రయోగించినప్పుడు గ్రంథకర్తలు ఎవరికి ఏలాగునతోస్తే ఆలాగున వ్రాస్తున్నారు. 'Always' అనేమాట ఒకరు allays అని, ఒకరు awlus అని వ్రాస్తారు. Half-penny worth అనేది ఒకరు halporth అని, ఒకరు ha' porth అని, ఒకరు hapeth అని వ్రాస్తారు. షా గారు Tuesday, stupid అనే మాటలు Choosda, Schoopid అని వ్రాస్తారు. ఇట్టివారి

భాష కేవలమూ ఆధునికము. "ఏమండీ! ఉద్గ్రంథాలు ప్రౌఢమయిన శైలిలో రచించరేమి?" అంటే, "మేము ఇప్పటివారి కోసము వ్రాస్తున్నాముగాని ఇరవై రెండో శతాబ్దివారికోసము కాదు" అంటారు. ఐర్లండులో Synge వంటి ప్రఖ్యాత రచయితలు పామరులభాష నేర్చుకుని, అది రసవంతములయిన నాటకాలలోను, కథలలోను వాడుతున్నారు. దేశాటనముచేసేవారు తమగ్రంథాలలో అన్యదేశ్యములేకాక మాండలీయకాలు కూడా యథేచ్ఛముగా ప్రయోగిస్తున్నారు. అట్టివి Standard భాషలో అంతర్భూతము లవుతూ దానిని "వృద్ధి" పొందిస్తూఉంటవి. కామేశ్వరరావుగారు ఈ గ్రంథములో చేర్చిన మాండలీయకముల పట్టికలు వినోదకరములేకాదు, మిక్కిలి ఉపయుక్తమయినవి కూడాను. అట్టివి ఎన్నిఅయినా చాలవు. వాటి ప్రయోజనము అపరిమితము. వివిధమండలములలో నివసించి ఉన్న తెలుగువారిలో పరస్పరమైత్రి కలిగించుటకు అవి ఉపకరిస్తవి. కామేశ్వరరావుగారు ఈ కృషిలో మార్గదర్శకులయినారు. ఇతరులు కూడా ఇట్టిపనిచేస్తే భాషాసేవ చేసినవారవుతారు.

షేక్స్పియరు కాలములో ఇంగ్లీషుభాష అశ్రుతపూర్వంగా విజృంభించినట్లు ఈకాలములో తెలుగుభాష విజృంభిస్తున్నది. ఇంగ్లీషు భాషకు అప్పుడు కట్లూ గట్లూ ఉండాలని ఎవ్వరూ అభిలషించలేదు. అప్పుడు కావలసినది స్వేచ్ఛగాని నిర్బంధము కాదు. వెల్లువవలె భాష ప్రవహించినది. వరదతో బురదా చెత్తా వచ్చిపడ్డది. అది అంతా క్రమంగా అడుగంటినది. స్వచ్ఛమయిన భాష తేరినది. అప్పటినుంచి ఇప్పటివరకూ ఇంగ్లీషుభాషావాహిని గట్టులేకుండానే 'థేమ్స్' నదివలె నిర్మలముగా ఉన్నది. ఏటిలోనికి కొత్తనీరు రాకుండా గట్టు కట్టితే, ఏరు ఎండిపోతుంది; నీరుంటే మురిగిపోతుంది. భాషా స్వభావమును అనుసరించి, భాషలో భావబోధమునకు కావలసిన మార్పులు కలుగుతూఉంటవి.

మన దేశములోని భాష లన్నిటిలో బంగాళీభాష మిక్కిలి వికాసము పొందడమునకు కారణము దానికి "పండితులు" నిర్మించిన గట్లు కొట్టివేయడమే; ఇట్టి గట్లవల్ల ఎంతకీడు బంగాళీభాషకు కలిగినదో శ్రీ రవీంద్రనాథ ఠాకూరుగారు తెలియజేస్తూ ఇరవయియేళ్లకిందట వ్రాసిన వ్యాసములోని వాక్యములు ఉదాహరిస్తాను. అవి ఆంధ్రభాషాభిమానులు సావధానముగా చిత్తగింతురుగాక.

"I have found that the direct influence which the Calcutta University wields over our language is not strengthening and vitalising but pedantic and narrow. It tries to perpetuate the anachronism of preserving the Pandit-made

Bengali swathed in grammar wrappings borrowed from a dead language. It is every day becoming a more formidable obstacle in the way of our boys' acquiring that mastery of their Mother-tongue which is of life and literature. The artificial language of a learned mediocrity, inert and formal, ponderous and didactic, devoid of the least breath of creative vitality, is forced upon our boys at the most receptive period of their life... In the modern European Univesrities the medium of instruction being the vernacular, the students in receiving, recording and communicating their lessons, perpectually come into intimate touch with it, making its acquaintance where it is not slavishly domineered by one particular sect of acadamicians. The personalities of various authors, the individualities of their styles, the relation of the living power of their language are constantly and closely brought to their minds... But our students have not the same opportunity, except in their private studies and according to their private tastes. And, therefore, their minds are more liable to come under the influence of some inflexible standard of language manufactured by pedagogues and not given birth to by the genius of artists. I assert once again that those who, from their position and authority have the power and the wish to help our language in the unfolding of its possibilities, must know that in the present stage, *freedom of movement is of more vital necessity than fixedness of forms.* *

(Modern Review)

తెలుగుభాషా రచయితలకు ఎనభై యేళ్ళయి బడిపంతులు సంకెళ్లు తగిలించినారు. బడులలోను కళాశాలలలోను విద్యార్థులు ఇంకా సంకెళ్ళతోనే ఉన్నారు. కొందరు యువకులూ యువతులూ పండితుల బంధాలుతెంపి స్వాతంత్ర్యము సంపాదించుకొన్నారన్నమాట నిజమేకాని, "సనాతనులు" పంప్లు ఇంకా కొరుకుతున్నారు. స్వాతంత్ర్యము సంపాదించుకొన్నవారు ఉద్రిక్తులయి, బడినుండి సాయంకాలము వెడలి వచ్చిన పిల్లలవలె, యథేచ్ఛముగా విహరించడమువల్ల అట్టే హానికలుగదు. వారి స్వాతంత్ర్యమును అరికట్టడమువల్ల ఎక్కువ హానికలుగుతుంది. వ్యావహారికభాషారచన చక్కగా అభ్యసించినవారు

* ఇప్పుడు బడులలోను కళాశాలలలోను "చలిత్ భాష" అనగా వాడుకలోనున్న బంగాళీభాషలో రచనాభ్యాసము చేయిస్తున్నారు.

మంచిపుస్తకములు వ్రాసి ప్రకటిస్తే అవి సామాన్యులకు ఆదర్శములుగా ఉపకరిస్తవి. పిల్లలు పెద్దలను అనుకరించికదా మాతృభాష నేర్చుకొంటారు; అట్లే గ్రంథరచన కూడాను. కామేశ్వరరావుగారున్ను పార్వతీశ్వరశాస్త్రిగారున్ను గ్రంథరచన అభ్యసించి, దానిలో నైపుణ్యము సంపాదించినవారు గనుక వారికి ఉచితమనితోచిన 'నియమాలు' అవలంబించి గద్యకావ్యాలుగాని పద్యకావ్యాలుగాని రచిస్తే, వారి ఉద్దేశము నెరవేరుతుంది. వ్యాకరణాలు వల్లించి మాతృభాష నేర్చుకోవడము ఎప్పుడూ ఏ దేశములోనూ జరుగలేదు. బాల్యములో ఉన్న అన్యభాషలు నేర్చుకోవడమునకయినా వ్యాకరణము ఆవశ్యకముకాదు; సహవాసము వల్లనే అది అలవడుతుంది.

నా భాష పందొమ్మిదో శతాబ్దిదనిన్ని అది నేటివారికి అనుకరణయోగ్యము కాదనిన్ని కామేశ్వరరావుగారు అన్నారు. అవును; నేను ఆ శతాబ్దిలో పుట్టి పెరిగినవాడను. గనుక అప్పటి భాష నాకు అలవాటయినది. వారిభాష వారి మనుమలకు పాతభాష అవుతుంది. అందులో వైపరీత్యమేమీలేదు; హానీలేదు. ఒకరి మాట ఒకరికి తెలియకపోదుకదా! స్వస్తి.

రాజమహేంద్రవరం
16—12—1938.

గిడుగు వెంకటరామమూర్తి

# తుది విన్నపము*

శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు

నేడు సుదినం :

మీవంటివారి దర్శనం కలిగింది. 'ప్రజామిత్ర' పత్రికాసంపాదకు లయిన శ్రీ రామబ్రహ్మంగారు నాయెడల దయగలవారు. గనుక నేటిసాయం కాలం ఈ సభ ఏర్పరిచారు. తెలుగు సారస్వతమందూ తెలుగువారి విద్యాభివృద్ధి యందూ అభిమానము గల పండితులకున్నూ కవులకున్నూ పత్రికా సంపాదకుల కున్నూ నా కట్టకడపటి విన్నపము తెలియజేయడానికి అవకాశం కలుగజేశారు.

నా ఆరోగ్యం చెడిపోయినది. కాలేయంలో గుల్మ పుట్టినది; చికిత్స కోసం చెన్నపట్టణం వచ్చాను. అట్టేకాలం జీవించగలనని తోచదు. జీవించి ఉన్నా చాలా కృశించిపోయి ఉన్నాను. గనుక మునుపటిలాగున మరి ఉపన్యా సాలు చేయలేను.

అందుచేత ఇదే నాకట్టకడపటి విన్నప మంటున్నాను, ఇంక జరుగవల సిన పని మీకే అప్పగిస్తున్నాను. మీరే సాగించవలెను.

ఇప్పుడు లోకంలో పత్రికలు చేస్తూ ఉండే పని సామాన్యమయినది కాదు. పత్రికాసంపాదకులు సామాన్యులుకారు. ప్రభుత్వవర్గాన్ని, మంత్రి వర్గాన్ని, పరిపాలనావిధానాన్ని మార్చివేయగలశక్తి పత్రికలకున్నూ, పత్రికా సంపాదకులకున్నూ ఉన్నది. పత్రికలకు అదీ ఇదీ అనికాదు; అన్నివిషయాల తోను సంబంధముంటుంది. పత్రికా సంపాదకులు అన్ని విషయాలగురించిన్నీ వ్రాయగల సమర్థత, ప్రజ్ఞ గలవారు కాకపోయినా ఆయా విషయాలలో అను భవము గల ప్రజ్ఞావంతులచేత సకల విషయాలగురించిన్నీ వ్రాయించి దేశంలో విద్య వ్యాపింపజేయగలరు.

ప్రజలలో విద్య వ్యాపింపచేయడమూ, ప్రజల ఆరోగ్యము కాపాడ డమూ, ప్రజల సౌఖ్యము పోషించడమూ సంఘంలోని పెద్దలు చేయవలసిన పని అంటే అదేమో ప్రజల నుద్ధరించడానికి చేయవలసిన ధర్మకార్య మని ఆలోచించకూడదు. భాగ్యవంతులయిన పెద్దలు తమ ఆరోగ్యం కాపాడుకోనవలె నంటే ప్రజల ఆరోగ్యం కాపాడవలెను.

---

* ౧౫-౧-౪౦ తేదీని శ్రీ పంతులుగారు ప్రజామిత్ర కార్యాలయములో చేసిన ఉపన్యాససారాంశము.

ప్రజలఆరోగ్యం కాపాడకపోతే పెద్దలు ఎన్ని కట్టుదిట్టాలు చేసుకొన్నా అంటురోగాలు వారిని అంటకమానవు. వారి ఆరోగ్యం చెడక మానదు.

ఆవిధంగానే సంఘంలో నిరక్షరకుక్షులు ఎక్కువగా ఉన్నంతకాలము సంఘం వృద్ధిలోకి రాదు. సౌఖ్యమన్నది సంఘంలోని భాగ్యవంతులూ, పెద్దలూ, సామాన్య ప్రజలతోపాటు సమాంశులుగా అనుభవించవలసినదేకాని తా మొక్కరే అనుభవించవలసినదికాదు. ప్రజలలో విద్య వ్యాపిస్తేకాని సంఘం వృద్ధిలోనికి రాదు.

ఐతే, ప్రజలలో వ్యాపించవలసిన విద్య ఈ కాలానికి పనికిరాని ప్రాచీన కావ్యాలు వ్యాకరణాలు చదివించడంవల్ల రాదు. ఇంగ్లండులో కూలివాండ్లు కమ్మర్లు మొదలైనవాండ్లు షేక్స్పియర్, మిల్టన్ మొదలైన మహాకవుల గ్రంథాలు చదువమంటే చదువరు.

"మాకు కడుపునిండా తిండి దొరికే మార్గం చెప్పండి. మా వృత్తులకు సంబంధించే విద్యలు మాకునేర్పండి" అంటారు. అందుచేత, వాళ్ళకోసం ఇది వరకున్న విద్యావిధానమంతా మార్చవలసి వస్తున్నది, కర్మాగారాలున్న ప్రదేశాలకు విద్యాధికులుపోయి వాళ్ళకు తెలిసే భాషలో ఉపన్యాసాలిస్తూ, ఉపన్యాస విషయాలు చర్చిస్తూ ప్రజలకు జ్ఞానము, వివేకము కలుగజేస్తున్నారు.

రేడియో ప్రసంగాలవల్లను, పత్రికలవల్లను, పుస్తకాలవల్లను ప్రజలలో విద్య వ్యాపిస్తూ ఉన్నది. ఇంగ్లండు మొదలైన పాశ్చాత్యదేశాలలో కేవలం ప్రజలకోసం పెద్ద సారస్వతం పుట్టి వృద్ధిపొందుతూ ఉన్నది. అది అంతా ప్రజల భాషలోనే ఉంటుంది. ఆవిధంగానే మన దేశంలోకూడా ప్రజలలో విద్య వ్యాపించడానికి అనుకూలమైన గ్రంథాలు కావలెను. ప్రజలు తమభాషలో వ్రాయడానికీ చదవడానికీ సమర్థులు కావలెను.

ప్రజలలో విద్య ఎక్కువగా వ్యాపింపజేయడానికీ, నవీనాశయములకు అనుకూలంగా అందరిలోను హృదయపరివర్తనం కలుగజేయడానికీ ఎక్కువగా తోడుపడేవి పత్రికలే; కనుక పత్రికా సంపాదకులకు నా విన్నపము తెలియజేస్తున్నాను.

సుమారు 30 సంవత్సరములై వర్తమానాంధ్రభాషా ప్రయోజనముగురించి పాటుబడుతూ ఉన్నాను. వ్యావహారిక భాషాగౌరవమును నిలబెట్టడానికి నేను ప్రయత్నిస్తూఉంటే దానిని పడగొట్టడానికి ఆంధ్రసాహిత్య పరిషత్తువారు పని చేస్తూ వచ్చారు.

మొదట నేనూ నామిత్రుడు గురజాడ అప్పారావూ, మాకు తోడుగా మరి ఇద్దరు ముగ్గురు మాత్రమే ఈ ఉద్యమము ప్రారంభించాము. తక్కిన

తెలుగువా రందరూ మాకు ప్రతికూలంగా ఆంధ్రసాహిత్య పరిషత్తువారితో కలిసి మా ఉద్యమాన్ని ఎదిరించినవారే.

ఆ కాలంలో ఆంధ్రసాహిత్య పరిషత్తువారి ప్రతిష్ఠా, గౌరవమూ, ప్రాభవమూ ఎక్కువగా ఉండడంవల్లనూ వ్యావహారికభాషాప్రయోజనము సరిగా బోధపడకపోవడంవల్లనూ ఆ పరిషత్తువారి అభిప్రాయము ననుసరించి తెలుగు దేశమందలి పెద్దలందరూ తీర్మానాలుచేసి గవర్నమెంటువారికి ఎక్కువగా ఒత్తిడి కలిగించి వాస్తవమైన దేశభాష బడిపిల్లలు అభ్యసించకుండా చేశారు.

అప్పుడు "నిజమైన సంప్రదాయము" అనే పేరను చిన్నవ్యాస మొకటి రచించాను. అది శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిలుగారు అచ్చువేయించి ప్రకటించారు. అందులో విద్యార్థులు చదువుకొనే గ్రంథాలన్నీ మనపూర్వులు వ్యావహారిక భాషలోనే రచించేవారని కొన్ని నిదర్శనాలు చూపించాను.

దేశంలో అందరూ మీ వాదానికి ప్రతికూలంగా ఒత్తిడి కలుగజేస్తున్నారు గనుక వ్యావహారిక భాషాప్రయోజనం అంగీకరింపజాలమని గవర్నమెంటువారున్నూ యూనివర్సిటీవారున్నూ అనడంచేత, తెలుగుదేశమంతా తిరిగి నిజమైన సంప్రదాయం తెలియబరచి ప్రచారం సాగించాను.

పరవస్తు చిన్నయసూరి కావ్యభాషలో తననీతిచంద్రిక రచించి గద్యరచనకు కావ్యభాషాసంప్రదాయం తెచ్చిపెట్టక పూర్వము వ్యావహారిక భాషలో సకలవిధములైన గద్యరచనలు సాగుతూ ఉండేవని రుజువుచేయడానికి వ్యావహారికభాషలో రచించిన వ్రాతపుస్తకాలూ మొట్టమొదట అచ్చుపడ్డ పుస్తకాలూ కొన్నిసంపాదించి అవి పట్టుకొని తెలుగుదేశంలో ఉన్న కాలేజీలకువెళ్ళి అక్కడి పండితులకూ ఉపాధ్యాయులకూ చూపించాను. చాలాచోట్ల సభలలో ఈ విషయమై ఉపన్యాసాలిచ్చాను

1916-వ సం॥ నవంబరు 19-వ తేదీని కొవ్వూరిలో జరిగిన ఆంధ్రసారస్వత మహాసభలో వందలకొలది తెలుగుపండితులూ కవులూ నావాదమంగీకరించారు. 1919-వ సం ఫిబ్రవరి 28-వ తేదీని రాజమహేంద్రవరమందు కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగంపంతులుగారు అధ్యక్షులుగా వర్తమానాంధ్ర భాషాప్రవర్తక సమాజము స్థాపించుటకు ఏర్పాట్లు జరిగినవి.

కాని పంతులుగారు మరి మూడుమాసములకే పరమపదము పొందుటవల్ల వారి తోడ్పాటు మా సమాజమునకు లేకపోయినది. అయినా మాఉద్యమం సాగకపోలేదు.

1919 సం॥ లోనే నా "తెలుగు" పత్రిక ప్రకటించి అందులో వ్యావహారిక భాషాప్రయోజనం గురించి, ఆంధ్ర పండితభిషక్కుల భాషాభేషజం

గురించి, ఆంధ్రభాషా పరిణామముగురించి వ్యాసాలు రచించి ప్రకటించాను. అవి చాలమంది పండితులూ కవులూ చదివారు. క్రమక్రమముగా నా వాదము ఆమోదించే వారిసంఖ్య అధికమవుతూ వచ్చింది. పత్రికా సంపాదకులందరూ తమ పత్రికలందు వాడుకభాషలో రచించిన వ్యాసాలకు కొంచెము కొంచెముగా నైనా అవకాశం కలుగజేస్తూ వచ్చారు.

తుదకు 1926 సం॥ తణుకులో ఆంధ్రసాహిత్యపరిషత్ సాంవత్సరికోత్సవము జరిగినప్పుడు సభలోనివారు అందరూ కాకపోయినా అనేకులు వ్యావహారిక భాషాప్రయోజనం అంగీకరించారు. దానితో పరిషత్తు పెద్దలు ఉపద్రవము జరిగిపోయినట్లుగా భయపడి అటుపైని జరిగే సాంవత్సరికోత్సవములలో అటువంటి తీర్మానాలు మరి కాకుండా ఉండేటట్లున్ను వ్యావహారిక భాషావాదు లెవరూ తమ పరిషత్తులో సభ్యులుగా చేరకుండా ఉండేటట్లున్ను కట్టుదిట్టాలు చేసుకొన్నారు.

దేశంలో అంతకంతకు వ్యావహారిక భాషావాదము అంగీకరించినవారి సంఖ్య ఎక్కువగుట చేతను ఆంధ్రసాహిత్య పరిషత్తువారి ఉద్దేశములను ఆమోదించేవారి సంఖ్య తక్కువగుటచేతను ఆ పరిషత్తు క్షీణించినది: పరిషత్ పత్రిక మరి కనబడదు. నా వాదమును పూర్తిగా ఆమోదించిన నా మిత్రులు 'నవ్యసాహిత్య పరిషత్తు' స్థాపించి "ప్రతిభ" అనే పత్రిక ప్రకటిస్తున్నారు. ఆ పత్రికేకాదు, అన్ని పత్రికలున్నూ వ్యావహారిక భాషా ప్రయోజనమును అంగీకరించినవి.

పందలకొలది కవులూ పండితులూ తమ వాడుకభాషలో రచన సాగిస్తున్నారు. ఇంతమట్టుకైనా నాకృషి ఫలించినందుకు నేను కృతార్థుడ నైనానని సంతోషిస్తున్నాను. కాని బడులలోను కాలేజీలలోను ప్రభుత్వమువారున్ను విశ్వవిద్యాలయములవారున్ను వ్యావహారిక భాషాప్రయోజనము అంగీకరించే వరకు నా వాదముపూర్తిగా నెగ్గినదని నేను భావించలేను. 'దేశంలో అందరున్ను మీకు ప్రతికూలంగా ఉన్నారు, గనుక వ్యావహారిక భాషాప్రయోజనము మేము అంగీకరించలే'మని గదా ప్రభుత్వమువారున్ను విశ్వవిద్యాలయమువారున్ను 25సంవత్సరాల క్రిందట అన్నారు.

ఈ 25 సంవత్సరాలలో ఇంతమట్టుకు పరివర్తనం జరిగింది గనుక ఇకనైనా బడులలోను కాలేజీలలోను వ్యావహారికభాష మూలంగా విద్య సాగేటట్టు చూడవలసిఉన్నది. ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు నాకు 'కళాప్రపూర్ణ' బిరుదు అనుగ్రహించడం నా గ్రాంథికభాషా పాండిత్యానికి కాదుగదా! నా వ్యావహారిక భాషావాదము ఆమోదించే ఈ గౌరవము నాకు ప్రసాదించారనక తప్పదు.

నన్ను గౌరవించినందుకు నేను కృతజ్ఞుడనే కాని వ్యావహారిక భాషా ప్రయోజనము ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు అంగీకరించి ఆచరణలో పెట్టినదాకా నేను పూర్తిగా కృతకృత్యుణ్ణయినా నని సంతోషించలేను.

ఈ నడుమ విశ్వవిద్యాలయమువారి తెలుగుపరీక్షలలో వ్యాసరచనకు ఒక విషయంగా రేడియో ప్రసంగములవంటి ప్రసంగ మొకటి వాడుక భాషలో విద్యార్థులు రచించేటట్టు ఏర్పరచవలసిన దని అకడెమిక్ కౌన్సిలులో ఒకరు తీర్మానం ప్రవేశపెడితే అది బోర్డు ఆఫ్ స్టడీజువారి అభిప్రాయానికి పంపించా లన్నారు.

ప్రభుత్వమువారు బహుమతులలో ఎందుకూ పొందని దిక్కుమాలిన కృతు లాంధ్రభాషలో రచించిన వాచకాలే కావలెనంటున్నారు; వాడుకభాషలో రచించిన పుస్తకాలు "అప్రూవ్" చేయమంటున్నారు.

ఎందుచేత? వ్యావహారిక భాష అంటే గ్రామ్యమన్న దురభిప్రాయం మన పెద్దలకి వదలలేదు. వ్యావహారిక భాషే వాస్తవమైన మాతృభాష అన్న విషయం ఎంత చెప్పినా వారు గ్రహించడం లేదు. ఏమిచేయను? వ్యావహారిక భాషను గ్రామ్యమనకూడదని మరియొకసారి గట్టిగా నచ్చచెప్తున్నాను.

గ్రామ్యశబ్దము పారిభాషికశబ్దము. గొల్లలు మొదలయిన పామరుల భాష గ్రామ్యమని సంస్కృత సారస్వతములో అలంకారికు లన్నారు. లక్షణ విరుద్ధమయిన భాష గ్రామ్యమని తెలుగు పండితులన్నారు. ఏ అర్థంలో చూచినా మన వ్యావహారిక భాషకు గ్రామ్యమన్న పేరు అన్వయించదు.

ఎందుచేతనంటే, నేను గత 30 సంవత్సరములనుండీ సమర్థిస్తూ వచ్చిన వ్యావహారిక భాష శిష్టజన వ్యావహారిక భాషే కాని గొల్లలు మొదలయిన పామరులు పలికే గ్రామ్యభాష కాదు.

లక్షణ విరుద్ధమైన భాష గ్రామ్యమన్న సూత్రము మన శిష్టజన వ్యావహారిక భాష కెంతమాత్రము వర్తించదు. ఎందుచేతనంటే ఆ సూత్రము కల్పించిన లక్షణకర్త ఉద్దేశించిన భాష భారతాది ప్రాచీన కావ్యములలోని భాష.

అయితే మన వ్యావహారిక భాషకున్ను ప్రాచీన కావ్యభాషకున్ను సంబంధమే లేదా అంటే లేకపోలేదు. సంస్కృత సారస్వతంలో వైదికభాషకున్ను లౌకికభాషకున్ను గల సంబంధంవంటి సంబంధం ఉన్నది.

మన ప్రాచీన కావ్యభాష వైదికభాషవంటిది. వ్యావహారిక భాష లౌకిక భాషవంటిది. లౌకికభాషకు లక్షణం చెప్పిన పాణిని, కాత్యాయనుడు, పతంజలి లోకంలో ఉన్న వాడుకభాష ప్రమాణంగా గ్రహించి సూత్రాలు, వార్తికాలు, ఇష్టులు రచించారు గాని వాల్మీకి వ్యాసాదులు రచించిన గ్రంథాలలోని భాష ప్రమాణంగా చూపించలేదు.

ఇంగ్లండు దేశములో చక్రవర్తిగారు, మంత్రులు, బిషప్పులు, వక్తలు, ఉపాధ్యాయులు మొదలయిన పెద్దలందరూ శిష్టులే. వారి వ్యావహారిక భాషలోనే గ్రంథాలు రచిస్తున్నారు, విద్య బోధిస్తున్నారు, ఉపన్యాసా లిస్తున్నారు. ఆ భాషలోనే మన గవర్నరుగారు రేడియో ఉపన్యాసాలు ఇచ్చారు.

ఆవిధంగానే న్యాయమూర్తులయిన సర్ పేపా రామేశంగారు, ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాలాధ్యక్షులయిన విస్సా అప్పారావుగారు పండితులును కవులునుఅయిన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, విశ్వనాధసత్యనారాయణగారు మొదలయిన పెద్దలు తమ వ్యావహారిక భాషలో రేడియో ప్రసంగాలు చేశారు.

వీ రందరూ శిష్టులే. వీరిభాష వర్తమాన శిష్టజన వ్యావహారాంధ్రభాష. వీరెవ్వరూ శిష్టులు కారంటే మన ఆంధ్రదేశంలో ఇంకెవ్వరు శిష్టులు కాగలరో నాకు తెలియదు.

వ్యావహారికభాష గ్రంథరచన కుపకరించ దనడానికి గొప్పకారణంగా భాషలోని మాండలికరూపభేదాలు చూపిస్తూ ఉంటారు కొందరు.

వాడుకభాష ఒకమండలంలో ఒక విధంగాను మరి ఒక మండలంలో మరి ఒక విధంగాను ఉంటుంది.

అక్కడి వారిమాటలు ఇక్కడివారికి ఇక్కడివారిమాటలు అక్కడివారికి తెలియవు. సర్కారు జిల్లాలవాండ్లు పప్పు అంటారు. రాయలసీమవారు బేడ లంటారు. వారు 'అద్దె' అంటే వీరు 'బాడుగ' అంటారు. వారు 'చెక్క'లంటే వీరు 'పెక్క'లంటారు; వారు 'ఆనపకాయ' అంటే వీరు 'సొరకాయ'అంటారు గనుక వాడుకభాష గ్రంథరచనకు పనికిరాదంటారు.

ఈ వాదం 30 సంవత్సరములనుంచి చేస్తూనే ఉన్నారు. అందుకు సమాధానం చెప్తూనే ఉన్నాను. నా సమాధానం విననట్టుగానే మళ్ళీ మళ్ళీ అదే వాదం చేస్తూఉంటారు. ఖండితమైన వాదం ఎక్కువసార్లు చేస్తూఉంటే దాని కేమైనా బలం వస్తుందా?

లోగడనే ఈవాదం బయలుదేరినప్పుడు "సరే మీరన్నమాట నిజమే. ఒక మండలం వారి వ్యవహారంలో పప్పు, అద్దె, చెక్కలు, ఆనపకాయ అనే మాట లున్నవి. అవి రెండో మండలంవారి వ్యవహారంలోలేవు. ఆరెండో మండలంవారి వ్యవహారంతో వాటికి సరిగా బేడలు, బాడుగ, పెక్కలు సొర కాయ అనే మాట లున్నవి. ఇవి మొదటి మండలంవారి వ్యవహారములోలేవు.

"అయితే ఏమంటారు? తమ మండలములో లేక ఇతర మండలములో ఉన్నమాటలే వాడాలంటారా? ఏమాటలూ వడరాదంటారా?

"ఈ మాటలలో ఏదీ వాడకూడదంటే ఆ విషయం వ్రాయవలసి వచ్చి నప్పుడు ఏలాగు వ్రాయడము? ఏమాట ప్రయోగించము? సొరకాయావద్దు; ఆనపకాయా వద్దు 'అలాబూ' అని సంస్కృతంమాట వాడమంటారా?" అని నేను అడిగినప్పుడు నా ప్రతిపక్షులు ఒకరి మొగము ఒకరు చూచుకొని మారు మాటాడలేక ఊరుకున్నారు.

మాండలిక శబ్దాలు అన్ని భాషలలోను ఉంటవి. అన్నీ సాధువులే. భాషాలక్షణం చేసేవారు ఈ రూపాలన్నీ సేకరించి అనుశాసిస్తారు.

పాణిన్యాదులు అలాగే చేశారు. ప్రాచాం—ఈరూపము, ఉదీచాం—ఈ రూపము అంటూ అనేకంగా మాండలిక శబ్దాలు అనుశాసించారు.

మన తెలుగు కవులు మాండలిక శబ్దాలు వాడుక చేశారు. 'పప్పు' శ్రీనాథుని హరవిలాసంలోను, 'బేడలు' ఆముక్తమాల్యదలోను ప్రయుక్తము లయి ఉన్నవి.

మాండలీయకశబ్దాలు వ్యావహారిక, భాషాప్రయోజనానికి ప్రతిబంధక మనేవారికి లక్షణ సంప్రదాయం తెలియదని చెప్పాలి.

> " కేశవ! యాంధ్రులు నానాదేశంబులయందు నిలిచి తెలుగులె తత్త
> ద్దేశోక్తు లంట బలికిన నా శబ్దము లన్యదేశ్యజాంధ్రము లయ్యెన్"

అని అప్పకవి చెప్పలేదా? ఆంధ్రభాషార్ణవము ఆంధ్రనామసంగ్రహము మొదలయిన నిఘంటువులలో ఈ మాండలీయక శబ్దాలు చేరలేదా? ఇవి అన్నీ శబ్దరత్నాకరములోని కెక్కలేదా?

ఎవరివాడుకలో ఉన్నమాటలు వారుపయోగిస్తారు. ఆ మాటలు తమ మండలము వారికేకాని తక్కిన మండలమువారికి తెలియవన్న విషయం తెలియద మేలాగు? మాండలీయక శబ్దాలనుగురించి మా ప్రతిపక్షులు చేసేవాదం సారంలేనిది. దీనిని గురించి సవిస్తరంగా నా "బాలకవి శరణ్యం"లో వ్రాసి ఉన్నాను. (చూ. పు. 271 - 274)

ప్రాచీన కావ్యభాష నేడున్న పిల్లలచేత చదివించి అందులోనే వారిచేత వ్రాయించరాదా? అది అందరికీ సామాన్యభాష అంటారు కొందరు. అది అందరికీ అన్యభాష వంటిదే. అది ఎవరికీ పట్టుపడకపోవడములోనే 'సామ్యం' అంటాను నేను.

ప్రాచీన కావ్యభాష పట్టుపడవలెనంటే సంస్కృతభాష బాగా రావాలి. తెలుగు ప్రబంధాలు, కావ్యాలు అన్నీచదివి అందులోని భాషారూపాలు గ్రహించాలి. అర్ధానుస్వార శకటరేఫనిర్ణయాలు గుర్తించాలి, ఇంతచేసినా ఆ కావ్యభాష కొంతవరకు అర్థం చేసుకోవడం సాధ్యమయితే కావచ్చునేమో కాని అది నిర్దు

ష్టంగా వాడడం ఇదివర కెవరికీ సాధ్యంకాలేదనీ, సాధ్యంకావడం అసంభవ మనీ నేను బాహాటంగా చెప్పగలను. మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారికి, రావుబహదూర్ కందుకూరి వీరేశలింగం పంతులుగారికీ గ్రాంథి కాంధ్రభాష రాదనీ సంస్కృతభాష రాదనీ వారి గ్రంథాలలోని తప్పులు చూపించారు కళాప్రపూర్ణులయిన వేదం వేంకటరాయశాస్త్రిగారు. వారు తప్పులు ఒప్పులుగాను ఒప్పులు తప్పులుగాను చెప్పారన్ని చూపించి ప్రాచీన గ్రాంథికాంధ్రభాష వారికి బాగుగా పట్టుపడలేదని నేను రుజువు చేశాను.

నేను రచించిన మిధ్యాపవాదము,ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజము చదివితే మీకి విషయం స్పష్టమవుతుంది. నాకు పూర్తిగా పట్టుపడిందని నేను చెప్పుకోవడంలేదు. ప్రాచీన కావ్యభాష ఎవరికీ చక్కగా రాదనే చెప్తున్నాను. అది పట్టుపడడం అసాధ్యమని ఎందుకంటున్నానంటే—అది పూర్తిగా తెలుసుకోడానికి తగిన సాధనాలు తక్కువ.

ఏ కవియైనా తన కావ్యములలో తనకాలంలో ఉన్న భాషంతా పూర్తిగా వాడుక చేయడానికి అవకాశ ముండదు. గనుక కావ్యాలలోనికి రానిభాష మనపు పోయినట్లేకదా. కొన్నిశబ్దాలు అకార మధ్యములో ఉకార మధ్యములో చెప్పలేము. కొన్ని శబ్దములలోని వర్ణములు పరుషములో సరళములో చెప్పడం కష్టము. ఏకవచనములో మాత్రమే కనబడుతూఉన్న శబ్దాలకు బహువచన రూపము లెట్లుంటవో చెప్పలేము. బహువచనములో మాత్రమే కనబడుతూఉన్న శబ్దాలకు ఏకవచన రూపము లెట్లుంటవో చెప్పలేము. కొన్ని విభక్తులలో మాత్రమే కనబడుతూఉన్న శబ్దాలకు తక్కిన విభక్తిరూపా లెట్లుంటవో చెప్పడం కష్టము. కొన్ని శబ్దాలు కావ్యాలలో ఉన్నా నిఘంటువులలో కనబడవు; కొన్ని శబ్దాలు గ్రాంధికభాషలో కనబడకపోయినా నిఘంటువులలో ఉన్నవి.

గ్రాంథికభాషలో శబ్దరూపాలు ఎట్లున్నవో అర్ధానుస్వారము, శకటరేఫము ఏయే శబ్దాలలో ఉన్నవో, ఎందులో లేవో తెలుసుకోవడము ఎంతకష్టమో చూడండి. ఏదైనా ఒక రూపముగురించి తగవువచ్చినా, సందేహం కలిగినా అది గ్రాంథికభాషలో లేదు; తప్పు అని చెప్పడం ఎంతసాహసమో ఆలోచించండి.

గ్రాంథికాంధ్రము పెద్దపెద్ద పండితులకే సరిగా తెలియనప్పుడు, అది చిన్నచిన్న బడిపిల్లలకు విధించడము కార్యమవునా, కాదా — ఆలోచించండి. లోకంలో ఏదైనా ఒకవృత్తి అవలంబించి బతుకుదామని ఆలోచించి కాస్త చదువు వ్రాతా నేర్చుకొని తమకు కావలసిన విషయము బోధించే పుస్తకాలు చదువుకొందామన్న సామాన్యులచేత దారీ తెన్నూ లేని ఈ గ్రాంథికభాషలో రచించిన వాచకాలు చదివిస్తే ఏమిఫలము కలుగగలదు?

... ఏండ్లు ... పాధ్యాయులై ఉన్న పంతులకే ... క్లాసులు చదివి ఏదో ఒకవృత్తి అవలంబించే పిల్లకు ఏమియు ఉపయోగిస్తుంది? వాండ్లకు వాండ్ల వాడుకభాషలో పొందికగా వ్రాయడము నేర్పిఉంటే అవి ఉపచరించును. అది నేర్పరు. ఈ గ్రాంథికభాష రాదు. అందుచేత, వాండ్లు రెంటికీ చెడి యథాప్రకారంగా నిరక్షరకుక్షులవుతారు.

దేశభాషద్వారా శిక్ష బోధిస్తేనేకాని ప్రయోజనం లేదు. శిష్టజన వ్యావహారిక భాష లోకంలో సదా వినబడుతూ ఉంటుంది. అది జీవంతో కళకళలాడుతూ ఉంటుంది. గ్రాంథికభాష గ్రంథాలలో కనబడేదే కాని వినబడేదికాదు. ప్రతిధ్వనించేది. ప్రసంగాలతో గ్రాంథికభాష ప్రయోగిస్తూ తిట్టుకొన్నా సరసాలాడుకొన్నా ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో చూడండి.

గ్రాంథికభాషయెడల నాకు ఆదరము లేకపోలేదు. ప్రాచీనకావ్యాలు చదువవద్దనీ విద్యార్థులకు నేర్పవద్దనీ నేనను. గాని ఆ భాషలో నేడు రచన సాగించడానికి పూనుకోవడము వృథా అంటున్నాను. నిర్దుష్టంగా ఎవరున్ను వ్రాయలేరు. వ్రాయగలిగినా వ్రాసేవారికీ కష్టమే. వినేవారికీ కష్టమే. వ్రాసేవాండ్లేమిచేస్తున్నారు? పాపం తమసొంత (వాడుక) భాషలో రచించుకొని గ్రాంథికీకరణం చేస్తున్నారు. అది చదివేవాండ్లు వినేవాండ్లు తమ సొంత వాడుకమాటలలోకి మార్చుకొని అర్థం చేసుకొంటున్నారు. ఎందుకీ వృథాప్రయాసం;

స్వరాజ్యం కావలెనంటున్నాము. ప్రత్యేకాంధ్రరాష్ట్రముకోసం చిక్కుపడుతున్నాము. ప్రజాస్వామిక పరిపాలనం కోరుచున్నాము. ఇటువంటి పరిస్థితులలో మన ప్రజలకు, సామాన్యజనులకు ఏభాషద్వారా జ్ఞానం కలుగచేయవలసి ఉంటుందో, ఏభాషలో గ్రంథరచన సాగించవలసి ఉంటుందో ఆలోచించండి. మీ చేతులలో పత్రికలున్నవి. పత్రికలద్వారా మీరు ఎంతైనా చేయగలరు.

—o—

